ఓం

శ్రీ గణేశ శారదా శ్రీగురుభ్యోనమః

సరస్వతీగ్రంథమండలి:
వేదాంతానుబంధము

# ఉపనిషత్సారము

గ్రంథకర్త్రి

బ్రహ్మశ్రీ ఉప్పులూరి వీరరాఘవులు పంతులుగారి భార్య

రాజయోగి

రు 2/-

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

మొదటి కూర్పు 1948

విశాపట్నం
4 - 9 - 1948

సర్వధారిసం॥ శ్రావణ
ఏకాదశీ జయవారము

Saraswathi Power Press, Rajahmundry
Printed and Published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co., Educational Publishers.
Order No. 4790/1948.

శ్రీ పింతంపాటి వెంకటసుబ్బయ్య గా
బహూకరించిన బహుమతి.

# ఉపనిషత్సారము



గ్రంథకర్త్రి: శ్రీమతి రాజయోగినాప

ఓమ్

# ఉపోద్ఘాతము

బ్రహ్మామృతాభిషిక్తులగు సాధకజనుల యుపయోగార్థమై యుపనిషత్సారము వ్రాయడమైనది. నిర్వికల్పసమాధిని, పరిపూర్ణ సమాధిని గురించి విపులముగా వ్రాయుటయే ఈగ్రంథరచనలోని నా ముఖ్యాభిప్రాయమై యున్నది.

పురుషులు సర్వాధికారులు, స్త్రీల కనేక కారణములచే నట్టి స్వాతంత్ర్యము లేదు. అజ్ఞాన మను సంసారసముద్రములో మునిగిపోవు చున్నారు. సర్వోపనిషత్తులలోని ముఖ్యాంశములను గ్రహించుట స్త్రీలకు చాలకష్టమని తోచి, అట్టివారు తరించుటకై వ్రాయడమైనది.

స్త్రీలలో చాలమంది పుణ్యచరిత లున్నారు కాని లేకపోలేదు. అభ్యాసములోనున్న మధ్యమాధికారిణు లుభయభ్రష్టలుకాక రాజమార్గము తెలిసికొని తరించుటకై యీస్వల్పగ్రంథమున 'అష్టోత్తర శతోపనిషత్తుల' సారమును వ్రాసితిని.

(బ్రహ్మసత్యం, జగన్మిథ్య) యని పెద్దలు నియమించినదే రాజమార్గము. ఏబాధలు, ఏగాధలులేని ఆరాజమార్గము స్ఫుటముగా నిందు చూపడమైనది.

ధ్యాన సమాధులలో కొంతకాలము నియమయుక్తులైయుండి, అసీమకాలమే మనస్సు నిశ్చలముగనుండి, పిదప 'శతరుద్రోపాఖ్యానము' వలె నయిపోవుటచే మిగిలినకాలము తిరిగి వ్యవహారములోనికి వచ్చుసరికి 'నీవు నేను' అను భేదబుద్ధి కూకటివేరులోనికి పారియుండును. ఆ కూకటి వేరు ఛేదము కాకపోవుటచే జను లనేకులు వివిధములగు బాధలకు లోనగుచుండుటను చూచి సహింపలేక (నాజీవితమునం దేదైన భరింప

గలనుగాని, ఎదుటిభక్తులు, జీవులు అకారణముగా బాధపడుటచూచి సహించ లేను.) ముఖ్యముగ స్త్రీలుపడుచున్న బాధలకు కారణ మజ్ఞానమే కదా యని విచారము కలిగి, జ్ఞానముకలిగినచో సంసారసముద్రము నవలీల దాటెదరేమో యనునాసచే ఇనుపగుగ్గిళ్లవలెనున్న ఈ వేదవాక్కుల సార మీరీతి తెలియజేసితిని.

చాలమంది ధ్యానసమాధులలో కొంతకాలముండి మరల సంసారాంధకారకూపమున బడుచున్నారు. అంధ్యగాధమునుండి కోటి కొకరైన బయల్పడకపోదురా యని పెద్దలు నియమించినప్రకారమే 'సవికల్ప సమాధి'. కాక నిర్వికల్పసమాధి పూర్ణసమాధులనుగురించి నా యెరిగిన కొలది విస్తరించడమయినది.

"సర్వభూతనివాసోఽసి-వాసుదేవ నమోస్తుతే" యనునట్లు సర్వభూతాత్మకమైన జగత్తున భగవంతుడున్నాడు. ఈసర్వజగత్తును వాసుదేవ స్వరూపమగుట, యేమూలమున కపకారముచేసినను భగవంతునకు చేసినట్లే ననియు నుత్కృష్టమగు మానవజన్మమునందియు వ్యర్థముగ కాలము గడిపినచో మరల నెన్నిజన్మల నెత్తవలయునో! గర్భనరకాదిఖేదము లెన్నియనుభవింపవలయునో! అనియు కోటికొకరికైన నమ్మకము కలుగక పోవునా యనెడి యాశతో నీ 'వేదామృతము బ్రహ్మామృతము' అను ఇనుపగుగ్గిళ్లను మార్దవముగ గోచరించురీతి నాశక్తికొలది విస్తరించితిని.

ఈ 'బ్రహ్మామృతము' పురాతనమునుండి పెద్దలచే నియమింపబడినది. ఈ బ్రహ్మామృత మను సంజీవి యుపయోగించినవారు జననమరణములు లేని అఖండపరిపూర్ణపదవి పొందగలరని వేఱుగ జెప్ప నవసరములేదు.

ఇంకను నిర్వికల్పసమాధి పూర్ణసమాధులలోని ముఖ్యవిషయ మేమనః సాధకుడు సర్వకాలసర్వావస్థలయందును "నేను ఎవడను? ఎక్కడి నుండి ఎక్కడికివచ్చితిని? ఏమిచేయుచున్నాను? ఎవరిపని చేయుచున్నాను? తిరిగి ఎక్కడికి వెళ్ళుదును? నా స్వరూపమేమి?" అని నిత్యానిత్య

జడత్వము మున్నగునవి లేక, ఏకత్వముగ నుండుటచే నియ్యఖండపరిపూర్ణసామ్రాజ్యము లభించినది.

నేటి కీ రాజమార్గముం దెలిసి పన్నెండు వత్సరము లయినది. ఈ మార్గము దెలిసిన నాటినుండి సంసార మతి సుగమ మనుపించెను. అజ్ఞానదశలో నున్నపుడుమాత్రమె సంసార మతిభారముగ దోచినది. జ్ఞాన మలవడిననాటనుండియు దూదిపోచకంటె తేలికగ కాన్పించినది.

మానవజన్మ మెత్తినందులకు జన్మ సార్థక మగురీతి లోకోపకార మొనర్పవలెనని చిన్నటనాటనుండియు కోరికగలదు. “అహోగురు రహోగురుః” అనునట్లు సద్గురుమూర్తి కరుణాకటాక్షముచే గృహస్థాశ్రమముననుండియు ననాయాసముగ పొందబడిన యీ రాజమార్గమును గ్రంథరూపమున బొందుపఱుపనెంచి, యారంభించి, యెనిమిది మాసములలో పూర్తిచేసి పైకోరికను నెఱవేర్చుకొనగలిగితిని.

విద్యాగంధము లేకుండుటచేతను, విషయసేకరణకాలమున నాలోచించుతఱి స్మృతిరహితనై బ్రహ్మమే శేషించుటచేతను స్ఖాలిత్యము లనేకము లుండవచ్చును. కావున చదువరులు హంసక్షీర న్యాయమున విషయమునుమాత్రమే గ్రహించి నన్ను కృతార్థురాలిం జేయగోరెదను.

నిత్యానంద ప్రపూర్ణమైన శిష్యబృందము యొక్కయు, భక్తులు జ్ఞానులు నగు ఇతరులయొక్కయు ధన సహాయముచే నీ గ్రంథ మచ్చు వేయించగల్గితిమి.

ఇతోధిక గ్రంథరచనకు ప్రోత్సాహ మిత్తురుగాక! యని పాఠకుల కభివందనము లర్పించుచున్నాను.

ఇట్లు
సర్వజనవిధేయురాలు
రాజయోగి.

విశాఖపట్టణము
28 - 4 - 1948

70/-

ఓమ్

# ఉపనిషత్సారము

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో ఆచార్యేభ్యో వంశర్షిభ్యో నమో గురుభ్యో నమో మహద్భ్యః సమస్త గురుభ్యః.

శాంతిమంత్రము:—

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

తా. ఏపరబ్రహ్మము దేశ కాల వస్తుపరిచ్ఛేదశూన్యమయి యుండు చున్నదో! అట్టిబ్రహ్మము నిరుపాధికము; కావున అంతట వ్యాపించి యుండుటచేత పూర్ణమని చెప్పబడెను. సోపాధికమును నామరూప సమన్వితమును వ్యవహారాశ్రయమును ఇదంశబ్ద వాచ్యమును నగు నీ సర్వప్రపంచము నయితము స్వరూపమాత్రము కాని వేరుకాక పోవుటచేతను పూర్ణమనియే చెప్పబడెను. వ్యవహారాత్మకమయి విశేషత్వమును పొందినట్టియు, పూర్ణశబ్దవాచ్యము నగు ఈకార్యబ్రహ్మము కూడ పూర్ణశబ్దవాచ్యమగు కారణబ్రహ్మమువలె బహిర్గత మగు చున్నది. కార్యాత్మకమగు బ్రహ్మము కారణాత్మకమగు బ్రహ్మము వలె వేరు కాదనియు, అభేద మనియు తెలిసినయెడల నివృత్తి యోగిక బ్రహ్మస్వరూపమే మిగులుచున్నది. ఆధ్యాత్మికాది బ్రహ్మము శాంతముకాక కాలత్రయమునందును ఏకబ్రహ్మమగుటచేత (వేరు పదార్థము లేకపోవుటచేత) పూర్ణమని చెప్పబడెను.

ఈశావాశ్యము:—

ఈశావాశ్య మిదగ్ సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్య స్విద్ధనమ్॥

తా. ఈ ప్రపంచమంతయు మిథ్య. పరమాత్మస్వరూపము నాత్మయు నగు నాకంటె ఇతరములేదు; కావున నీ కల్పిత ప్రపంచమును విడిచి పెట్టుము. ఇదియే నిజమయిన సన్యాసము. ఈసన్యాసము నవలంబించి నిన్ను నీవు రక్షించుకొనవలయును. సత్యమైన ఆత్మనంశు నుతియించవాని నాశింపకుము. కల్పితమయిన ఈ నామరూపాత్మక ప్రపంచ మంతయు సత్యస్వరూపుడగు పరమాత్మయే యని తెలిసి, అసత్యమగు ప్రపంచ బుద్ధిని వదలవలయును. అనగా: సర్వసన్యాసరూపము లగు 'త్యాగము' ఇచ్చట చెప్పబడినది. ఇట్టి త్యాగము నవలంబించి నిన్ను నీవు రక్షించుకొనుము. ధనేషణాదికమును పొందకుము. అంతయు ఆత్మయే! కావున ఈశ్వరభిన్నమగు వస్త్వంతరమే లేనప్పుడు 'నీవు - నేను' అను వ్యవహారమే లేదు. ఆత్మకంటె భిన్నమయిన దంతయు కల్పితమును మిథ్యయు నని తెలిసి అట్టి మిథ్యయగువాని నాశింపకుము.

త్యాగమనగా: సర్వవాసనాత్యాగమేగాని శ్రావణభాద్రపదములవలె సర్వము గురువులకు ధారపోయుటకాదు. కావున నట్టి సర్వవాసనా త్యాగముచేసి నిన్ను నీవు రక్షించుకొనుము. గురువు శాస్త్రము లంతగ బోధించినను లాభములేదు. స్వబుద్ధి నుపయోగించి తెలియవలెను. 108ఉపనిషత్తులను చదివి గ్రహింపవలసిన ముఖ్యరహస్యవిషయమే ఈశా వాశ్యము మొదటి శ్లోకములో చెప్పబడియున్నది. (ముట్టుముకటకే మేరువు పర్వతమువలెనూ, ఆమేరువు పూసవలెనూ స్ఫుటము గోచ రము కాగలందులకు మొదటనే మేరువును పెద్దపూసవలె కనుపరచెదరు). ఈముఖ్యరహస్యమునందు లక్ష్యముంచి తక్కినగల వెన్ని చదివినను ఈముఖ్యలక్ష్యార్థములోనే చేరవలెను.

పై శత్రువులను జయించినప్పటికీ ఇంద్రియములను జయించుట చాల కష్టము. దేహాత్మభావన విడిచినగాని ఈశత్రువులు శాంతించరు.

మూ. యస్తు సర్వాణిభూతాని ఆత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే।

తా. ఏ విద్వాంసుడు సర్వభూతములు తనకన్న వేరుకావనియు, సమస్తభూతములకంటె తాను వేరుకాననియు నెఱుంగునో వాడు లోక మును నిందచేయడు.

మూ. యస్మిన్ సర్వాణిభూతాని ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః ॥

తా. సర్వకాలసర్వావస్థలయందు సర్వమునందును యథార్థవస్తువు నెఱింగినవానివలె నే విద్వాంసు డితరమును జూడ నపేక్షింపడో అట్టివానికి మోహపాశములు లేవు.

కేనోపనిషత్తు:—

ఓమ్ ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్ర మథో బల మిన్ద్రియాణిచ సర్వాణి సర్వం బ్రహ్మౌపనిషదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మనిరాకరోదనిరాకరణ మస్త్వనిరా కరణం, మేస్తు తదాత్మని రతేయ ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

తా. వాగాదింద్రియములు తమతమపనులనుజేయుటకు శక్తికలిగి యుండవలయునని ప్రార్థింపబడియున్నది. ఇందువలన అధ్యయనముచేయు

వారికి ముఖ్యముగా అంగములును ఇంద్రియములును పటుత్వముతో నుండవలయునని భావమగుచున్నది.

ఎవడు సమస్తమును ఆత్మ (బ్రహ్మ) స్వరూపముగా తలంపడో వాడు సకలభూతములకును విరోధియగును. కాబట్టి అట్టితలంపు కలుగకుండ వలయుననియు, పరబ్రహ్మమందే తత్పరుడై యుండవలయుననియు, ఆ పరబ్రహ్మము తనయందనుగ్రహము నుంచవలయుననియు ద్యోతకమగు తలంపుతో ఈమంత్రమును ఉపాసకుడు ధ్యానించుచున్నాడు.

మూ. న తత్ర చక్షు ర్గచ్ఛతి న వా గ్గచ్ఛతి నో మనో
న విద్మో న విజానీమో యథైత దనుశిష్యా
దన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి, ఇతి
శుశ్రుమ పూర్వేషాం యే న స్తద్వ్యాచచక్షిరే.

తా. శిష్యులారా! బ్రహ్మ శ్రోత్రాదుల కధిష్ఠానమైన ఆత్మగా నున్నది. అనగా: నేత్రముచే చూచుటకును, వాక్కుచేత చెప్పుటకును, మనస్సుచేత నిశ్చయించుటకును శక్యమైనదికాదు. "చూచుటయు, చెప్పుటయు, నిశ్చయించుటయు, పరబ్రహ్మమనియు దానికంటె విలక్షణమై చూచుటమొదలగువానికి వేరుగ అధిష్ఠానము లేదనియు చెప్పబడినది. ఇట్టి అవాఙ్మనసగోచరమైన పరబ్రహ్మస్వరూపము చూడదగిన జగత్తుకంటెను, చూచుటకు సాధ్యముకాని అవ్యక్తముకంటెను వేరైనదనియును దానిని పూర్వాచార్యోపదేశముచేతనే తెలియవలె ననియును" గురువు శిష్యులకు చెప్పెను.

మూ. య ద్వాచాఽనభ్యుదితం యేన వా గభ్యుద్యతే తదేవ
బ్రహ్మత్వం విద్ధి నేదం య దిద ముపాసతే.

తా. ఏది కేవలచైతన్యస్వరూపమైయున్నదో అయ్యది వాక్కు-చేత వర్ణింప శక్యముకానిది. వాగాదీంద్రియములచేత తెలియబడని

ఏపరబ్రహ్మముచే నే త్వగ్వాగాదీంద్రియములు ప్రకాశించుచున్నవో ఆస్వరూపమునే పరబ్రహ్మ స్వరూపముగ తెలిసికొనుము. లోకులు భిన్నమైన ఉపాధులతో గూడిన యనాత్మస్వరూపమును బ్రహ్మస్వరూపము యుపాసించుచున్నారు. ఆస్వరూప మనాత్మస్వరూపముగాని పరబ్రహ్మముకాదు.

మూ. య చ్చక్షుషా నపశ్యతి యేన చక్షూంషి పశ్యతి
తదేవబ్రహ్మ త్వంవిద్ధి నేదం యదిద ముపాసతే.

తా. శిష్యుడా! లోకు లనాత్మస్వరూపమైన ఈశ్వరుని సూర్యుని దేవతల నుపాసించెదరు. ఇది పరమాత్మస్వరూపము కాదు! ఆ పరమాత్మస్వరూపము చూచుటకు సాధ్యముకాదు. అంతఃకరణవృత్తితో గూడిన నేత్రేంద్రియముచే జనులు దేనిని చూచుటలేదో ఏ వృత్తిచేత అంతఃకరణభేదముచే వేరుగా జేయబడి నేత్రవృత్తులను లోకము చూచుచున్నదో దానిని పరమాత్మ స్వరూపముగ తెలిసికొనుము.

మూ. య చ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే.

తా. లోకులుపాసించెడి ఈశ్వరాదులు బ్రహ్మస్వరూపము కాదు దేనికి దిక్కులు దేవతలో, ఏది ఆకాశకార్యమై అట్టి మనోవృత్తితో గూడిన కర్ణేంద్రియముచే లోకులు దేనిని విషయముగా చేసికొనలేదో (వినలేదో) ఏ చైతన్యప్రకాశముచే శ్రోత్రమునకు విషయమైన శబ్దము వినబడుచున్నదో దానిని బ్రహ్మస్వరూపముగ నెఱుంగుము.

మూ. యది మన్యసే సువేదేతి దభ్ర(దహ్ర) మేవాపి నూనం
త్వం వేత్థ బ్రహ్మణోరూపం యదస్య త్వం యదస్య
దేవేష్వథను మీమాంస్య మేవ తే మన్యే విదితం.

తా. "నీ వేబ్రహ్మస్వరూపమును లోకమునందుగాని దేవతలందు గాని చక్కగా తెలిసికొంటినని భావింతువో అదియంతయు అల్పమైనదే. కాబట్టి నీవు బ్రహ్మస్వరూపమును విచారించి తెలిసికొనవలసినది." అని గురువుచెప్పగా శిష్యుడువిని యుక్తివివేకములచే విచారించి, స్వానుభవముచే నిశ్చయించుకొని గురువుకడకువచ్చి "నే నాబ్రహ్మస్వరూపమును తెలిసికొన్నట్లుగాతలంచెదను." అనిచెప్పెను.

మూ. యస్యామతం తస్యమతం మతంయస్య నవేదసః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్.

తా. ఏబ్రహ్మజ్ఞాని బ్రహ్మస్వరూపము తెలియబడదని భావించుచున్నాడో; వాడే దానిని చక్కగా నెఱింగినవాడు. ఎవడు బ్రహ్మస్వరూపము తెలిసితినని భావించుచున్నాడో; వాడు బ్రహ్మమును తెలియనివాడు. అనగా: ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగువాని యం దాత్మబుద్ధిగల యజ్ఞానికి బ్రహ్మము గోచరింపదు. ఇంద్రియాదుల యం దాత్మబుద్ధిలేని జ్ఞానులకు బ్రహ్మము గోచరించును.

మూ. ఇహచే దవేదీ దథ సత్యమస్తి
నచే దిహావేదీ న్మహతీ వినష్టిః,
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవన్తి.

తా. ఈ లోకమునందు పరమాత్మస్వరూపము నెఱింగినవారలకు (బ్రతికియుండుకాలమునందే) సత్యస్వరూప పరబ్రహ్మమే యగుచున్నాడు. ఈజన్మలో జ్ఞానము పొందనియెడల గొప్పనష్టము కలుగును. అనగా: పురుషార్థసిద్ధి లేనిపోవుటయు జన్మబంధము తొలగకపోవుటయు ) కావున బుద్ధిమంతులు సర్వభూతములను బాగుగా విచారించి వానియందలి

ఆత్మను తెలిసికొనినవారలై అవిద్యాదిదోషములను విడచి, బ్రహ్మాత్మైక్య భావము కలవారలై అమృతత్వమును బొందుదురు. ఈ శరీరము పతనమగుటకుమున్నే బ్రహ్మజ్ఞానము పొంద శక్యము గానియెడల మరల శరీరమునుదాల్చి జన్మముల నెత్తవలసియుండును. కాన జాగ్రత్తగ మేలు కొని చిత్తమునకు తోచినట్లు చేయవలెను. ఈశరీర మిందుండగనే గురు ముఖతః తెలిసికొని సకలభూతములందును బరమాత్మను చూచువాడు పూర్ణాత్ముడగును.

మూ. సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణోవా ఏతద్విజయే
మహీయధ్వమితి తతో హైవ విదాఞ్చకార బ్రహ్మేతి.

తా. ఓఇంద్రుడా! నీవడిగిన మహాభూతమే పరబ్రహ్మము. ఆ పర బ్రహ్మమే మీ విజయమునకు కారణము. మీ రావిషయ మెఱుంగక మేమే రాక్షసులను జయించితి మనెడి మోహము (భ్రాంతి) గలవారై యుండిరి. మీయొక్క భ్రాంతిని బోగొట్టుటకై యీ బ్రహ్మస్వరూపమే తనశక్తివలన నిట్టి ఘోరరూపము నొందెనని చెప్పెను.

శాంతిమంత్రము:—

సహ నా వవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై
తేజస్వినావధీత మస్తు మా విద్విషావహై.

తా. శిష్యాచార్యులమగు మమ్ములనిద్దరను ఆపరబ్రహ్మము రక్షించు గాక. శిష్యాచార్యులమగుమాకు ఆత్మసుఖానుభవము కలుగుగాక, శిష్యాచార్యుల మగు మాఇద్దరకు విద్యాసంబంధమయిన సామర్థ్యము చక్కగానుండుగాక. మే మధ్యయన మొనర్చిన బ్రహ్మవిద్య తేజోవంతమై యుండుగాక. ప్రమాదకృతాపరాధాదికమువలన శిష్యాచార్యుల మగు మాలో మాకు పరస్పరద్వేషము లేకపోవుగాక.

మాయందు ప్రణవప్రతిపాదక బ్రహ్మము అనుగ్రహము కలిగియుండుగాక. ఆధ్యాత్మికాది తాపత్రయము శాంతించుగాక.

మూ. అశరీరగ్ం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్
మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో నశోచతి.

తా. బుద్ధిమంతు డాత్మను శరీరవిరహితముగను, అనిత్యములగు శరీరములయం దున్నదానినిగను, గొప్పదిగను, సర్వవ్యాపకముగను తెలిసికొని దుఃఖింపడు. ఆత్మ శరీరములేనిదగుటచే అశరీరమని వాడబడును. అట్టిఆత్మకు శోక మోహములులేవు.

మూ. య దేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.

తా. సర్వోపాధిసమన్వితమయి అవివేకులకు సంసారధర్మములు గలదానివలె ఏది కనుపించుచున్నదో, ఏతత్వ మిచట ఈజీవునియందు గలదో, ఆతత్వమే నిత్య విజ్ఞాన ఘనస్వభావమును, సర్వసంసార ధర్మవివర్జితమును నగు ఆత్మయందు గలదు. ఏతత్వ మీ యాత్మతత్వమునందు గలదో ఆ తత్వమే నామరూపములతో గూడిన సర్వోపాధికుడగు జీవునియందునూ నిండియున్న దేగాని వేరుగ నేమియులేదు. నిజస్వరూప మిట్లుండగా ఉపాధిస్వభావభేదలక్షణమగు అవిద్యచేత విమోహితుడై అద్వితీయమైన బ్రహ్మమునందు 'నేను బ్రహ్మముకంటె వేరు, బ్రహ్మము నాకంటె వేరు' అని భిన్నముగా నెవ్వడు చూచుచుండునో అట్టివాడు మృత్యువునుండి మృత్యువును అనగా: పుట్టుచు చచ్చుచు నుండు సంసార సాగరములో మునుగుచుండును. కావున నట్టి భేద దృష్టితో చూడలేదు. విజ్ఞానైక రసముచే నిరంతరముగ ఆకాశమువలె

మూ. యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః
అథ మర్త్యోఽమృతో భవత్యేతావ దనుశాసనమ్॥

తా. ఎప్పు డెచ్చట జీవించియుండగనే హృదయగ్రంథులన్నియు నశించిపోవుచున్నవో అప్పుడు సాధకుడు అమృతస్వరూపు డగుచున్నాడు. శాకశోకలులేని అఖండపరిపూర్ణు డగుచున్నాడు. ఇదియే సర్వవేదాంతములయొక్క మూలరహస్యము. సర్వకామములు నశించుటయే అమృతత్వ మయినయెడల నట్టి సర్వకామముల నాశనము సుషుప్తి యందుగూడ సంభవించుచున్నదికదా! ఆ సుషుప్త స్థితినికూడ అమృతత్వ మేల యనకూడ దందురేని; అట్లనకూడ దనియు, బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే అవిద్యాగ్రంథులు నశించుటయే అమృతత్వ మనియు దెలియవలయును.

సర్వవాసనలు తమోంధకారములో లయమైనయెడల తిరిగి వ్యవహారము జనన - మరణ రూపకమే యగును. తత్సర్వవాసనలు జ్ఞానాగ్నివల్ల కాల్చబడినయెడల భస్మ మగును. (ఆ భస్మమునే పెద్దలు విభూతిగ దాల్తురు) అట్టిస్థితి నందినవానికి జనన-మరణము లుండవని తెలియవలెను.

శాంతిమంత్రము:—

ఓం భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః, భద్రం పశ్యే
మాక్షభి ర్యజత్రాః, స్థిరై రంగై స్తుష్టువాగ్ంస స్తనూభిః,
వ్యశేమ దేవహితం యదాయుః,
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తి నః పూషా
విశ్వదేవాః, స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః,
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

తా. ఓ ఇంద్రాదిదేవతలారా ! మీయనుగ్రహమువలన నెల్లప్పుడు శిష్యాచార్యులమగు మేము మాచెవులతో శ్రుతి స్మృతి పురాణ సమ్మతమయిన సత్యసిద్ధాంతమునే తిలకించు చుందుముగాక. ఇట్టి సచ్ఛాస్త్ర శ్రవణ, తదర్థమనన, తదర్థాచరణములచే పవిత్రులమైన మేము సర్వకాల సర్వావస్థలయందున్నూ సత్కార్యములనే చూచుచుందుముగాక. భగవంతుడు మాకనుగ్రహించి యిచ్చిన కరచరణాద్యఖిలావయవములు ఆయా కర్మలను చక్కగా నిర్వహించుటకు సమర్థము లయియుండి అతడు మా కొసంగిన సంపూర్ణాయువును అకాలమరణ, ఆధివ్యాధ్యాది దురవస్థలులేక చక్కగ జీవించియుందుముగాక.

శ్రుతి స్మృతి పురాణములందు మిగుల కొనియాడబడిన ఇంద్రుడు శిష్యాచార్యులమగు మాకు క్షేమము కలుగజేయుగాక. అహింసను సర్వదా కాపాడుటయందు సమర్థుడగు గరుడుడు శిష్యాచార్యులమగు మాకు క్షేమమును కలుగజేయుగాక. సకలమునెఱింగిన సూర్యుడు లేక (పూష) యనుదేవత శిష్యాచార్యులమగు మాకు క్షేమము కలుగజేయుగాక. శిష్యాచార్యులమగు మాకుబృహస్పతి క్షేమము కలుగజేయుగాక. మాకు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లను త్రివిధములైన తాపములు శాంతించుగాక.

మూ. తస్మై సహోవాచాతిప్రశ్నా న్పృచ్ఛసి,
బ్రహ్మిష్ఠోఽసీతి తస్మా త్తేఽహం బ్రవీమి॥

తా. ప్రాణమే యిట్టిదని తెలిసికొనుట చాలకష్టము. కావున ఆప్రశ్నయే మిగుల విషమమగు ప్రశ్న. ఆరుప్రశ్నల నడుగుచున్నాడ వవి అతిప్రశ్న లగుచున్నవి. ఇట్టి విషమప్రశ్నలనే నీవడుగుచున్నావు. నీ వాపరబ్రహ్మమునే గాక ముఖ్యబ్రహ్మమునుగూడ నెఱిగినవాడవని

నాకు సంతసము కలుగుచున్నది. కావున నేను నీ వడిగినదానికి చెప్పెద.
వినుము.

మూ. ఆత్మన ఏషప్రాణో జాయతే, యథైషా పురు
షేచ్ఛాయైతస్మి న్నేత దాతతం, మనోకృతే
నాయా త్యస్మి ఞ్ఛరీరే॥

తా. ఈప్రాణము సత్యస్వరూపుడును, అక్షరుడుననగు పరమ
పురుషుని నుండియే పుట్టుచున్నది. ఇందులకు దృష్టాంతము: లోకము
నందు శిరఃపాదా ద్యవయవవిశిష్టుడగు పురుషునినుండి తన్నిమిత్తము
(వానినీడయెట్లుపుట్టుచున్నదో అట్లు) ఛాయాస్థానీయమును, అసత్యమున
నగు ప్రాణాఖ్యమగు తత్వము సత్యస్వరూపుడగు పురుషునియందు
(బ్రహ్మమునందు) సమర్పిత మగుచున్నది.

మనస్సంకల్ప వికల్పములగు ఇచ్ఛాది నిమిత్తములచే నాచరింపబడె
పుణ్యాపాపకర్మలచేత నీశరీరమునందు ప్రాణము ప్రవేశించుచున్నది
పురుషునియొక్క నీడవలన పురుషునియం దేవిధమగు వికార మెట్లు
లేదో అదే విధముగ పరమాత్మయొక్క ఛాయామాత్రమగు ప్రా
మందుకూడ ఏమియు వికారము కలుగజాలదు. ద్వాదశస్థానగతమైనచో
ఆనీడకూడ ఉండనేఉండదు. 12 గంటలవేళ సూర్యుడు నడినెత్తిమీది
వచ్చుసరికి తను వెటు త్రిప్పిచూచినను తననీడ లేనట్టుగనే ద్వాద
స్థానము (సంవత్సరస్థానము) నందు ఆనీడ ఏమియునుండదు. ముఖ్యము
తెలిసికొనవలసిన రహస్యమిది. దీనిని గురుముఖముననే తెలియవలెను

మూ. యథా సమ్రాడే వాధికృతా న్వినియుఙ్క్తే ఏతాన్గ్రామా
నేతాన్గ్రామా నధితిష్ఠ స్వేత్యేవ మేవైష ప్రాణా
ఇతరా న్ప్రాణా న్పృథ క్పృథగేవ సంనిధత్తే॥

తా. ఓశిష్యుఁడా! లోకమునందు సార్వభౌముడగు భూపాలుడు ఆయా గ్రామములం దున్నవారిని పరిపాలించునిమిత్త ముద్యోగస్థులను 'ఈగ్రామము నీవుపాలింపుము, ఈగ్రామమును నీవుపాలింపు' మని యేవిధముగా నియమించుచున్నాఁడో, అదేవిధముగ ఈముఖ్యప్రాణము ఇతరములగు ప్రాణాపానాది ప్రాణములను, చక్షురా దీంద్రియములను ఆ యాస్థానములందు వేరు వేరు కార్యములను చేయుటకై వాని కాజ్ఞాపించి నియమించుచున్నది.

మూ. పర మేవాక్షరం ప్రతిపద్యతే స యోహవై త
దచ్ఛాయ మశరీర మలోహితం శుభ్ర మక్షరం
వేదయతే, యస్తు సౌమ్య స్స సర్వజ్ఞ స్సర్వో
భవతి తదేష శ్లోకః॥

తా. ఎవడు తమోవిరహితుడును, నామరూపాది సర్వోపాధి శరీర వర్జితుడును, సర్వదోష రహితుడును, పరిశుద్ధుడును, సర్వేషణ (ఈషణ త్రయ) రహితుడును, అఖండవాచ్యుడు నగుపరమాత్మను తెలుసుకొను చున్నాడో వాడు పూర్ణదర్శి యగును. సర్వజ్ఞుడును, సర్వ స్వరూపుడును, సర్వ పరిపూర్ణుడు నగుచున్నాడు.

మూ. స యథేమా నద్య స్స్యందమానా స్సముద్రాయణా
స్సముద్రం ప్రాప్యా స్తం గచ్ఛన్తి. భిద్యేతే తాసాం నామ
రూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే ఏవ మేవాస్య
పరిద్రష్టు రిమా షోడశకళాః పురుషాయణాః పురుషం
ప్రాప్యా స్తం గచ్ఛన్తి. భిద్యేతే తాసాం నామరూపే
పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషో కళోఽమృతో
భవతి తదేష శ్లోకః॥

తా. షోడశకళలవిషయమై దృష్టాంతము చెప్పబడుచున్నది. ఎట్లనగా: సముద్రములో కలియుటకు నదులు ప్రవహించుచున్నవై ఆసముద్రమునుపొంది నామరూప తిరస్కారము నెట్లు పొందుచున్నవో, అదేవిధముగ సర్వద్రష్ట యగు పురుషునకు సంబంధించినవియు, ప్రాప్య స్థానముగాగల ఈ పదునారుకళలు పురుషునిపొంది ఆ పురుషునియందు లయించి పోవుచున్నవి. ఈకళలయొక్క నామరూపములు లయమును పొందుచున్నవి. ఈ పురుషుడును షోడశకళావిరహితు డగుచున్నాడు. (రాకపోకలు లేనివా డగుచున్నాడు) నామరూపములు నశించినతరువాత ఏతత్త్వము నశింపక శేషించియుండునో ఆతత్త్వమునే బ్రహ్మవేత్తలు పురుషుడని వ్యవహరించుచున్నారు. విద్వాంసుడగు ముముక్షువు సద్గురునిచే ప్రాణాది కళాప్రళయమార్గము నెరింగినవాడయి గురూపదిష్టమైన విద్యచేత అవిద్యా కామకర్మ సంజాతములగు ప్రాణాది షోడశకళలు నశించిన వగుచుండ అకళు డనబడుచున్నాడు.

ఇదియే మఱియొకవిధముగ చెప్పబడుచున్నది. సముద్రమునకు స్వరూపభూతమగు జలమును మేఘము లాకర్షించుకొని భూమియందు వర్షించుచున్నవి. ఆ వర్షించిన జలములు గంగా యమునాది నామరూపోపాధులచే సముద్రమునకంటె భిన్నమైనవిగా వ్యవహరింపబడుచున్నవి. తద్గంగా యమునాది నదీజలమే మరల సముద్రమును పొందినదై గంగాయమునాది నామరూపోపాధులవదలి సముద్రరూప నామమునే పొందుచున్నది. అటులనే అవిద్యాకల్పిత నామరూపోపాధివశముచేత ఆత్మకంటె భిన్నముగా తోచు జగత్తునందు విద్యచేత నామరూపోపాధి విభాగమును నిరసింపగా (ఖండింపగా) 'బ్రహ్మసత్యము జగత్తుమిథ్య' యనునట్లు బ్రహ్మముమాత్రమే శేషించుచున్నది.

మూ. అరాఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః తం
వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః
పరివ్యథా ఇతి॥

తా. బండిఆకులు రథనాభియందువలె ఏపురుషునియందు ప్రాణాది షోడశకళలు ప్రతిష్ఠితములైయున్నవో, ఏపురుషుని తెలిసికొనిన (మిమ్ములను) మృత్యువు బాధింపదో ఆప్రకారము సర్వపరిపూర్ణుడును, దేహమునం దనుష్ఠించియుండుటచే పురుషశబ్దవాచ్యుడు నగుబ్రహ్మమును మీరు చక్కగా నెఱింగినయెడల మీ కమృతత్వము కలుగును. అట్టి పురుషుని మీరు తెలియనియెడల సంసారదుఃఖముల ననుభవింతురు.

ఓ శిష్యులారా! మీ కట్టి మృత్యుబాధ కలుగకుండుటకై మీరు తెలిసికొనదగిన యాపరమపురుషుని చక్కగాదెలిసికొని మీ మానవజన్మ సాఫల్యము నొందజేసికొనుడు. ఈచక్కని మానవజన్మ వృథా పోనియ్యగూడదు.

మూ. యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ
యథా పృథివ్యా మోషధయ స్సంభవన్తి,
యథా సతఃపురుషా త్కేశలోమాని
తథాఽక్షరా త్సంభవతీహ విశ్వం॥

తా. లోకమునందు సాలెపురుగు మఱియొక కారణము నపేక్షింపకయే స్వశరీరముకంటె వేరుకాని తంతువులను వెలుపలి కెటుల ప్రసరింపజేయుచున్నదో మరల నెటుల వానిని తనలోనికి తీసికొనుచున్నదో, (అనగా వానిని మరల స్వాత్మభావమును పొందించుచున్నది) ఏవిధముగా భూమియందు వ్రీహ్యాది స్థావరాంత పదార్థములు స్వాత్మవ్యతిరేకముగా పుట్టుచున్నవో, ఏవిధముగా చేతనుడగు పురుషునినుండి

తద్విలక్షణములగు కేశలోమములు పుట్టుచున్నవో అను నీ దృష్టాంత
త్రయానుసారము నిమిత్తాంతరము నపేక్షింపకయే ఈసంసారమండలము
నందు విలక్షణము, సలక్షణమునగు జగత్తంతయు అక్షరతత్త్వము
నుండి జనించుచున్నది. ఇచట సాలెపురుగునుండి తంతువులుపుట్టుట
భూమినుండి ఓషధులు జనించుట, పురుషునినుండి కేశలోమములు జనిం
చుట అనెడి దృష్టాంతత్రయము సుఖావబోధార్థమని తెలియవలెను.
సాలెపురుగు దృష్టాంతముగా కనబరచుట ఉపాదాన కారణము, నిమిత్త
కారణము ననురెండును కొన్నితావులలో నొకటిగానే యుండునని
నిరూపించుటకు చెప్పబడినది.

మూ. అవిద్యాయా మన్తరే వర్తమానా స్స్వయంధీరాః
పండితం మన్యమానాః, జంఘన్యమానాః పరి
యన్తిమూఢా అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః ॥

తా. మూఢులగుకొందరు తా మజ్ఞానులయియున్నను తామే
జ్ఞానులమనియు, తెలిసికొనదగిన విషయములన్నియు తమ కేసమగ్రముగా
తెలిసినవనియు తలంచుచు ముదిమి, రోగము, మరణముమున్నగు ననర్థ
పరంపరలకు లోనయి పుట్టుచు, గిట్టుచు, గ్రుడ్డివానిచే త్రోవచూపింపబడి
వుచున్న గ్రుడ్డివాడు మిట్ట, పల్లము, కంటకములు మున్నగువానివలన
ధలనందుచు, పడుచు, లేచుచు, దరిగానక యెట్లల్లాడునో అట్లే
గాసంసారచక్రమునందు చరించుచుందురు.

మూ. పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద
మాయా న్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం
స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణిశ్శ్రోత్రియం
బ్రహ్మనిష్ఠమ్॥

తా. సాధ్య సాధనరూపమైన సంసారమునుండి విరక్తుడైనవానికే పరావిద్యయం దధికారము కల దనువిషయ మిందు చెప్పబడెను.

బ్రాహ్మణుఁడు లోకములను కర్మచేత నిర్వర్తింపబడినవిగా పరీక్షించి కర్మాచరణమాత్రమున మోక్షము లేదని వైరాగ్యమును పొందవలెను. అట్టివైరాగ్యమును పొందినబ్రాహ్మణుఁడు అవ్యయామృతస్వరూపమును దెలిసికొనుటకు, సమిధలు హస్తమునందు గలవాఁడును. నిరంతర వేదాధ్యయన పరాయణుఁడును బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు నగు గురువును; వెతకి యతనికడకు పోవలెను. ఆ గురువునద్ద బ్రహ్మవిద్య తెలిసినవాడై అనేకానర్థములతోఁగూడినదనియు, అరటిచెట్టుయొక్క మధ్యభాగమువలె సారము లేనిదనియు, ఎండమావులందలి నీటివలెను-ఇంద్రజాలమువలెను-ఆకాశనగరము వలెను-జలబుద్బుదములవలెను- సర్వ ప్రపంచమువలెను-తాత్కాలికముగ గోచరించి వెంటనే నశించునది యని గ్రహించునేని అట్టి విరక్తుఁడైన బ్రాహ్మణునకే బ్రహ్మవిద్యాధికారము కలదు. ఈవిధముగా జగత్తుయొక్క నిస్సారత్వమును పరీక్షించి వైరాగ్యమును పొంది; నిత్యమును అమృతమును, అభయమును, కూటస్థమును, అచలమును, ధృవమును నగుపదార్థము నాకావశ్యకము గాని — అనిత్యము, భయము, చంచలము, అశాశ్వతమునగు వస్తువుతో పని లేదు కాన ఆయాస పడుట అనర్థమునకని తెలిసికొని వైరాగ్యమును చెందినబ్రాహ్మణుడు అభయమును, శివమును, అమృతమును నగుపద మెద్దానికిగలదో దానిని నిస్సంశయముగా నెఱుంగుటకై సద్గుణసంపన్నుడయిన గురువుకడకు పోవలయును; గాని తాను స్వయముగ శాస్త్రజ్ఞుఁడయినను స్వాతంత్ర్యముతో బ్రహ్మవిచారముచేయవలదు.

బ్రహ్మనిష్ఠుడగు గురువును శాస్త్రనియమానుసారమగు రూప సదన మొనర్చి, తనయం దనుగ్రహము కలవానిగ జేసికొని సత్య స్వరూపుఁడును, అక్షరుఁడును నగుపురుషుని గూర్చి తెలియవలెను.

(బ్రహ్మనిష్ఠుడనగా: అన్నికర్మలనువదలి కేవలము బ్రహ్మమునందే నిష్ఠ కలవాడు.)

కర్మకును, ఆత్మజ్ఞానమునకును విరోధము కనుక కర్మఠునకు బ్రహ్మనిష్ఠత్వము సంభవింపజాలదు. గూఢమైన బ్రహ్మతత్వము అత్యంత సూక్ష్మమైన దగుటచేతను, సంశయానేక దురవగాహమగుటచేతను గురువుయొక్క సదనుగ్రహములేక యెఱుంగసాధ్యము కాదు.

మూ. యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా
సహస్రశః ప్రభవంతే సరూపాః
తథాఽక్షరా ద్వివిధా స్సోమ్యభావాః
ప్రజాయన్తే తత్రచైవాపి యన్తి.

తా. సత్యమైనట్టి యే అక్షరస్వరూపముకలదో దానినుండి భ్రాంతి రూపముగా సకలచరాచరములు కలిగినప్పటికినీ అయ్యది త్రికాలములందును ఏకరూపముగానుండును. బాగుగా మండుచున్న అగ్నినుండి వేలకొలది సమానరూపములైన అగ్నికణము లేవిధముగా పుట్టునో ఆదే ప్రకారముగా అఖండపరబ్రహ్మమునుండి వివిధము లగు జీవులనేకములుగ పుట్టి (భ్రాంతిచే పుట్టినట్లు కనబడును) అయ్యఖండ బ్రహ్మమునందే కలియును. నామరూపములు కల్పితములగుటచే న కల్పితము నిజము కాదని తెలియవలెను. అఖండము ఖండముగ ఖండము అఖండముగను కాజాలదనియు, త్రికాలములందు అఖండము అఖండముగనే యున్నదని సాధకుడు గ్రహింపవలయును.

మూ. భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే పరావరే.

తా. కార్య కారణస్వరూపముచే అపరుడనియు, పరుడనియు వ్యవహరింప బడుచున్న ఆ పరమాత్మ నెవడు చూచునో ఆసాధకుని హృదయగ్రంధి అనేకములగు వాసనలయొక్క దృఢసంబంధముచే సడలి పోవుచున్నది. (తెగిపోవుచున్నది.) సంశయరహితుడగు బ్రహ్మవేత్తకు సర్వకర్మలు నశించిపోవుచున్నవి. సంశయ వాసనాది సమస్తమును క్షీణించిపోవుచున్నది.

మూ. బ్రహ్మైవేద మమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చా
ద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణచ
అధ శ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం
విశ్వమిదం వరిష్ఠమ్॥

తా. ఎయ్యది సర్వజ్యోతులకు జ్యోతియని చెప్పబడుచున్నదో అట్టి బ్రహ్మ మొక్కటియే సత్యమనియు, తద్భిన్నమైన దంతయును అసత్యమనియు ననువిషయము శృతిప్రమాణముల చేతను, యుక్తులచేతను చెప్పబడినది.

కార్య కారణరూపమున నున్నదంతయు బ్రహ్మమేకాని వేఱొకటి కాదు. రజ్జువునందు సర్పభ్రమ అవిద్యావశమున నెట్లుకలుగుచున్నదో అట్లే సత్యమగు బ్రహ్మమందుకూడ అవిద్యావశముచే బ్రహ్మముకంటె భిన్నమగు కార్యరూపము తోచుచుండును. కాని యథార్థముగ చూచి నచో పూర్ణమే శేషించును.

మూ. సత్యమేవ జయతే నానృతం. సత్యేన పంథా వితతో
దేవయానః యేనాక్రమం త్యృషయో హ్యాప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్,

తా. సత్యమేజయము. అసత్యము జయమునుపొందదు. సత్య చేతనే దేవయాన మనుపేరుగల విస్తారమైన మార్గము కలుగును. ఆ కాముడు, తీవ్రమోక్షేచ్ఛగలవాడు, ఏ పరబ్రహ్మమునందు బ్రహ్మవే లాత్మతత్త్వమును పొందుచున్నారో అదియే సత్యస్థానము. నిజ నది. రాకపోకలులేనిది అని తెలియవలెను.

మూ. బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం
సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి,
దూరా త్సుదూరే త దిహాంతికేచ
పశ్య త్స్విహైవ నిహితం గుహాయామ్॥

తా. ఆయాత్మతత్వమెట్టిదో చెప్పబడుచున్నది. ఆత్మతత్వముసత్యా సాధనములచేత సంతట వ్యాప్తిచెందియున్నది. కనుక మిక్కిలిగొప్పది. దివ్యమైనది. (ఇంద్రియములకు గోచరముకానిది.) ఇట్టిదని యాలోచిం చుటకుగూడ శక్యముకాని దగుటచేతనే అచింత్యరూపమని చెప్పబడి నది. ఆకాశాదికముకంటె మిక్కిలిసూక్ష్మమయినదియు, చంద్రసూర్యా ద్యాకారములచేత వివిధముగా ప్రకాశించుచున్నదియు నగు నియ్యాత్మ తత్వము మిక్కిలి దూరమైనదానికంటె దూరముననను, మిక్కిలి సమీప మైనదానికంటె సమీపముగను ఉన్నది.

ఇయ్యది అవిద్వాంసులు పొందుటకు శక్యముకాని దగుటచే వారికి దూరముననను, విద్వాంసులే ఆత్మస్వరూపులు గాన వారికి మిక్కి దగ్గఱగను అగుచున్నది. (బ్రహ్మవేత్త సర్వాంతరు డని చెప్పబడు చున్నాడు) ఆత్మతత్వము విద్వాంసులకు హృత్పుండరీకమునందే గోచ మగుచుండును. నిత్య సన్నిహితమై యున్నను అవిద్వాంసుల కాత తత్వము గోచరముకాజాలదు.

మూ. నచక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యై ర్దేవై స్తపసా కర్మణావా,
జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వ
స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః॥

తా. పరమాత్మ నేత్రములచే చూడబడడు. వాక్కుచే గ్రహింపబడడు. ఏ ఇంద్రియములచేతను, ఏ కర్మలచేతను తెలిసికొన శక్యముగాడు. పరిశుద్ధాంతఃకరణ గలవాడైన ఆత్మజ్ఞాని ఆ పరమాత్మను సర్వోపాధిరహితునిగా తెలిసికొనుచున్నాడు. కాని ఇంద్రియములతో నెవ్వడును ఎన్నిజన్మములకైన దెలిసికొనలేడు. లోకజ్ఞానము రాగాది వృత్తులతో గూడినదగుటచే దానికిని శక్యముకాదు. అట్లగుట లోకాతీతాఖండ జ్ఞానముచేతనే తెలియబడును.

ధూళిపడిన అద్దమునందు ప్రతిబింబము కనుపడనివిధమున సన్నిహితమైనప్పటికినీ ఆత్మతత్వము తెలియబడదు. ధూళితుడిచిన అద్దమువలె రాగాది కార్యజాత మంతయు నిర్మూలముగ తుడిచినయెడల ఆత్మతత్వము నిర్మలముగను, నిస్సంశయముగను, నిత్యముగనుకుండును. అట్టి పరమాత్మను తెలిసికొనుటయే ఉత్తమమగుమానవజన్మకు సాఫల్యము.

మూ. యథా నద్య స్స్యందమానా స్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ,
తథాఽవిద్వా న్నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్॥

తా. గంగాది మహానదులు ప్రవహించుచున్నవై సముద్రమందాయా నామరూపములనువిడిచి యేప్రకారముగ నాశనము పొందు

చున్నవో; అటులే ఆత్మవేత్తయగువాడు నామరూపముల వలన విడువ బడినవాడై తత్స్వరూపుడును, అఖండుడు నగుచున్నాడు.

మూ. సయోహవై తత్పరమం బ్రహ్మ వేద
బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి
తరతిశోకం తరతిపాప్మానం
గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి॥

తా. ఎవడు గొప్పదగు పరబ్రహ్మమును తెలిసికొనుచున్నాడో వాడు పరబ్రహ్మస్వరూపుడే యగుచున్నాడు. అట్టి బ్రహ్మవేత్త సర్వదుఃఖములను, సర్వపాపములను దాటుచున్నాడు. (విడుచుచున్నాడు) అజ్ఞానముచేత హృదయమునందుకలిగిన సంశయములనెడి దృఢ మగుముడి వదలినవాడై అమృతరూపమగు అఖండపరబ్రహ్మమే అగుచున్నాడు.

అట్టి బ్రహ్మవేత్త కేదేవతలును విఘ్నములు కలిగించరు. అట్టివా డెవరికిని పట్టుబడడు. పట్టుబడినను దుర్గతినొందడు. బ్రహ్మకులమునందు పుట్టి బ్రహ్మమే యగుచున్నాడు.

మూ. సర్వగ్ హ్యేత ద్బ్రహ్మాఽయ మాత్మా
బ్రహ్మ సోఽయ మాత్మా చతుష్పాత్.

తా. కనుపడు ఈ సర్వప్రపంచమున లోపలను వెలుపలను అంతయు పరబ్రహ్మమే. ఈజీవాత్మయే పరబ్రహ్మము. పూర్ణాత్మయే నాలుగుపాదములతోగూడిన ఓంకారమున కాధారుడు. (ఈసర్వము బ్రహ్మమని సాధకుని సౌకర్యార్థము చతుష్పాత్తుగా విభజించి చెప్పెను. ఈ ఆత్మయని అభినయపూర్వకముగా నిర్దేశించిచెప్పెను.) ఆత్మయే

బ్రహ్మమని తనహృదయమునందు చేతినుంచి చెప్పుటచే కార్య కారణాత్మకముగా సర్వాత్మకుడై యుండువాడని గ్రహించవలెను.

మూ. నాన్తః ప్రజ్ఞం నబహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం
న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నా ప్రజ్ఞం,
అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచిన్త్య
మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం
ప్రపంచోపశమం శాన్తం శివ మద్వైతం
చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః ॥

తా. తురీయుడగు ఆత్మను అంతఃప్రజ్ఞకలవాడు కాడనియు, బహిః ప్రజ్ఞ కలవాడు కాడనియు, జాగ్రత్స్వప్నాద్యవస్థలకు మధ్యభాగస్థితుడు కాడనియు, ప్రజ్ఞానఘనుడు కాడనియు, సర్వవిషయప్రజ్ఞ కలవాడు కాడనియు, చైతన్యరహితుడు కాడనియు, తలచవలెను.

ఆతురీయుని జ్ఞానేంద్రియముల కగోచరునిగను, వ్యవహారమున కయోగ్యునిగను, కర్మేంద్రియములచే గ్రహింప వీలులేని వానినిగను, ఊహాతీతునిగను, చింతించుటకు వీలులేనివానినిగను, శబ్దములచే నుచ్చరింప వీలులేనివానినిగను, సర్వావస్థలయందు ఈయాత్మ ఒక్కటేఅనెడి అచలజ్ఞానముచేతమాత్రము తెలియదగినవానిగను, అవస్థాత్రయ సర్వ ప్రపంచ విరహితునిగను, భేదవికల్ప విరహితునిగను, శాంతమైన వానిగను అఖండ పరిపూర్ణునిగను తెలిసికొనవలెను.

రజ్జువే సర్పాదివికల్పముచే వికల్పింపబడుచున్నరీతిగా ఒక్క ఆత్మ జాగ్రదాది స్థానత్రయమునందును ఎప్పుడు వికల్పింపబడునో అప్పుడు (ఆత్మ) అంతః ప్రజ్ఞత్వాది గుణవిశిష్టుడు కాడనెడి (నిషేధరూప) విజ్ఞానప్రమాణముతోడనే ఆత్మయందుగల అనర్థనివృత్తి లక్షణరూప ఫలము పరిసమాప్త మగుచున్నది. ఆత్మను పొందుటకై ప్రమాణాం

తరముగాని, మరియొక సాధనముగాని విచారింప నక్కరలేదు. ఎట్లనగా: సర్పముకాదు రజ్జువు, అని తెలిసిన క్షణమందే రజ్జువునందు సర్పత్వమునశించి వెంటనే రజ్జువని తెలిసినట్లుగనే ప్రమాణాంతర మవసరము లేదు. "నేతి నేతి = ఇదికాదు, ఇదికాదు" అనినిషేధించగా శేషించినదే అదియని నిషేధముఖముగా ఆత్మ నుపదేశించియున్నారు. ఇదియే ముఖ్యమైన రహస్యము. ఇట్టిముఖ్యరహస్యమును చెప్పుటకును, వినుటకును, ఆచరణలోపెట్టుటకును దగుసమర్థుడు కోటికొక డుండునని గట్టిగ నమ్మవలెను. మధ్యమధ్య గోచరమగు ఆభాసలను నమ్మకూడదు. హృదయపూర్వకముగ స్వానుభవముచేతనే తెలియవలెనుగాని, శాస్త్రము గురువు ఎంతచెప్పినను లాభములేదు.

తురీయుని పాదత్రయముతో గూడినవానిగ తలంచుచున్నారు. అట్లుకాక, పాదత్రయ విలక్షణముగ తోచునట్టి ఆతురీయుడే ఆత్మ. అదియే తెలిసికొనదగినది. ద్వైతము తోచినప్పటికీద్వైతమందు సత్యదృష్టి లేనియెడల ద్వైతముండజాలదు.

మూ. మాతృదేవో భవ పితృదేవో భవ
ఆచార్యదేవో భవ అతిథిదేవో భవ॥

తా. తల్లియే దైవముగను, తండ్రియే దైవముగను, గురువే దైవముగను, అతిథియే దైవముగను నమ్మినవాడవై ఆచరణలో నుంచవలెను.

మూ. బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి బ్రహ్మవి దాప్నోతి పరం
సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, యోవేద నిహితం
గుహాయాం పరమే వ్యోమన్ సోఽశ్నుతే సర్వాన్
కామాన్ సహ॥

తా. బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపుడే యగుచున్నాడు. సకల శరీరములందును 'అహ మహ' మని వ్యవహరించుచున్న ఆత్మను శరీర జీవాదులందు భావింపక నిత్యుడును పరిపూర్ణుడును నగుసాక్షియందు భావించినవారు జీవన్ముక్తు లగుదురు. ఉపాధి విడిచినప్పుడు బ్రహ్మములో కలియుదురు. బ్రహ్మమునకు జననమరణములు లేనందుననను, జీవత్వారోపణ నశించినందుననను పై భావనా భావితులు జననమరణములు రాకపోకలు లేనివా రగుదురు.

మూ. స యశ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే స ఏకః,
అహం వృక్షస్య రేరివా కీర్తిః పృష్ఠం గిరేరివ
ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృత మస్మి,
ద్రవిణగ్ సువర్చసమ్, సుమేధా అమృతోక్షితః॥

తా. నీవు బ్రహ్మస్వరూడవని గురువుపదేశించుటయు, నేను బ్రహ్మస్వరూపుడనని శిష్యుడు తెలిసికొనుటయే ఈ మహద్వాక్యములోని తాత్పర్యము. వాని సంపూర్ణార్థమును సమాధిలోగాని అపరోక్షముగా నెరుగజాలడు. సాధారణమనుజున కుపదేశించినచో విపరీతభావన తప్పక కలుగును. అట్టి విపరీతభావన కలుగకుండు వానినిపరిశోధించి చెప్పవలెనని ఈవాక్యముల తాత్పర్యము.

మూ. తస్య యజురేవ శిరః ఋగ్దక్షిణఃపక్షః
సామోత్తరఃపక్షః ఆదేశ ఆత్మా
అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా.

తా. మనోమయమగు పక్షియొక్క శిరస్సు, రెక్కలు, తోక మున్నగు అవయవములన్నియు వేదమయములు. ఆత్మ అనగా దేహము. ఆదేశరూపమనగా విధి ప్రతిషేధములదెల్పు బ్రాహ్మణము. మనో

మయకోశము బాగుగ బెఱిగి బలిష్ఠమై యెవనికుండునో వాడు వేద శాస్త్రముల బోధించును. ప్రమాణములను జూపును. వాదించును. శాస్త్రచర్చలయందు దక్షుండు డగును. జనులచే సమ్మానింపబడును. ఇట్లు వేదశాస్త్రములను గనుపఱచుకొనుటయే జన్మసాఫల్య మగుచున్నదా? కాదు. సమూలముగ దుఃఖనివృత్తికలిగి అఖండానందాను భవమును పొందవలెను. అయ్యానందము సర్వశాస్త్రములను చదివి. వినినంత మాత్రమున కలుగదు.

మూ. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కదాచన.

తా. సర్వేంద్రియములు మనస్సు బ్రహ్మమును చేరగోరి పొందలేక మరలి వచ్చును. బ్రహ్మానందము గలవానికి ఇంద్రియాది విషయముల వలని భయములేదు. సదా విషయములతో గూడినమనస్సులో గలుగు ఆత్మను తెలియలేదు — కావున వేదముచే నాత్మసాక్షాత్కారము, ఆత్మ యథార్థజ్ఞానము కలుగనేరదని నమ్మవలెను.

వేదమంతయు మనోమయము కావున మనస్సువల్ల ఆత్మ తెలియ వీలులేదు.

మూ. తస్య శ్రద్ధైవ శిరః ఋతం దక్షిణః పక్షః సత్య
ముత్తరః పక్షః యోగఆత్మా మహాపుచ్ఛం ప్రతిష్ఠా॥

తా. విజ్ఞానమను పక్షికి శ్రద్ధయే శిరస్సు. ఋతసత్యములు రెక్కలు. యోగము దేహము. మహత్తు తోక. ఇట్లు శ్రద్ధ, ఋతసత్యములు, యోగము, మహత్తు, ఏకత్వసమిష్టియగు బుద్ధి ఈనాలుగు విజ్ఞానాంగ ములు. శ్రద్ధ శిరస్థానీయ మగుటవలన ప్రాముఖ్యము నందియున్నది.

శ్రద్ధారాహిత్యమే తమోగుణమనియు, శ్రద్ధలేని యభ్యాసములన్నియు నిష్ఫలములనియు, శ్రద్ధలేనివాడు ఆత్మనుపొందక నశించుననియు చెప్ప బడియున్నది.

శ్రద్ధచే నేకార్యమయినను బాగుపడుటవలన శ్రద్ధకు మేరువు పూసవలె గొప్పతనము కలిగెను.

మూ. తస్య ప్రియమేవశిరః మోదదక్షిణఃపక్షః ప్రమోద
ఉత్తరఃపక్షః ఆనందఆత్మా బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా ॥

తా. ప్రియమేశిరస్సు. మోదప్రమోదములు రెక్కలు, ఆనందము దేహము. బ్రహ్మముతోక.

పుత్రాది ప్రియదర్శనమువలన కలుగుసుఖవిశేషము ప్రియ మనియు, ఆ ప్రియవస్తువులవలన కలుగుసంతోషము మోదమనియు, వానిసంస్పర్శాదుల ననుభవించుటచే కలుగుగొప్పసుఖము ప్రమోద మనియును దృష్టాంతములేకదా. ఈకోశముయొక్క ముఖ్యభా మానందము. దీనికితోక ఆధారమగు బ్రహ్మము. బ్రహ్మమే సర్వ సుఖములకు, సమస్తానందములకు ముఖ్యకారణము. బహ్మానందము యొక్క వాసనలే విషయసుఖములు. సర్వభూతముల హృదయము యందును బ్రతిష్ఠింపబడి యానందమును కలుగజేయునది బ్రహ్మవే యగుచున్నది. అయ్యానంద ముపాధుల మాలిన్యమువలన విషయా నందముగ మారుచుండునేగాని, ఆనందమునకు మూలకారణము బ్రహ్మమే. ఈకోశమువలన దెలియదగిన యానందానుభవ మిదియే

ఇయ్యది కర్మవశమున దుఃఖముగా ప్రాప్తించును. అనుభవముచే నాదుష్కర్మ తీరిపోవును. దుఃఖించిన లాభములేదు. దుఃఖమునకు కారణము రాగద్వేషములు. భేదబుద్ధి అహంకారము. దానిని నాశనము

చేసికొనినచో కారణము, వేగించినగింజవలె నాశనమైనకార్యమున మొలకరాదు. దుఃఖమునశించి పూర్ణజ్ఞానము కలుగును.

సర్వాత్మజ్ఞానమే జ్ఞానము. సర్వము బ్రహ్మమయము. "వాసుదేవ స్సర్వమితి" యనుటచే ప్రతివస్తువులోను బ్రహ్మముకలదు. బ్రహ్మమే ప్రియవస్తువు. అన్నిటియందును బ్రహ్మదృష్టియుంచినచో నన్నియు బ్రహ్మమే యగును. సదా సర్వత్ర పూర్ణానందమే కలుగును. అదియే బ్రహ్మమునందు ప్రతిష్ఠ యనబడును. (వస్తువును జూచినప్పు డావస్తువులో క్షణికసుఖము పొందినరీతి) విషయసుఖములందు సుఖమును పొందినట్లుగనే యీ నామరూపవస్తువులలో పూర్ణాత్మసుఖము, నిత్యసుఖము చూడవలెను.

**మూ.** వా ఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠిత
మావిరావీర్మ ఏధి వేదస్య మ ఆణిస్థ శ్రుతం మే
మా ప్రహాసీ రనే నాధి తే నాహోరాత్రా న్సన్దధామి
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి త న్మా మవతు
త ద్వక్తార మవ త్వవతు మా మవతు వక్తార
మవతు వక్తారం.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

తా. నావాక్కు నిరంతరము మనోరూపమున స్థిరమగుగాక. నా మనస్సు వాక్కునందు స్థిరమగుగాక. వాక్కున్ను, మనస్సున్ను పరస్పర సహాయముగ నుండుగాక. జ్యోతిస్స్వరూపుడవగు నోపరమాత్మా! నా అజ్ఞత్వమును బోగొట్టి నాకు ప్రకాశము కలుగున ట్లనుగ్రహింపుము. ఓ మనోవాక్కులారా! నాకు దిగువ నుదహరింపబడు గ్రంథము గొనంగుటకు సమర్థులగుదురుగాక. నాచే వినబడిన గ్రంథమును దాని

యర్థమును నేను మరువకుందునుగాక. అధ్యయనముచేసి మరువక యుండు గ్రంథమును నేను సర్వకాలములయందును అనుసంధానము చేయుదునుగాక. యథార్థవస్తువగు పరమాత్మనే అనుభవించెదనుగాక. సత్యమునే వచింతునుగాక. మీద చెప్పబడిన బ్రహ్మము గురుశిష్యులమగు మమ్ములను రక్షించునుగాక. ఆధ్యాత్మికాది తాపములు శాంతించుగాక.

మూ. ఆత్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీత్ నాన్య
కించ్చ నమిషత్ స ఈక్షత లోకా న్ను సృజా ఇతి॥

తా. ఈ సర్వజగత్తు సృష్టికి పూర్వము ఆత్మ (పూర్ణాత్మ) ఒక్కటిగనే ఉండెను. ఇతరమైన దేదియును (వ్యాపారమును) లేదు. ఆ పూర్ణాత్మ లోకములను సృష్టించెదనుగాక యనిచూచెను.

ఫేన బుద్బుద తరంగాదులు నామరూపములను పొంది నీటికంటె వేరుగ తోచినప్పటికినీ మరలనవి నీరుమాత్రమే యైయుండునట్లు ప్రపంచమునందున్న సకలనామరూపములను పొందిన సకలవస్తువులును పరమాత్మకంటె భిన్నముకావని తెలియవలెను.

మూ. స ఏష బ్రహ్మ ఏష ఇన్ద్ర ఏష ప్రజాపతి రేతే సర్వే
దేవా ఇమానిచ క్షుద్ర మిశ్రాణీవ బీజా నీతరాణి
చేతరాణి చాణ్డజాని చ జారుజాని చ స్వేదజాని
చోద్భిజ్జాని చాశ్వా గావః పురుషా హస్తినో
య త్కిఞ్చేదం ప్రాణిజఙ్గమంచ పతత్రిచ యచ్చ
స్థావరం సర్వం త త్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం
ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ॥

తా. అంతఃకరణమందును జలమందును ప్రతిఫలించిన సూర్యబింబమువలె ప్రవేశించియుండు ఈ ప్రజ్ఞానాత్మయే హిరణ్యగర్భు డనుపేరున

ప్రాణరూపమగు ఆత్మ. ఈ ప్రజ్ఞానాత్మయే దేహేంద్రియాదులయందు జీవరూపముతో ప్రవేశించినది. సకలదేవతలును, భోక్తృ భోజ్యములై అన్నాన్నాద లక్షణములైన పంచ మహాభూతములును, సమస్త జీవ రాసులును గల యీ ప్రపంచమంతయును ప్రజ్ఞానమునందే ప్రతిష్ఠింప బడియున్నది. ఈ ప్రజ్ఞానమే శాశ్వతమైన బ్రహ్మస్వరూపము. సమస్త మును ప్రజ్ఞాన మనుపేరుగల పూర్ణాత్మ (బ్రహ్మ) స్వరూపము. ప్రజ్ఞా నేత్ర మనగా: ప్రజ్ఞయే (జ్ఞానమే) నేత్రముగా గలది. 'దేనిచే చూడ బడుచున్నదో అదే నేత్రము, సర్వప్రపంచమున్ను జ్ఞానమే నేత్రముగా కలిగియున్నది.' బ్రహ్మాది స్తంభపర్యంతము (గరికపోచ మొదలు బ్రహ్మ వరకు)గల సర్వజగత్తు పూర్ణాత్మస్వరూపమని ముఖ్యాభిప్రాయము.

మూ. స ఏతే నైన ప్రజ్ఞానాత్మనా ఽస్మాల్లోకా దుత్క్ర-
మ్యాముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్ కామా నాప్త్వా
ఽమృత స్సమభవ త్సమభవ దితి॥

తా. పూర్వు లే ప్రజ్ఞాన బ్రహ్మమును తెలిసికొని ముక్తులయిరో; ఆ ప్రజ్ఞానాత్మచేతనే సాధకు డీలోకమునుండి (దేహాత్మభావమునుండి) గూటినిండి పక్షి యెగిరిపోవునట్లుగా శరీరమునుండి లేచిపోయి విదేహుడై అశరీరుడై పూర్ణాత్మను పొందినవాడై ప్రారబ్ధానుసారముగ సర్వసుఖ ములను పొంది పూర్ణు డగుచున్నాడు.

మూ. కో ఽయ మా త్మేతి వయ ముపాస్మహే కతర స్స
ఆత్మా యేన వా రూపం పశ్యతి యేన వా శబ్దం
శృణోతి యేన వా గన్ధా నాజిఘ్రతి యేన వా
వాచం వ్యాకరోతి యేన వా స్వాదు చాస్వాదుచ విజానాతి.

తా. వామదేవాద్యాచార్యపరంపరాయాతమగు వేదవ్రాతముచే బోధింపబడినదియు బ్రహ్మజ్ఞానుల సంఘములందు సుప్రసిద్ధమైనదియు నగు బ్రహ్మవిద్యాసాధనకృత సర్వాత్మభావరూపఫలము నందుట కిచ్ఛ గలవారు ముముక్షువులు నగు బ్రాహ్మణులు జీవస్థితినిపొంది అనిత్యమైన సంసారమునుండి తరింపగోరినవారై ఈ ఆత్మ ఏది? అని ఒకరినొకరు ప్రశ్నించుకొనిరి.

మనుజు లెద్దాని నాత్మ యనియుపాసించెదరో అయ్యాత్మ (వామదేవాదు లుపాసించి ముక్తిని బొందిన ఆత్మ) ఏది? మనము దాని నెట్లుపాసించెద మని పరస్పరము ప్రశ్నించుకొనిన బ్రహ్మజిజ్ఞాసువులకు విచారణదశయందు మున్ను బ్రహ్మరంధ్రద్వారమున శరీరేంద్రియములయందు బ్రవేశించి యుండుపరాపరములగు ఆత్మప్రాణము లను నీరెంటియొక్క విశేషవిషయమును వినియుండుటవలన స్మృతికలిగి ఈ పురుషుని ఆపరబ్రహ్మను తెలిసికొనిరి.

ఆత్మప్రాణములను నీరెండుబ్రహ్మములును అన్యోన్యప్రతికూలములుగా నీశరీరమునందు ప్రవేశించినవి; కావున నీరెంటిలో ఉపాసింపదగిన ఆత్మ ఏది? యని మరల విచారింపదొడంగిన ముముక్షువులు 'ఏకస్వరూపమగుఆత్మ దేహేంద్రియాది సముదాయరూపమైన పిండమునందు ప్రాణము, ఆత్మ యను రెండురూపములుగ నెట్లు ప్రవేశించిన' దని విశేషవిచారముచేసికొని, పిదప ఆత్మప్రాణములు రెంటిలో ఆత్మస్వరూపమునకు తగియున్న దేది! యది దేనిచేత పొందబడుచున్నది? యని ఆకాంక్షించుకొని; తుదకు మనస్సుచేతనే పొందబడుచున్న దనియు, ఆ మన స్సనేకవిధములైనదని శ్రుతియే బోధించుచున్న దనియు తెలిసికొనిరి. ఏది నేత్రేంద్రియముచే రూపములను జూచుచున్నదో ఏది శ్రోత్రేంద్రియముచే శబ్దమును వినుచున్నదో ఏది ఘ్రాణేంద్రియముచే గంధము నాఘ్రాణించుచున్నదో ఏది వాగింద్రియముచే వాక్కు నుచ్చ

రించుచున్నదో ఏది జిహ్వేంద్రియముచే రుచిని అరుచిని తెలిసికొను చున్నదో అది ఆ యాయింద్రియము లగుసాధనముల రూపమున నున్నప్రాణాత్మ యని తెలిసికొనవలెను.

## (ఉపదేశ వాక్యము)

మూ. ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావ దేతి
చిరం యావ న్న విమోక్ష్యే ఉదసంపత్స్యేత ఇతి.

తా. ఏ పురుషుడు సద్గురువువలన తత్త్వోపదేశము (పరోక్షాపరోక్ష జనకములైన మహావాక్యములను, తదర్థములను) పొందుచున్నాడో; ఆ పురుషుడు ఆకాలమందే అక్కడనే ఆఘడియలోనే ఆ దేశము లోనే (స్వప్నమధ్యమున నెక్కడ తెలివివచ్చిన నక్కడనే స్వప్నభయము, స్వప్ననగరాదులు మిథ్య యగు నట్లు) అవిద్యాముక్తుడగుచున్నాడని యును పరిపూర్ణుడనియు చెప్పబడును. అట్టి యుపదేశరహితు డవిద్యా ముక్తుడు కా జాల డనిచెప్పబడును.

అథవా తెలిసినను శాస్త్రజ్ఞానమే కాని సందేహరహితమైన అనుభవజ్ఞానము కలుగదు.

మూ. యథా సో మ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం
విజ్ఞాతం స్యా ద్వాచారమ్భణం వికారో నామధేయం
మృత్తికేత్యేవ సత్యం,
యథా సో మ్యైకేన లోహమణినా సర్వం లోహ
మయం విజ్ఞాతం స్యా ద్వాచారమ్భణం వికారో నామ
ధేయం లోహమిత్యేవ సత్యం,
సర్వం ఖల్విదం బ్రహ్మ.

తా. కుండ, మూకుడు, కడవ మొదలగువస్తువు లెట్లు త్రికాలముల యందును మన్నుశేషించినవై యగుచున్నట్టు లీసర్వమును బ్రహ్మమే

నామ రూపాదులు వికారమాత్రములే కాని యథార్థములు కావు. లోహముతో చేయబడిన పదార్థము లన్నియు లోహమయము లైనట్లు నిజమైన బ్రహ్మవస్తువునందు నామ రూపములతోగూడిన వికారములు కలిగిన నది రజ్జుసర్పభ్రాంతి వంటిదని తెలిసికొనవలెను.

'బ్రహ్మ సత్యం జగ న్మిథ్య' యని న ట్లీ సర్వజగత్తును కల్పితమే యనునది ముఖ్యాంశము.

మూ. ఐతదాత్మ్య మిదగ్ సర్వం త త్సత్యగ్ స ఆత్మా
త త్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా
భగవాన్ విజ్ఞాపయ త్వితి తథా సోమ్యేతి
హో వాచ.

తా. "ఈసమస్తప్రపంచము అధిష్ఠానస్వరూపమే అయియున్నది. అదియే సత్యము; అదియేప్రత్యగాత్మ; కనుక నీవును సర్వప్రపంచమున కధిష్ఠానము, సత్యము, అద్వితీయము, అఖండైకరసము, పరిపూర్ణము నగుప్రత్యగభిన్నపరిపూర్ణము నైయున్నావు." అని శ్వేతకేతువనకు తండ్రిబోధించెను.

మూ. భూమైవ తత్సుఖం భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యం.
యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్య
ద్విజ్ఞాయతే త ద్భూమా అన్యథా ర్తం తన్మ ర్త్యం.
యద్భూమా త దమృత మితి.

తా. నిత్యానందమే బ్రహ్మస్వరూప మనియు, అయ్యానందము నిత్యసుఖరూప మనియు, (భూమా) పరిపూర్ణ మనియు జెప్పబడిన పరిపూర్ణవస్తువు ఏస్థలమునగాని, ఏయవస్థయందుగాని, చక్షుర్గోచరమైన

ఏవస్తువున్ను కాక శ్రవణగోచరమైన ఏశబ్దమున్ను కాక మనోగోచరమైన ఏపదార్థమున్ను గాక అఖండాకారమై సర్వత్ర నిండియున్నది. అయ్యది నిత్యనిరవధిక సుఖస్వరూపమనియు ఆత్మ పరబ్రహ్మ మనియును తెలియబడుచున్నది.

మూ. యోవై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ
సుఖం భూమాత్వేవ విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం
భగవో విజిజ్ఞాస ఇతి యత్ర నాన్యత్పశ్యతి
నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమాఽ
న్యత్పశ్య త్యన్యచ్ఛృణో త్యన్యద్విజానాతి
తదల్పం యోవై భూమా తదమృత మథ యదల్పం
తన్మర్త్యగ్ం సభగవః కస్మిన్ప్రతిష్ఠిత మితి స్వే
మహిమ్ని యదివా న మహిమ్నీతి భూతోత్పత్తేః
పురా భూమి త్రిపుటీ ద్వైతవర్జనాత్ జ్ఞాతృ జ్ఞాన
జ్ఞేయరూపా త్రిపుటీ ప్రలయేపిన్॥

తా. బ్రహ్మవస్తువును భూమాస్వరూపముగా నిర్దేశించి ఉపదేశించియున్నారు. ఏది భూమా యనబడునో యది నిత్య పరిపూర్ణసుఖము. పూర్ణముకానిది నశించును. అట్లు నశించుదానియందు సుఖములేదు.

భూమాస్వరూప మెట్టిదనిన? —— తాను జాగ్రత్‌లోగాని, ఏ అవస్థలోగాని యున్నపుడు ఏరూప మగపడదో ఏశబ్దమువినబడదో ఏ మనస్సు గోచరముకాదో ఆ అవస్థయే భూమావస్థ యనబడును. అదియే తురీయ తురీయాతీతమై ఏదృశ్యమును లేనిదై పూర్ణాత్మ యనబడుచున్నది.

ఏరూపము కనబడినను, ఏశబ్దము వినబడినను, ఏవస్తువు స్ఫురించినను ఆయ్యవస్థ నశించును. పూర్ణావస్థ అమృతము, జననమరణరహితము.

బ్రహ్మాకారము నగుచున్నది. రెండవది మాయాస్వరూప మగుట జనన మరణములు కలది; కావున జాగ్రత్తులోనే సర్వశూన్యము కావలెను. సృష్ట్యాదిని, సృష్ట్యంతమందును జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము లను త్రిపుటి లేనందున నాకాలము భూమాకారముగా నున్నది.

అదియే నిజమగుబ్రహ్మము. అదియే పూర్ణమనియు చెప్పబడును.

మూ. వాచారమ్భణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యం.

తా. కుండ, కడవ, మూకుడు మొదలగు వికారములు వాఙ్మాత్ర ములే. వానికి కారణమయిన మృత్తే సత్యము. ఇట్లాచార్యోపదేశము వలన అనాత్మవస్తువులన్నియు నసత్యములనియు, ఆత్మయొక్కటే సత్య మనియు (బ్రహ్మసత్యంజగన్మిథ్య — యనుటచేత) తెలిసికొని మనస్సు విషయములను సంకల్పింపకూడదు.

దహింపబడు పదార్థములేనప్పుడు అగ్ని చల్లారునట్లుగనే సంకల్ప విషయములు లేనప్పుడు మనస్సు నాశనమగును.

మూ. య దేవ విద్యయా కరోతి శ్రద్ధ యోపనిషదా
త దేవ వీర్యవత్తరం భవతి.

తా. పద్మరాగాది మణుల వ్యాపారము చేయువా రామణుల విష యిక మగు జ్ఞానము కలవారైనచో నధికమగు ఫలమందెదరు. అట్లే విజ్ఞానయుక్తుడు వివేకజ్ఞానయోగముతో సాధించెనేని వానిధ్యాన మెక్కువవీర్యవంత మైయుండును.

అనగా: శాస్త్రము, యుక్తి, ఉపదేశములవలన జ్ఞానముకలవాడై దాని ననుభవమునకు దెచ్చుకొనుటకై జ్ఞానయోగముచే సాధింపవలెను. జ్ఞానయోగమే ఫలవంతముగ నుండును గాని, కేవల మణిమాది సిద్ధుల వలన రాకపోకలులేని రాజమార్గ మలవడనేరదు. యోగమనగా

హఠయోగము కాదు. జ్ఞానయోగమే ముఖ్యయోగమనియు సుఖమనియు, సులభమనియు నమ్మవలెను.

మూ. యే నాశ్రుతగ్ శ్రుతం భవ త్యమతం
మత మజ్ఞాతం విజ్ఞాతమితి.

తా. "ఏవిషయమును గ్రహించుటచేత శ్రవణము చేయబడనిది శ్రవణము చేయబడినదిగాను, మననము చేయబడనిది మననము చేయబడినదిగాను, అగుచున్నదో! అట్టి రహస్యవిషయమును గురువులవలన ఉపదేశరూపమున గ్రహించియుంటివా?" అని ఉద్దాలకమహర్షి తన పుత్రుడైన శ్వేతకేతువున కుపదేశించెను.

మూ. స దేవ సోమ్యేద మగ్రఆసీత్
ఏక మే వాద్వితీయమ్.

తా. ఓప్రియదర్శనుడా! ఈ సర్వప్రపంచ మంతయును సృష్టికి పూర్వమందు రెండవవస్తువు లేనిదియు, నొక్కటేఅయినదియు, నిర్వికారాఖండ స్వరూపమైనదియు నగు సత్స్వరూపముగనే యుండెను.

మూ. సదేవ సోమ్యేద మగ్రఆసీత్
ఏకమే వాద్వితీయమ్.

తా. సృష్టికి పూర్వము బ్రహ్మము స్వజాతి విజాతి స్వగతభేదము లేనిదై ఒక్కటిమాత్రమే ఉండెను. పత్ర పుష్ప ఫలాదులవలన వృక్షమునకుగల భేదమువలె స్వగత భేదమున్నూ, (వృక్షమునుండి ఫల పుష్పాదులు వచ్చినట్లు) 'అరటితోటలో చెఱకురీతి' వృక్షమునకు స్వజాతిభేదమున్నూ, వృక్షములలో శిలాదులు భేదించినట్లు విజాతిభేదమున్నూ గ్రహించవలెను. ఏకం, ఏవ, అద్వితీయం, అనుమూడు పద

ములచేత అయ్యాఖండపరిపూర్ణమునం దీభేదత్రయము నివారింపబడు చున్నది ; కనుకనే స్వజాతి, విజాతి, స్వగత భేదములు పరబ్రహ్మము నకు లేవు.

పరబ్రహ్మమున కవయవములు లేవు. అవయవనిరూపణ లేక పోవుటచేత నామరూపములు పూర్ణముయొక్క అవయవములు కావు. నామరూపములే సృష్టికనుకను, సృష్టికిపూర్వము నామరూపములు లేవు కనుకను స్వజాతి, విజాతి, స్వగతభేదములు పూర్ణమునకు లేవు.

మూ. తత్సత్యం త దాత్మా తత్త్వమసి శ్వేతకేతో,

తా. 'తత్త్వమసి' యను వాక్యము సత్యము. దానిని సాక్షాత్కారముగా నేను తెలిసికొనగలను. అందుకై ప్రయత్నము చేసెదను. అను నమ్మకముశ్రద్ధ. 'బ్రహ్మవిషయ నిర్వచన సత్యము' అనువాక్య సత్యత్వము నేను ప్రయత్నించి అనుభవముచే తెలిసికొనగల నను నమ్మకము శ్రద్ధ. ఇంతమాత్రము నమ్మవలెను. నమ్మినదానిని స్వానుభవముచే సత్యమను జ్ఞానమును పొందవలెను. గురువాక్యమును గ్రహించుట శ్రవణము. అంతమాత్రము చాలదు. అనుభవ దర్శనమునకు మనన, నిధి, ధ్యాసములు శ్రవణముతో చేరవలెను.

మోక్షాపేక్షకలవారు పరబ్రహ్మమే ఇష్టదైవమనియు, ఇష్ట దైవమే సద్గురువనియు, సద్గురుసేవయే (సర్వభూతసేవయే) సద్ధర్మమనియు, సద్గురుబోధయే వేదమనియు, వేదసారమే వేదాంతమనియు, వేదాంతరహస్యార్థమే మోక్షమార్గమనియు, మోక్షాపేక్షయే తపస్సనియు, తపఃఫలమే మననమనియు, మననమే నిధిధ్యాసమనియు, నిధిధ్యాసయే సమాధియనియు, సమాధియే సాక్షాత్కారమనియు, సాక్షాత్కారదశయే పరబ్రహ్మమనియు, పరబ్రహ్మమే ఆనందమనియు, ఆనందమే ముక్తియనియు దృఢముగా తెలియవలెను. ముముక్షువు

నిరంతరము పరమాచార్యులయందును, ఇష్టదేవమందును, తత్వార్థము లందును, ముఖ్యముగా శ్రద్ధకలిగి యుండవలెను. పరమాచార్యునియందు గల శ్రద్ధ పరమమగు జ్ఞానమునకు ముఖ్యసాధనముగను, ఇష్టదైవము నందుగల శ్రద్ధ పాపవిముక్తికి ముఖ్యసాధనముగను, తత్వార్థముల యందు గల శ్రద్ధ సంశయవిచ్ఛిత్తికి ముఖ్యసాధనముగను నగుచున్నవి; కావున శ్రద్ధలేనివారికి సుజ్ఞానము లభ్యముకాదు.

శ్రద్ధావిహీనునకు పరమార్థ మెంతమాత్రమును మనస్సునపట్టదు. ఆచార్యుని యనుగ్రహములేక శ్రవణాదులు ఫలించవు. తన్నుతామరచి తన్మయ మగువఱకును, గురుదైవార్థమునందు శ్రద్ధకలిగి పాటుపడు వానికే బ్రహ్మానందము సిద్ధించును. ఆచార్యుని యనుగ్రహము కలిగిన తోడనే జ్ఞానముకలుగును. జ్ఞానముకలిగినంత అజ్ఞానము నశించును. అజ్ఞానము నశించినంతనే ఆత్మానందము కలుగును. ఆత్మానందము కలిగినతోడనే సర్వదుఃఖములు నశించును. దుఃఖనివృత్తి యగుట తోడనే సంచితకర్మమంతయును భస్మమగును. తన్నుతామరచి తత్వము నందు కలసి తన్మయముగా నుండవలెనన్నచో బ్రహ్మోపదేశమును పొంద వలసియుండును! బ్రహ్మోపదేశము లభించినపక్షమున బంధములన్నియు విడిపోవును. బంధమోచన మగుటతోడనే పరమోత్తమమైన విశ్రాంతి కలుగును. కావున సర్వవిషయములకును ముఖ్యకారణము సత్పురుషుల సాంగత్యమని తెలిసికొని సంచరించుచు గురుసేవారతుడయి వర్తించు నట్టి యుత్తమున కేవిషయమునందును లోపముకలుగదు.

ముముక్షువునకు గురు, శాస్త్రార్థములయందు దృఢనమ్మకము, భక్తి శ్రద్ధలునుండవలయును.

మూ. తద్ధేదం తర్హి అవ్యాకృతమాసీత్ తన్నామరూపాభ్యా మేవ
వ్యాక్రియత అసౌనామా అయ మిదం రూప ఇతి॥

తా. అవ్యక్తముగ నుండినజగత్తు నామరూపములతో వ్యక్తమయ్యెను. వ్యక్తప్రపంచములో నామరూపములు లేని పదార్థములేదు. నామరూపధారణమే జీవుడను వ్యవహారమునకు కారణము.

మూ. స ఏష సంవత్సరః ప్రజాపతిః షోడశకలా స్తస్య రాత్రయ ఏవ పంచదశకలా ధృవై వాస్య షోడశీ కలా స రాత్రిభి రేవా చ పూర్యతేఽ చపక్షీయతే తస్మా దేతాగ్ం రాత్రిం ప్రాణభృతః ప్రాణం నవిచ్ఛింద్యా దపి కృకలాసస్యై తస్యా ఏవ దేవతాయా అపచిత్యై యో వై త సంవత్సరః ప్రజాపతిః షోడశకలోఽయ మేవ స యోఽయ మేవంవి త్పురుష స్తస్య విత్తమేవ పంచదశ కలా ఆత్మై వాస్య షోడశీ కలా స విత్తే నైవ పూర్యతేఽ చపక్షీయతే॥

తా. షోడశకళలకు సంవత్సరమనినామము. అది కాలస్వరూపప్రజాపతియనునామము కలదిగ చెప్పబడుచున్నది. ఆ సంవత్సరమునకు ఈ షోడశకళలు అవయవములుగా నున్నవి. అందు షోడశీకళ ధృవకళగా నున్నది. ఈప్రజాపతిశబ్దము సృష్టికర్తయందును, 360 దినరూపకళల కధిపతియయిన సంవత్సరమందును వర్తించుచున్నది. ఇందు రాత్రులు ముఖ్యములు. షోడశీకళ రాత్రులచేతనే వృద్ధిక్షయముల పొందు చున్నది. శుక్లపక్ష రాత్రులచేత వృద్ధిపొంది పౌర్ణమాసియనియు కృష్ణపక్ష రాత్రులచేత క్షయమునుపొంది యమావాస్యయనియు న పించుకొనుచున్నది. దినమందు ధృవకళమాత్రము నిలిచియుండును. ఆ కళ అమావాస్యయందు ప్రాణులలో లీనమైయుండును; కావున దినమందే ప్రాణికిని హింసకలుగచేయగూడదు. అమావాస్య కళా రహితము; కాన నాదినమున నెంతమాత్రమును ప్రాణిహింస చేయ కూడదు. రాత్రిరూపమైన కాలవర్తిణియును సరఘు (మధు మక్షిక) శుక్ల, కృష్ణ పక్ష భేదముచే పంచదశకళ లను ధనమును పూరించుచు హరించుచునుండును. కావున నీ పంచదశకళలు షోడశీకళయొక్క

ధనముగానున్నవి. ఆ ధృవకళయే పరమాత్మయని యాజ్ఞవల్క్య మహర్షి తనశిష్యులకుపదేశించినట్లు తెలియుచున్నది. కనుక నీషోడశీ కళ సకలవేదాంతములందును. శ్రుతి స్మృతి పురాణేతిహాసములచే ప్రతిపాదితమై జగద్విఖ్యాత మైయున్నది.

మూ. వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునావై
గౌతమసూత్రేణ అయంచ లోకః పరశ్చలోకః సర్వా
ణిచ భూతాని సంవృద్ధాని భవంతి కతమ ఏకో
దేవ ఇతి ప్రాణ ఇతి స బ్రహ్మే త్యదిత్యాచక్షతే.

తా. సమిష్టిదృష్టిచే చూడగా నీశ్వరశక్తియగు ప్రాణము ఆదిత్యాది సర్వభూతచైతన్యమున కధిష్ఠానమై యుండునట్లు వ్యష్టియందును జీవశక్తియగు ప్రాణము సర్వకరణముల కధిష్ఠానమై యొప్పుచుండును.

ఈశ్వరాంశ మగుజీవుడవినాశి యని తెలియుచున్నది; కావున జీవుని శక్తియగుప్రాణమునుగురించి భయపడనవసరములేదు. ప్రాణము పోవునని చింతించుట కవకాశములేదు. జీవుని సంసారభ్రమణకాలమందే ఏ జన్మలో నెట్టి అనుభవప్రాప్తి చేకూరెడినో! ఎంతటిజ్ఞానము సంపాదింపవలయునో! తత్సాధనార్థ ముపయుక్తము లగుదేహము లేర్పడియుండును. ఏదేహముతో వచ్చినపని సమాప్తమగునో, ఏ దేహముతో నెక్కుడు జ్ఞానము సంపాదించుటకు వీలుకాదో, ఏదేహముకతన తనశక్తులను ప్రకాశింపచేయుటకు శక్యముకానేరదో అట్టి దేహమును జీవుడువదలి (పైమెట్టునకు) అధికజ్ఞానసంపాదనకు దగినదేహమును మఱియొకదానిని నిర్మించుకొనును. కావున శోక మోహములు పొందగూడదు.

మూ. న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి.

తా. పతియందలిప్రేమచే పతిప్రియుడు కాడు. ఆతనిప్రేమచేతనే పతి ప్రియుడగును. భగవంతుడు నీలోపల వెలుపల అంతట వ్యాపించియున్నాడనియు, ప్రతివస్తువు అతనిని స్మరించుటకే నీ కగపడుచున్నదనియు, అట్టిభావనచే హేయమగు పదార్థ మేదియు లేదనియు, నీయందుండెడి భగవంతుడే సర్వభూతములయం దున్నాడనియు, సర్వభూతములు నీయందు భగవంతునియందు నున్నవనియు నెఱుంగుము. నీవు దేహతాదాత్మ్యమును చెందుటచేత ననేకవాసనలతో గూడినసుఖదుఃఖములనుభవించుచు సంసారసాగరములో నిమగ్నుడవైతివి. కనుక వివేకివై సుఖదుఃఖములతోగూడిన సర్వవాసనలను విడిచిపెట్టుము.

మూ. పశూన్ దేవతాభ్యః ప్రత్యాహతో తస్మా
త్పర్వా దేవత్వం ప్రేక్షితం ప్రాజాపత్య
మాలభంతే॥

తా. యాజ్ఞికులు వధించుపశువు మనయందున్న పశుబుద్ధియని గ్రహించి పశువునుబంధించి చంపుట పాపహేతువని తెలియవలెను. మనలోనున్న పశుత్వమును, పశుబుద్ధులను వధింపవలెను.

అనగా: వధించవలసినవి కామక్రోధాదులు.

మూ. యత్ర లోకా నలోకా దేవా నదేవా యజ్ఞా
నయజ్ఞా మాతా నమాతా పితా నపితా స్నుషా
నస్నుషా చాణ్డాలో నచాణ్డాలః పౌస్కలో
నపౌస్కల శ్ర్యమణో నశ్రమణా స్తాపసో
నతాపసా స ఏక మేవాతఃపరం బ్రహ్మవిభాతి నిర్వాణం.

తా. ఏపరిపూర్ణమందు లోకములు లోకములుగావో దేవతలు దేవతలుగావో వేదములు వేదములుగావో యాగములు యాగములు

గావో తల్లి తల్లిగాదో తండ్రి తండ్రికాఁడో కోడలు కోడలుకాదో మాలవాఁడు మాలవాఁడుకాఁడో సన్యాసి సన్యాసికాఁడో తపస్వి తపస్వి కాఁడో అట్టిపరబ్రహ్మము అద్వితీయమగు మోక్షస్వరూపమై అఖండమై యున్నది.

మూ. న తత్ర దేవా ఋషయః పితర ఈశతే
ప్రతిబుధ్య సర్వ విద్యేతి.

తా. ఆ పరిపూర్ణమును దేవతలును, ఋషులును నియమింపజాలరు. సర్వజ్ఞుఁడగువాఁడాపరబ్రహ్మమును దెలిసికొనినవాఁడై అఖండుఁడై రాక పోకలు లేనివాఁడగును.

మూ. యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్య
త్సహజం పురస్తాత్ ఆయుష్య మగ్ర్యం ప్రతి
ముంచ శుభ్రగ్ యజ్ఞోపవీతం బలమస్తు తేజః.

తా. ముందుగా సృష్టికర్త యగుబ్రహ్మకు తోడబుట్టినదియు, శ్రేష్ఠమైనదియు, పావనమైనదియు, ఆయువును గలుగచేయునదియు, నన్నిటి కన్న ముందుబుట్టినదియు, నైన సూత్రరూపమగుయజ్ఞోపవీత మేదియో దానిని గ్రహింపుము. పరిశుద్ధమును, దృఢమును, తేజోరూపమును నగుయజ్ఞోపవీతము బుద్ధిగుహాయందిం ద్రియ, ప్రాణ, తేజోరూపములను మూడువిధములుగనుండుపరబ్రహ్మస్వరూపమైనసూత్రాత్మయగుచున్నది.
మోక్షేచ్ఛువట్టి యజ్ఞోపవీతమునే కోరవలయును.

మూ. యేన సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ
త త్సూత్రం ధారయే ద్యోగీ యోగవి త్తత్వదర్శివాన్
బహిస్సూత్రం త్యజే ద్విద్వాన్ యోగ ముత్తమ మాస్థితః.

తా. ఎవ డా మోక్షస్వరూప మగు యజ్ఞోపవీతమును తెలిసికొనునో వాడే బ్రాహ్మణు డనబడును. 'బుద్ధి వృత్తిరూపముతో నేను పరబ్రహ్మ మైతి' ననెడు జ్ఞానమునువిడిచి నిర స్తాశేష విశేషము గల (ఏయుపాధిలేని నిరుపాధిక పరబ్రహ్మమాత్రుడై శేషించియున్న) వా డవ్వ్యోనేని శ్రేయస్కాముడు డగుచున్నాడు.

ఈ సమస్త ప్రపంచమును దారమునందు మణుల సమూహము వలె దేనితో గ్రుచ్చ బడియున్నదో అట్టి బహ్మసూత్రమును యోగ విదుడును, పరబ్రహ్మతత్వ్వమును తెలిసికొనిన వాడును నగుయోగి ధరించును. బ్రహ్మ స్వరూపమును దెలిసికొనినజ్ఞాని శ్రేష్ఠు డగు జీవబ్రహ్మైక్య రూపమును బొందినవాడై వెలుపల కర్మాంగముగా ధరింపబడిన యజ్ఞోపవీతమును విడుచును.

మూ. ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ
స్సర్వవ్యాపీ సర్వభూతా న్తరాత్మా,
కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస
స్సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ ॥

తా. అద్వితీయుడును, స్వయంప్రకాశుడును నగుపరమాత్మ సకల భూతములందును రహస్యమైనవాడై అంతటను వ్యాపించియున్నాడు. వాడు సమస్తభూతముల లోపల నుండు నాత్మస్వరూపమును, కర్మాధిపతియును, సర్వభూతములందధిష్ఠించి నివసించియుండువాడును, సాక్షియును, చైతన్యస్వరూపుడును, సమస్తమగు వాసనావిశేష శూన్యమైన ఏకరూపుడును నిర్గుణుడును నైయున్నాడు.

మూ— ఏకో వశీ సర్వభూతాంతరాత్మైకగ్ం రూపం
బహుధా యః కరోతి, త మాత్మ స్థం

అనుపశ్యంతి ధీరా స్తేషాగ్ సుఖం
శాశ్వతం నేతరేషాం.

తా. అద్వితీయుడును, సర్వమును స్వాధీనముచేసికొనియుండువాడు సర్వభూతాంతరాత్మయు నగు ఏ పరమాత్మయొక్క రూపమునే అనేక రూపములుగా చేయునో; అట్టి హృదయమునందుండు పరమాత్మ జితేంద్రియులగు నేజ్ఞాను లనుసరించి చూతురో వారికి శాశ్వతమ పరబ్రహ్మానందమగు సుఖము కలుగును. ఇతరులకు లేదు.

మూ. తిలేషు తైలం దధినీవసర్పి రాపస్స్రోతస్స్వరణీషు
చాగ్నిః ఏవ మాత్మాఽఽత్మని జాయ తేఽసౌ
సత్యేన తపసా యోఽనుపశ్యతి॥

తా. ఏ పరమాత్మస్వరూపము సత్యముచేతను, తపస్సుచేతను తన్ననుసరించి చూచుచున్నదో; ఆపరమాత్మస్వరూపము నువ్వు యందు నూనె, పెరుగునందు నెయ్యి, ప్రవాహమునం దుదకము, అ మంథన దారువులయం దగ్నియు నుండినరీతి అంతకరణమునందు కలు చున్నది. (బ్రహ్మసాక్షాత్కార మగుచున్నది.)

మూ. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ
అనంత మేతజ్జీవస్య యద్జ్ఞాత్వా ముచ్యతే బుధః॥

తా. మనస్సులోగూడిన వాగాది సర్వేంద్రియములు ఏపరబ్ర మును పొందజాలక మరలిపోవుచున్నవో; పండితుడు, జ్ఞానియు నగు దేపూర్ణమును తెలిసికొని జనన మరణ ప్రవాహరూపమైన సం రమునుండి ముక్తుడగుచున్నాడో; అదియే జన్మసాఫల్యము.

మూ. సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పి రివార్పితం,

తా. పాలయందుండు నేయివలె బ్రహ్మవిద్యాజ్ఞానతపములే ప్రధానములుగా గల పరమాత్మయే సర్వవ్యాపిగా బ్రహ్మవేత్తలు తెలిసికొనుచున్నారు.

మూ. పరేణ నాకం నిహితం గుహాయాం బిభాజ
దేత ద్యతయో విశన్తి, వేదాన్తవిజ్ఞాన
సునిశ్చితార్థా స్స న్యాసయోగా ద్యతయ
శ్శుద్ధసత్వాః॥

5/703

తా. స్వర్గముకంటె శ్రేష్ఠమైనదై, హృదయ గుహాయందుండునదై ఏ ప్రకాశించుచున్నదో; ఆ పరబ్రహ్మమును వేదాంత రహస్యముచే చక్కగా నిశ్చయింపబడియుండు అర్థమును తెలిసికొన్నవారును, సన్యాసయోగముచేత (అంతఃకరణకు పట్టిన సర్వవాసనాత్యాగమే సన్యాసయోగము) పరిశుద్ధమైన అంతఃకరణము కలవారు నగు యతులు మాత్రమే పొందగలుగుచున్నారు.

మూ. స ఏవ సర్వం, య ద్భూతం, యచ్చ భవ్యం, సనాతనం
జ్ఞాత్వా తం మృత్యు మత్యేతి నాన్యః పన్థా
విముక్తయే.

తా. త్రికాలములయందును, సర్వమును శాశ్వతముగ నుండునది ఆపరమాత్మయే. అట్టి పరమాత్మను తెలిసికొని జ్ఞాని మృత్యువునుండి తరించి ముక్తిని బొందుచున్నాడు. ముక్తిని పొందుట కింతకంటె వేరు మార్గము లేదు.

మూ. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా.

తా. సర్వభూతములయందును తనను, తనయందు సకల భూతములను సూక్ష్మదృష్టితో (సద్బుద్ధి, వివేకజ్ఞానములతో) చూచువారు పరబ్రహ్మమును పొందుచున్నారు. ఏ యితరకార్యములచేతను పొందశక్యము కాదు. అనగా: నేను నాది యను నభిమానము, (భేదదృష్టి) ఉన్నంత కాలము శక్యముకాదు. సర్వేషణములు ఛేదింపబడినంతనే ఆవస్తువు తెలియబడును.

మూ. ఆధార మానన్ద మఖణ్డబోధం
యస్మిన్ లయం యాతి పురత్రయం చ॥

తా. సర్వమున కాధారముగను, ఆ నందముగను, అఖండజ్ఞానముగను నుండునట్టి పరమాత్మయందు సర్వేషణములు సమస్తదేహములు లయమును పొందుచున్నవి.

మూ. య త్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్
సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్.

తా. సర్వస్వరూపిగను, ఈజగత్తునకు ముఖ్యసాధనముగను, సూక్ష్ముకంటె సూక్ష్మముగనుండెడు పరబ్రహ్మమేది కలదో అదియే నీవు నీవే అది!

పై విషయమే సామవేదమందు 'తత్త్వమసి' యని చెప్పబడినది.

మూ. జాగ్రత్స్వప్నసుషు ప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మాஉహ మితి జ్ఞాత్వా సర్వబన్ధైః ప్రముచ్యతే॥

తా. జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి మొదలగువానియందు ప్రపంచకము కనబడుచున్నదో అదిబ్రహ్మమే. అది నేనే యని తెలిసినయెడ

సకలబంధములనుండియు విముక్తినొందనగును. విముక్తినొందుటయే పూర్ణము. అదియే జన్మసాఫల్యము.

ఈవిషయమే అథర్వణవేదమునందు 'అయమాత్మా'యని చెప్పబడినది.

మూ. త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ య ద్భవేత్
తేభ్యో విలక్షణ స్సాక్షీ చిన్మాత్రో ఽహం సదాశివః ॥

తా. దేహత్రయమునందు అనుభవింపబడునది, అనుభవింపబడువాడు, అనుభవము, ననుత్రిపుటికంటె వేరైనవాడును, సాక్షియును, న్మాత్రస్వరూపుడును నగుసదాశివుడే నేను. అనగా: సర్వోపాధులయం దున్నప్పటికినీ ఉపాధిధర్మముల నంటక విదేహుడై, అశరీరుడై యుండును.

ఈవిషయము ఋగ్వేదమున 'ప్రజ్ఞానంబ్రహ్మ' యనిచెప్పబడినది.

మూ. మయ్యేవ సకలంజాతం మయి సర్వం ప్రతిష్ఠితం
మయి సర్వం లయం యాతి త ద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్॥

తా. నానుండియే సర్వమును కలుగుచున్నది. నాయందే సర్వమునున్నది. నాయందే సర్వమును లయమగుచున్నది.! అట్టి అద్వయమైన బ్రహ్మమే నేను.

ఈవిషయము యజుర్వేదమున 'అహంబ్రహ్మాస్మి'యని చెప్పబడినది.

మహాత్తర భావపూరితము లగుపై నాలుగు వేదవాక్యములలోని రహస్యాంశములను గురుముఖతః తెలియవలెను. లేనిచో విపరీతార్థములు వచ్చును. అట్లు విపరీతార్థ గ్రహణముచే నుభయభ్రష్టు లగు కావున ముఖ్యముగశాస్త్రమునందు, దేవునియందు, గురువు న భక్తిశ్రద్ధలనుంచి తెలిసికొనినచో కృతార్థు లగుదురు.

మూ. అథహైనమత్రిః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యమ్, య ఏషోఽ
నంతోఽవ్యక్త ఆత్మా తం కథ మహం విజానీయా మితి.

తా. అత్రిమహాముని యాజ్ఞవల్క్యమహర్షి నాశ్రయించి అనంతమై అవ్యక్తమైయుండు ఆత్మను నే నెట్లు తెలిసికొందు నని యడిగెను.

మూ. స హోవాచ యాజ్ఞవల్క్య సోఽ విముక్త ఉపాస్యోయ
ఏషోఽనన్తోఽవ్యక్త ఆత్మా నో విముక్తే ప్రతిష్ఠిత
ఇతి సో విముక్తః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి.

తా. అట్లడిగిన యత్రిమునికి యాజ్ఞవల్క్య డిట్లుచెప్పెను. నీవడిగిన స్వరూపము గల ఆత్మ అవిముక్తమునందు నెలకొనియున్నది. కావున దానియాత్మను ప్రతిష్ఠించి ఉపాసింపతగినది. అనగా: అత్రిముని అది యెచ్చట ప్రతిష్ఠింపబడియున్నదని యడిగెను. అవిముక్త మనగా: వారణాసి. ఇంద్రియవ్యాపారమే వారణము. అయ్యింద్రియవ్యాపారనాశనమే వారణాసి యనబడుచున్నది; కావున ఇంద్రియవ్యాపార మెక్కడ నశించునో అదియే అవిముక్తము.

అనగా: ముక్తి పొందబడియేయున్నది; గాని క్రొత్తగా పొందబడదు; కావున ఆస్థానమును వివేకదృష్టిచే తెలియవలెను.

మూ. జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ —

తా. జీవేశ్వరులిద్దరు నజులే (పుట్టుకలేనివారలే)అనాదులే. పరమాత్మ జ్ఞానపూర్ణుడు. జీవు డజ్ఞాని. కారణమేమన: ఈశ్వరుడగు పరమాత్మ ప్రకృతిని వశపఱచుకొని దాని నేలువాడు, జీవు డనీశుడు, ప్రకృతికి లోబడినవాడు.

బయలనగా పూర్ణము. ఈ మాయకు లోబడినవాడును, ఈ మాయలో మునిగియున్నవాడును నై యితరసహాయము లేకయే స్వీయము

లగు శక్తి జ్ఞానములచే నెవడు మాయ యను వలలోనుండి బయటికి రాగలుగుచున్నాడో వాడే పూర్ణుడు.

మూ. అణో రణీయా న్మహతో మహీయా నాత్మాఽస్య
జంతో ర్నిహితో గుహాయామ్ త మక్రమః
పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః॥

తా. సూక్ష్మపరిమాణముగలిగి మిక్కిలి సూక్ష్మమైనట్టిదియు మహత్పరిమాణముకలిగి పృధివ్యాదికముకంటె మిక్కిలి గొప్పదైనట్టిదియునగు ఆత్మ బ్రహ్మాది స్తంభపర్యంతమైన ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహయందుండెను. అట్టిఆత్మను దృష్టాదృష్ట బాహ్యవిషయోపగత బుద్ధిగలవాడు చూచుచున్నాడు. మనస్సు మున్నగు ఇంద్రియ సముదాయముయొక్క ప్రసన్నత్వమువలన ఆత్మయొక్క మహాత్వమును చూచుచున్నాడు. శోకరహితు డగుచున్నాడు. ఒక వస్తువే అణువును మహత్తును అగుట యసంభవము; కావున అణుత్వ మహత్వములు పరమార్థముగ ఆత్మకులేవు. ఏవికారములుగాని ఏఅభ్యాసములుగాని పూర్ణాత్మకు లేవని యెఱుంగవలెను.

మూ. సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితం,
సర్వస్యప్రభు మీశానం సర్వస్యశరణం సుహృత్.

తా. సర్వోపాధు లాభాసయేకాని నిజముకాదు. ఏఇంద్రియములు లెనివాడు, (ఇంద్రియములను విడిచినవాడు) అన్నింటికీ అతీతమైన ఈశానస్వరూపుని (జగత్స్వరూపుని) అంతటను నిండియున్నవానినిగా నెఱింగి శరణుపొందినయెడల మంచిప్రవృత్తికలవాడై పూర్ణాత్మను తెలియ సమర్థుడగుచున్నాడు.

మూ. మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరం,
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్.

తా. అహంకారరూపమున పరిణమించు జీవుని వశపఱచుకొని స్వస్వరూపము మఱచునట్లు చేయును. అవయవములతోను, అనేకభూతములతోను నగుచు మాయ కప్పినది. పరిదృశ్యమానమగు జగత్తంతయు ఆత్మస్వరూపముమీద మాయచే కప్పబడినది; కాని పూర్ణాత్మ కింద్రియాదులతో గూడిన జగత్తు లేదని తెలిసికొనవలెను.

మూ. తస్మా న్మనో విలీనే మనసిగతే సంకల్పవికల్పే దగ్ధే
పుణ్యాపాపే సదాశివ శక్త్యాత్మ స్సర్వత్రావస్థితః
స్వయంజ్యోతిః శుద్ధో బుద్ధో నిత్యో నిరంజనః
శాంతతమః ప్రకాశయతీతి వేదానువచనం
భవతీ త్యుపనిషత్ ॥

తా. మనస్సు, పుణ్యాపాపములు మున్నగునవి స్వాజ్ఞానవికల్పితములు. కావున స్వకీయమగు జ్ఞానముచే మనస్సు నిర్మలభావమును పొందెనేని, మనోకార్యములగు సంకల్పవికల్పములును, తత్కార్యములగు పుణ్యాపాపములును సమ్యగ్జ్ఞానాగ్నిచే దహింపబడుచున్నవి. ఇట్లు సమ్యగ్జ్ఞానాగ్నిచే సంకల్పవికల్ప, పుణ్యాపాపములు దగ్ధములు కాబడిన వయ్యేనేని సకలాపవాదములకు అధికరణ భూతుడు బ్రహ్మము నగుసదాశివుడు తత్త త్పదార్థగత సర్వశక్త్యాత్మకుడై అంతట యున్నవాడని చెప్పబడెను.

మూ. ఔషధవ దశన మాచరేత్ ॥

తా. అన్నము నౌషధముగా భావించి గ్రహింపవలెను. రోగనివారణార్థ పరిమిత మగు నౌషధము నెట్లుగ్రహింతురో అటులే పరిమిత మగు అన్నమును ప్రాణధారణార్థము భుజింపవలెను.

మూ. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః
దివీవ చక్షు రాతతం తద్విప్రాసో విపస్యవో
జాగృవాన్ స స్సమింధతే విష్ణోర్య త్పరమం పదమ్.

తా. సత్య జ్ఞానానంత లక్షణ లక్షితమును, వాఙ్మనసాతీతమును, వ్యాపనశీలమును నగుపరబ్రహ్మము యొక్క నిరుపమానమగు స్థానమే నని త్రికాలములయందును తత్స్వరూప సాక్షాత్కారము చేసికొనుచు నెవ్వరు స్వయంప్రకాశమగు తత్స్వరూపమునం దుండగలుగుచున్నారో ...రి కాధారాధేయభావము నివారింపబడినది.

కామక్రోధాది రహితులును, అజ్ఞాన నిద్రావిరహితులును నగు ...హ్మవేత్తలు స్వయంప్రకాశమును, దేశకాలవస్తు పరిచ్ఛేద్యశూన్య ...ను నగు పరిపూర్ణమును సకలవేదాంతములయందును శ్రేష్ఠమైన ...నినిగా చెప్పియున్నారు; కావున నట్టి పరిపూర్ణమునే తెలిసికొనుటకై నము ప్రయత్నింపవలెను.

...ా. ఖలు వేదార్థం యో విద్యాన్ సోపనయనాదూర్ధ్వం
స తాని ప్రాగ్వా త్యజేత్.

తా. ఎవడు నిశ్చయమగు జీవబ్రహ్మల కేకత్వలక్షణమగు వేద ...ంతము నెరుంగునో వా డుపనయన సంస్కారానంతరము (ఉపదేశ మైనతరువాత, ఉపనయనసంస్కారము కలవా డుపదేశమైనవాడు) ...క్రోధాది దుర్గుణములను వదలవలయును. జన్మాంతరకృత ...కృతమువలన బాల్యమునందే (ఉపదేశసంస్కారములేకముందే) జీవ బ్రహ్మైక్యరూప వేదార్థమును చక్కగా నెఱుగునెడల ఉపనయనోప ...యునకు ముందే దుర్గుణములను విడువవలెను.

నానాయోనిసహస్రాణి దృష్ట్వా చైవ తతో మయా
ఆహారా వివిధా భుక్తాః పీతాశ్చ వివిధా స్తనాః

వ

జన్మభూమిర్హి సర్వాభూ శ్శ్మశానమపి మే పరా
చతురశీతిచ లక్షేషు యోనిభేదేషు చాభవమ్
జాతశ్చాస్మి మృతశ్చాస్మి సంసార్యస్మి పునఃపునః
జన్మమృత్యూ పునర్జన్మ పునర్మృత్యుః పునర్జనిః॥

తా. నేను లెక్కకుమించిన స్త్రీలయోనులను చూచితిని, అనేక విధములైన ఆహారములను భుజించితిని. అనేకములైన స్తనములు పానముచేసితిని. భూమియంతయు నాశ్మశానమే యనునట్లు చరించితిని. ఎనుబదినాలుగులక్షల యోనిభేదములందును జన్మించితిని. ఎన్నియో మారులు జన్మించితిని. ఎన్నియోమారులు మృతినొందితిని. మరెన్నియోమారులు సంసారినైయుంటిని. పుట్టుట, చచ్చుట. మరలపుట్టుట మరలచచ్చుట. ఇట్లు నాకాలమంతయు గడచినది.

మూ. గర్భవాసే మహద్దుఃఖం మోహాద్దుఃఖంచ జన్మను,
బాల్యేదుఃఖం తథాశోకః పారవశ్యంచ మూఢతా.

తా. గర్భవాసమునందు ముక్కిలి దుఃఖము. ఇట్లు జన్మముల నెత్తుటయు, నందు భ్రమనొందుటయు, మరల మరల పుట్టుటయు దుఃఖము. బాల్యమునందు దుఃఖము. అట్లే శోకమును, సుఖానుభూతి పరవశత్వమును, మూఢత్వమును దుఃఖమునే కల్గించుచున్నవి.

మూ. అహో దుఃఖోదధౌ మగ్నో నపశ్యామి ప్రతిక్రియామ్,
ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధి క్కామక్రోధ సఙ్కటమ్.

తా. అక్కటా! దుఃఖసాగరమున మునిగియుంటిని. దీనికి ప్రతీకారమేదియు నెఱుగకయుంటిని. కావున అజ్ఞానమును, తెలివిలేకపోవు యను దుర్గుణమును, కామక్రోధాదులచే కలుగు సంకటములను పోనడఛలయును,

మూ. స నైవ జన్తుః స్త్రీయోనిశతం శిత్వా యోనిద్వార
ముపేత్య ముముక్షు ర్యతతే, తత్రాఽశక్తో
యన్త్రేణపీడ్యతే మహతా దుఃఖేన క్లిశ్యతి
పిష్యతే చ ప్రసూతివాతేన జాతమాత్రస్తు వైష్ణవేన
వాయునా సంస్పృశ్యతే తదా న స్మరతి నైవ
కిఞ్చి న పారత్రికం నా పరోక్షదృ గ్భవతి.

తా. ఆ నరజంతువు నూర్లకొలది స్త్రీల యోనిద్వారములను పొంది ది. ఇపుడు మరల యోనిద్వారమునుపొంది విమోచనము పొందుటకు ప్రయత్నించుచున్నది. కాని విమోచనము పొందుటకు శక్తి లేనిదై, తిరుగలి, గానుగ మున్నగువానికన్న నధికమైనతానావహించు గర్భదుఃఖమను యంత్రముచే పీడింపబడుచున్నది. దుఃఖాధిక్యముచే కళమును నందుచున్నది. ప్రసూతివాయువుచే నొందుకొనబడుచున్నది; పుట్టినవెంటనే వైష్ణవీవాయువుచే వ్యాపింపబడుచున్నది; కావుననే పరలోకసాధనాదులను స్మరించుటలేదు. ఇప్పు డపరోక్షజ్ఞానమే పొందుటలేదు.

మూ. అన్యథాత్వజ్ఞస్య సంసారిణ అహరహః క్రిమివ
త్తన్మూత్రపురీషయోః పానం యథానరకే
తద్వ ద్విహైవ శరీరే.

తా. అట్లుగాక మూఢత్వముచే సంసారమును పొందినవానికి ప్రతి దినము మలమూత్రములను పానముచేయునట్టి పురుషునకు నరకమందట్లో ఈశరీరమునందును అట్లేయున్నది; కాన జననమరణములలోనున్న దుఃఖము తెలిసికొని గర్భదుఃఖమును విడిచి జననమరణములులేని మార్గమరయవలెను.

మూ. అంతర్బహిశ్చ నారాయణః నారాయణ ఏవేదగ్‌ం సర్వం
యద్భూతం యచ్చభవ్యం నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో
నిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః ॥

తా. సకలప్రపంచము లోపల వెలుపల నిండియున్న పూర్ణాత్మయే నారాయణశబ్దముచే చెప్పబడెను. ఆనారాయణు డనుపూర్ణాత్మయే సర్వవేదములయందును, అన్ని భూతముల యందును, అన్ని కాలము యందును జగత్తునకు వేరుగ నున్నట్లు చూచుచున్నాము; కాని వేరుగ లేదు. ఏకవస్తువుగనే యున్నది. ఏకళంకములేని నిరంజనముగను, ఏకల్పనలు లేనిదిగను, ఏకులములులేక ఆటంకరహితముగను, అడ్డులేనిది గను, శుద్ధముగను, 'ఏకోదేవ' యనున ట్లంతటను నిండియుండెను ఆపూర్ణాత్మయే నారాయణ శబ్దముచే బిలువబడె నని తెలిసికొనవలెను.

మూ. ప్రత్యగానన్దం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపమ్
అకార ఉకార మకార ఇతి త్ర్యక్షరం ప్రణవమ్
త దేత దోమ్ ॥
య ముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబన్ధనాత్.

తా. ప్రత్యగానందముగను, ఏకస్వరూపముగను, సర్వవ్యాప్తమైన ఆత్మముగను నుండుబ్రహ్మపురుషుని ప్రణవస్వరూప మని చెప్పియున్నారు. అకార ఉకార మకారము లనెడి మూ డక్షరములును ప్రణవస్వరూప మనబడుచున్న ఓంకార మని తెలియవలెను. ఆప్రణవమున కధిపతి యైనవానిని సర్వవ్యాపకునిగా ఏయోగి తెలిసికొనుచున్నాడో ఆయోగి సంసారబంధమునుండి విడువబడి ముక్తు డగుచున్నాడు.

మూ. సర్వాన్కామా న్పరిత్యజ్య అద్వైతే పరమస్థితిః
జ్ఞానదండో ధృతో యేన ఏకదండీ స ఉచ్యతే.

తా. ఇహాపరసంబంధము లైనవిషయోపభోగములను విడిచి, సకల భేదజాతశూన్య మగు ఆనందాత్మయం దున్థాన, ఆలోచనాశూన్యమైన స్థితిగలవాడై యెవఁడు జ్ఞాన మనుదండము ధరించుచున్నాఁడో వాఁడు ఏకదండి (ఒకేలక్ష్యమందున్న వాఁడు) అని చెప్పబఁడుచున్నాఁడు.

మూ. సర్వేషా మిన్ద్రియాణాం గతి ముపరమ తే య ఆత్మ
న్యే వావస్థీయ తే య త్పూర్ణానందైకబోధ స్త ద్బ్రహ్మ
ఉహ మస్మీతి కృతకృత్యో భవతి కృతకృత్యో భవతి॥

తా. దుష్టాశ్వము లనందగు ఇంద్రియములు మనస్సను త్రాడు చేత ట్టినవై శరీర మనురథమును వహించుచు శబ్దాదివిషయముల నెడు లేత డ్డిని గాంచి తదాస్వాదనార్థము తమసారథి యగు బుద్ధియొక్క ఆజ్ఞకు లొంగక త్రోవను విడచి దుర్మార్గమును జొచ్చి, తమకును, రథమునకును, సారథికిని నాశనమును కలుగచేయుచుండుట సుప్రసిద్ధ మైయుండగా ద్వేషమోదములు లేకయుండుట సంభవ మగునా?

ఎవ్వ డాత్మయందే యుండునో వానికి సర్వేంద్రియములయొక్క గమన ముపరమించును; మరియును మనస్సహితము లగుసర్వేంద్రియములు సర్వదా తమసుఖప్రాప్తియు దుఃఖపరిహారమును చేసికొనుటకు ప్రయత్నించుచుండును. పరమహంస యగువానికి పొందవలసిన సుఖము గాని, పరిహరించు కొనవలసిన దుఃఖముగాని లేకపోవుటచేత ఆయింద్రియములయొక్క గమనము నిలచిపోయిన దని తెలిసికొనవలెను. ప్రజ్ఞానముతో గూడినశిక్ష నొందుటవలన ప్రేరకు డగుసారథియొక్క ఇచ్ఛ ...నిచో గుఱ్ఱము లెచ్చటికిని పోవక (కదలక) నిలచియుండునట్లే పరమ ...ంసయొక్క ఇంద్రియములు నిశ్చలము లై యుండును. అట్టి ఇంద్రియ శాంతి గలవాడు తత్త్వార్థలక్ష్యభూతు డగుఆత్మయందు నే ననెడిబుద్ధి ...శ్యాన్తే యుండును. (ఏది సకలోపనిషత్తులయందును పూర్ణానందైక

బోధము కలదో అట్టిబ్రహ్మమును తలంచుచుండును.) అట్టి పూర్ణ మగు బ్రహ్మను దేశ కాల వస్తు పరిచ్ఛేదశూన్యముగ నెఱుంగవలెను. ఇంద్రియ విషయములుకావు. స్వయంప్రకాశ మగుఆనందాత్మ పరిపూర్ణ జ్ఞానము స్ఫురించినపిదప సమస్తభేదములు నశించుటచేత చేయదగిన కృత్యము లతనికిలేవు. కనుక ఆయోగి కృతకృత్యు డనబడును.

కావున అట్టి సన్యాసియగు పూర్ణునికి చేయవలసిన కృత్యము లేమియు లే వని తెలిసికొనవలెను.

మూ. మనఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్.

తా. మానవులబంధమోక్షమునకు కారణము మనస్సేఅగుచున్నది. ఎదుటివారును ఇతరులెవరును గారు. తన మనస్సే తనకు శత్రువు. విషయాసక్తమగు మనస్సు బంధమునకును, విషయేచ్ఛలేని మనస్సు మోక్షమునకును గారణము లగుచున్నవి. శత్రుమిత్రులుగాని, ఆశ్రితులు గాని, బంధువులుగాని బంధమోక్షములకు గారణభూతులు గారు; కావున మానవుడు తనమనస్సును స్వాధీనముచేసికొని, తనలోనిశత్రువు లను జంపి తనను తా నుద్ధరించుకొని జననమరణరాహిత్య మగుమార్గ మును తెలియవలెను.

మూ. త దేవం నిష్కలం బ్రహ్మ నిర్వికల్పం నిరఞ్జనమ్,
త ద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా బ్రహ్మ సమ్పద్యతే ధ్రువమ్.

తా. ఆ పరబ్రహ్మము నిష్కళముగను, నిర్వికల్పముగను, నిరంజ నముగను, శాంతముగను, సర్వేంద్రియ వ్యాపార శూన్యముగను న్నది. ఆబ్రహ్మము సర్వత్ర నిండియున్న రీతిగనే దేహమునకు లోపలను

వెలుపలను నిండియున్నది; కాని 'నే' నన్నపదార్థము లేదని మోక్షకుడు తెలిసికొనునో యాతడు సత్యముగా బ్రహ్మమే యగుచున్నాడు.

మూ. నిర్వికల్ప మనన్తంచ హేతు దృష్టాంత వర్జితమ్
అప్రమేయ మనాదించ యద్జ్ఞాత్వా ముచ్యతే బుధః.

తా. ఏబ్రహ్మము నిర్వికల్ప మైనదో, అనంతమైనదో, కారణము లేనిదో, సమానములేనిదో, (స్వజాతీయ, విజాతీయ, స్వగతభేదము లేనిది.) ఊహింపనలవికానిదో, అనాదియైనదో దానిని పూర్ణుడైన వాడు తెలిసికొని బంధమునుండి విడిపోవుచున్నాడు.

అట్లగుటయే విదేహముక్తి, అశరీరము అనబడును.

మూ. గ్రన్థ మభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థ మశేషతః.

తా. బుద్ధిశాలియైనవాడు వేదశాస్త్రముల నభ్యసించి జ్ఞానవిజ్ఞానములు తెలిసికొనినరీతిగా అనుభవమునందు తత్పరుడై తీవ్రేచ్ఛగలవాడై యుండవలెను. ధాన్యమును గోరువాడు పొట్టును విసర్జించినట్లు వేదశాస్త్రమునంతయు విసర్జించి, వాసనాత్రయమును దాటి ముక్తిని పొందవలెను.

మూ. గవా మనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా,
క్షీరవ త్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా.

తా. ఆవు లనేకవిధములగు వర్ణములుగలవైనను పాలు ఒకేరంగు కలిగియుండునట్లు జ్ఞానమును తెలిసికొనవలెను. జీవులు జగత్తునందు అనేకములగు ఆవులవలె నుండినను జ్ఞానామృత మొక్కటే యని యెఱుంగవలెను.

మూ. ఘృత మివ పయసినిగూఢం
భూతే భూతేచ వసతి విజ్ఞానం
సతతం మనసి మథయితవ్యం
మనోమన్థానుభూతేన.

తా. పాలయందు నెయ్యి మరిగియుండునట్లు ప్రతిభూతమునందును విజ్ఞానము మరిగియున్నది; కావున మనస్సును మథించి నిష్కళముగను, నిశ్చలముగను, శాంతముగను నుండు నా బ్రహ్మ పూర్ణాత్మయని తలంచి ఆ పూర్ణాత్మను (బ్రహ్మమును) వెలువరింపవలెను. బయటికితీయవలెను.
అదియే బయలని చెప్పబడుచున్నది.

మూ. శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్యచ పునఃపునః
పరమంబ్రహ్మ విజ్ఞాయ ఉల్కావ త్తా న్యథోత్సృజేత్.

తా. మంచిమేధస్సుగలవాడు శాస్త్రముల నధ్యయనముచేసి, అధ్యయనము చేసినదానిని మరల మరల శ్రవణ మననాదులచే నభ్యసించి, పరబ్రహ్మము నెఱింగి తరువాత దీపమువలె (దీపసహాయముచే చీకటిలో నుండువస్తువును పొంది పిదప దీపమును పారవేయునట్లు) సాధనాభ్యాసము లగు నానాశాస్త్రములను విడిచిపెట్టవలెను.

మూ. తావద్రథేన గన్తవ్యం యావద్రథపథిస్థితః
తతో రథపతిః స్థానం రథముత్సృజ్య గచ్ఛతి.

తా. రథమార్గమున్నంతవఱకు కారథమునందే బోవలయును. రథమార్గము ముగియగనే రథమును విడిచిపోవలయును. అనగా: ఉపాధిరహితమైన కేవల వివేకమార్గముననే వెళ్లవలయును.

మూ. అన్ధవ త్పశ్య రూపాణి బధిరవ చ్ఛృణు శాబ్దికం,
కాష్ఠవ త్పశ్యవై దేహం ప్రశాన్త స్యేతి లక్షణమ్.

తా. అంధునివలె రూపములను చూడవలెను. బధిరునివలె శబ్దము లను వినవలెను. కాష్ఠమువలె శరీరమును భావింపవలెను. ఇదియే ప్రశాంతుని లక్షణము.

అనగా: జ్ఞాని పూర్ణాత్ముడు. చూచినను చూడడు. వినినను వినడు. శరీరముం దున్నను అశరీరియే; కావున నట్టివా డింద్రియవృత్తులతో నున్నప్పటికినీ లేనివాడే యగును. వృత్తి శాంతించినవా డగును.

మూ. దేవాహవై స్వర్గంలోక మగమ స్తేదేవా రుద్ర
మపృచ్ఛ న్కోఽభ వా నితి సోఽబ్రవీ దహమేకః
ప్రథమ మాసం వర్తామి భవిష్యామి చ నాఽన్యః
కశ్చి న్మత్తో వ్యతిరిక్త ఇతి.

తా. పూర్వ మొకప్పు డింద్రాగ్ని వాయ్వాది దేవతలు రుద్రుడు నివసించుస్వర్గమున కేగి నీలలోహితుడును, త్రిలోచనుడును, పినాకపాణియునై విచిత్రరూపముననున్న రుద్రునిగాంచి 'నీవెవ్వడ?' వనియడిగిరి. అందుల కారుద్రు డీవిధముగ సమాధానము చెప్పెను. స్వయంప్రకాశచిదానంద స్వరూపుడను, దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యుడను నగునే నొక్కరుడనే జగదుత్పత్తికంటె ముందు జగదాత్మకముగ నుంటిని. వెనుక నొకప్పు డెప్పుడోయుండి ఇప్పుడు లేకపోలేదు. ఇప్పుడు నున్నాడను. ఇకముందుగూడ నుండగలను. నావలె మరియొక డుండియుండలేదు. ఇప్పుడును లేదుసరిగదా ఇకమీాదటగూడ నుండబోడు. అనగా: త్రికాలములయందు నేనొక్కడనే యున్నాడను. రెండవవస్తువు లేదని జవాబు చెప్పెనని గ్రహించవలెను.

మూ. అథ కస్మా దుచ్యతే భగవాన్ య స్సర్వాన్
భావా న్నిరీక్ష త్యాత్మజ్ఞానం నిరీక్షయతి
యోగం గమయతి తస్మా దుచ్యతే భగవాన్.

తా. భగవంతుడని యేలచెప్పబడుచున్నాడందు రేని: ఎవడు సకల పదార్థమును స్వయముగ జూచుచున్నాడో, 'అహం బ్రహ్మాస్మి' యను బ్రహ్మసాక్షాత్కారమును అస్మదాదులకు కలుగచేయుచున్నాడో. జీవాత్మ పరమాత్మలకు గల తాదాత్మ్య సంబంధము మరల భేదబు పుట్టకుండ నెవడు నాశనమొనర్చుచున్నాడో వాడు భగవంతుడని చెప బడుచున్నాడు. (భగవంతుడు = జీవులను భరించువాడు. అనగా జీవుల సుఖదుఃఖములను, యోగక్షేమములను చూచి రక్షించువా- భగవంతుడుగాని జీవులను హింసించువాడు భగవంతుడు కాజాలడు.

భగవంతునివలన మన కే కష్టసుఖములును లేవు. చేసిన కర్మవలన అనుభవించుచున్నామని తెలిసివా రెన్నటికిని చెడిపోవరు. మిత్రాదుల మూలముననే సుఖదుఃఖములు వచ్చినవని తలచువారు తప్పక చెడి పోవుదురు; కాన పరులయం దెట్టియారోపణయును చేయరాదు.

మూ. అనన్యా శ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

తా. అన్యుల భజింపనివారై, ఇతరచింతలు లేనివారై యెవ్వా నన్నే ధ్యానించుచు భజించెదరో అట్టి నిత్యత్వమునం దాశగలవారికి నే వారి యోగక్షేమమును గలిగించుచున్నాను. అట్టివా రెప్పటికిని చెడ

మూ. భగవ న్కి మాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యం
కిం తద్ధ్యానం కోవా ధ్యాతః కశ్చ ధ్యేయః.

తా. ఓ భగవానుడా! ఆదికాలమునందు బ్రహ్మాదిదేవతలుప యోగించిన దేది? ధ్యాన మేది? ధ్యానింపతగిన దేది? ధ్యానమునకు సాధనమేది? ధ్యానింపతగిన వస్తువులలో శ్రేష్ఠమైన దేది? ఎయ్యది మంత్రముచే తెలిసికొనతగినది? — యని పైప్పలాదు లథర్వుని చూచి యడిగిరి.

మూ. ప్రతీయా ద్దిశందిశం భిత్వా సర్వాన్ లోకాన్ వ్యాప్నోతి
వ్యాపయతీతి వ్యాపనా ద్వ్యాపీ మహాః దేవః॥

తా. సకలదిశలయందు లోపల అంతర్యామియై ప్రవేశించి, సకల లోకములయందును వ్యాపించుటవలన వ్యాపియనియు, మహదేవుడనియు, పరమాత్మ స్వరూపుడనియు ప్రణవశబ్దవాచ్యుడైన భగవంతుడు చెప్పబడుచున్నాడు.

మూ. శివ ఏకోధ్యేయశ్శివంకరః సర్వ మన్య
త్పరిత్యజ్య సమాప్తా ఉథర్వశిఖా॥

తా. శివంకరుడై మోక్షమునొసంగువాడైన శివుడే సర్వమును పరిత్యజించి ఇతరోపాసనలను విసర్జించి ధ్యానింపతగినవాడు.

శివరాత్రి యనగా: అన్నియును రహితమై శేషించిన పరశివుని స్వరూపము. అట్టి స్థితిలో వృత్తులు లేకపోవుటచేతనే రాత్రియని చెప్పబడుచున్నది.

మూ. భ్రామ్యమాణం మహోరగదష్టఇవ విషదష్టం
మహాంధకారఇవ రాగాంధ మింద్రజాలమివ మాయామయం
స్వప్నఇవ మిథ్యాదర్శనం కదళీగర్భఇ వాసారం నటఇవ
క్షణవేషం చిత్రభిత్తిరివ మిథ్యామనోరమ మిథోక్తమ్॥

శబ్దస్పర్శాదయో యేఽర్థా అనర్థా ఇవ తే స్థితాః
యేషాం సక్తస్తు భూతాత్మా నస్మరేచ్చ పరంపదమ్ ॥

తా. సర్వజగత్తును స్వప్నమువలె మాయామయము. లేకయే ఉన్నట్లు భ్రమింపజేయుచున్నది. అరటిచెట్టు నెంతగ చీరి చూచినప్పటికినీ పరిదృశ్యమానమగు నీ సర్వమును నిస్సారము. ఇంద్రజాలమువలె నిజముకాదు. ధాన్యపుపొల్లు చూచుట కాకారబాహుళ్యముతో నున్నను నిస్సార మగునట్లే చక్షుర్గోచర మగుప్రపంచమంతయును సారహీనమై క్షణములో నశించిపోవుచున్నది. రెప్పపాటుకాలమున ననేక వేషములతో గూడిన వృత్తులతో బుట్టి పోవుచు చిత్రవిచిత్రములతో నిండినట్టిదియు, మిథ్యాభూతము నైనమనస్సే గాజుపెంకువలె రమించును. చూడబడున దంతయును మిథ్య. ఏతన్మాత్రలతో సంగము, సంబంధము అనర్థమును నని తెలియవలెను.

కావున నింద్రియవిషయములతో సంగమువిడిచి స్వరూపనిష్ఠలో నుండవలెను. సూర్యునకు కిరణరూపమున సమస్తవస్తుసంబంధ మున్నను వాని నంటకయేయుండునట్లు సాధకుడు వ్యవహారములో నున్నప్పటికిని దానినంటకయే యుండవలెను. ఎన్నింటితో కలసియున్నను సక్తుడుకాడు. అన్నిభూతములలోను తన యాత్మ నెవడుచూచునో వాడు భ్రమామానములతో గూడిన కామక్రోధము లను పాములకు పైనున్నవాడును. ఇంద్రజాలమున కందనివాడును, మహాంధకారమునకు విలక్షణుడును రాగాదీంద్రియజాలమునకు సాక్షిమాత్రుడును నగు పరమాత్మను దెలిసికొని పరమపదమును పొందగలుగుచున్నాడు.

మూ. యోవై ప్రాణః సాప్రజ్ఞా యావై ప్రజ్ఞా సప్రాణః॥

తా. ఈప్రాణము సూత్రసంజ్ఞికముగా సర్వాత్మకముగా సర్వమును నిండియున్న దని తెలియవలెను.

మూ. యోవైప్రాణః సాప్రజ్ఞా యావాప్రజ్ఞా సప్రాణః॥

తా. ఈ ప్రాణము సూత్రసంజ్ఞికముగా సర్వాత్మకముగా సర్వత్ర నిండియున్న దని తెలియవలెను.

మూ. యో వై ప్రాణః సా ప్రజ్ఞా
యా వా ప్రజ్ఞా స ప్రాణః॥

తా. ఇంద్రియములు, మనస్సు ప్రకృతిసంబంధములు. ఆదియం దహంకారతత్వమునుండి సాత్వికాంశముతో మనస్సును, రాజసాంశముతో నింద్రియములును సృజింపబడెను. ఈ సృష్టి ప్రాకృతములో చేరినది. ప్రాకృతమం దుండెడు నియ్యింద్రియమనంబులను జీవాత్మ లోకములో తనకార్యముకొఱకై కల్పించినది; కాని నిజముకాదు.

మూ. ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామా
న్యాప్నోతి, ప్రజ్ఞయా ప్రాణమారుహ్య ప్రాణేన సర్వాన్
గన్ధా నాప్నోతి, ప్రజ్ఞయా చక్షుస్సమారుహ్య చక్షుషా
సర్వాణి రూపాణ్యాప్నోతి, ప్రజ్ఞయా శ్రోత్రం సమా
రుహ్య శ్రోత్రేణ సర్వాణిశబ్దా న్యాప్నోతి, ప్రజ్ఞయైవ
ధియం సమారుహ్య ప్రజ్ఞయైవ ధియో విజ్ఞాతవ్యం
కామానాప్నోతి-ఇత్యాది

తా. ఆత్మ ప్రాణములేక ప్రజ్ఞారూపమున వాగాది ప్రతియింద్రియము నందును, మనస్సునందును ప్రవేశించి ఆ యా ఇంద్రియసముదాయము ద్వారా ఆ యావిషయజ్ఞానమును బొందును. ఇందువలన ఇంద్రియ సముదాయముతో జీవు డాయాలోకములలో నాయారూపమున నుం ప్రకృతిని తెలిసికొని దానికన్న విలక్షణు డాత్మ యనుజ్ఞానమును సం దించుకొనుటకై నిర్మించుకొన్న వేయనియు జీవునిసంకల్పము నన

రించినదే శరీరములో నుత్పత్తియైనవనియు, నవి జీవునిపనిముట్లు (సాధనములు) అనియు, జీవుడు ముక్తినిపొందువఱకు ఈసాధనము లవసరము లనియు వివేకజ్ఞానముకలిగి జీవుడు విదేహుడు, అశరీరుడు నైనతరువాత సాధనతోఁగూడిన కరణములు విడువవలె నని ముఖ్యముగా నెఱుంగవలెను.

మూ. సర్వేషాంభూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్య
మాధిపత్యం పర్యాతి, తథైవైవం విద్వాన్॥

తా. సర్వభూతములలోనువిలక్షణముగనున్న దేహత్రయమునకంటె శ్రేష్ఠమైనట్టి గొప్పపదవి యేదికలదో అదియే అఖండసామ్రాజ్యము. అట్టిపదవిపొందినవాడే విద్వాంసుడు గాని శాస్త్రము చదివినంతమాత్రమున విద్వాంసుడు కాజాలడు.

మూ. అగ్నిర్యథైకో భువనంప్రవిష్టో రూపంరూపం
ప్రతిరూపో బభూవ ఏకంబ్రహ్మ సర్వభూతాంతరాత్మ
రూపంరూపం ప్రతిరూపోబహిశ్చ॥

తా. ప్రకాశస్వరూపుడగు అగ్నియొక్కఁడే లోకమునందుగల దార్వాదికమును ప్రవేశించి, ఆయా దాహపదార్థమునకు తగిన రూపము గలవాడై యెట్లగుచున్నాడో (ఏకాష్టమును కాల్చునో యా కాష్టము యొక్క వక్రత్వాదికము ననుసరించి, అగ్నికూడా వక్రత్వాదిగుణములు కలిగియున్నటులు ఎట్లుకనబడుచున్నాడో.) అట్లొక్కఁడే యైనయాత్మయే సర్వభూతములందును, సర్వదేహములందును అతిసూక్ష్మరూపమున అంతరాత్మభూతుడై ప్రవేశించి ఆయాదేహములకుతగిన రూపముకలవాడగుచున్నాడు. మరియు ఆకాశమువలె వికారరహితుడై లోపలవెలుపల ప్రకాశించుచున్నాడు.

మూ. సదానన్దం పరమానన్దం శాంతం శాశ్వతం సదాశివం
బ్రహ్మాదివన్దితం యోగిధ్యేయం పరంపదం తత్రగత్వానినివర్తన్తే.

తా. బ్రహ్మాదులకు శక్యముకానిదై, కాలత్రయమునందును వృత్తి రహితమై, శాంతస్వరూపమై, రాకపోకలులేక శాశ్వతమైన పరశివమయిన మహాపదవి నేపూర్ణయోగి పొందుచున్నాడో యాతడు పరబ్రహ్మమగును. అట్టివానికి ఎక్కడనున్నను, ఎక్కడికివెళ్ళినను, (మూడు లోకములలో) అడ్డులేదు. (నిరోధములేదు) స్వేచ్ఛగా తిరుగవచ్చును.

మూ. యస్మాత్త్వమహిమ్నా సర్వాన్‌లోకాం త్సర్వాన్దేవాం
త్సర్వానాత్మన స్సర్వాణిభూతాని స్వతేజసా జ్వలతి
జ్వాలయతి జ్వాల్యతే జ్వాలయతే.

తా. సర్వలోకములు, దేవతలందరును, ఆత్మలన్నియును, భూతములన్నియును స్వతేజోమహిమలచేతనే వెలుగుచున్నవి. (జ్వాలలువచ్చుచున్నవి) ఆ సత్యశక్తిచేతనే యింద్రియములు కదలుచున్నవి. అనగా: కదలునది, కదలబడునది, కదలుచున్నది యను త్రిపుటియంతయు నిజశక్తిచేతనే జరుగుచున్నది.

మూ. ఏషసర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషోఽన్తర్యామ్యేష
యోని స్సర్వస్య ప్రభవాప్యయౌహి భూతనామ్‌॥

తా. చైతన్యైకప్రధానుడై స్వరూపమునందున్న ఈప్రాజ్ఞుడే సర్వేశ్వరుడు. పూర్ణుడు. అఖండుడు. ఇతడే అధిదైవికముతోగూడిన సకలాధ్యాత్మిక ప్రపంచమునకున్ను, భేదపూర్ణమైన ప్రపంచమునకున్ను అధిపతి. ఇతడే అంతర్యామియై సకలభూతములయొక్క అంతఃకరణమునందు ప్రవేశించి సకలభూతములను నియమించువాడు; కావుననే అవస్థా

త్రయమునందు విలక్షణమై, ఆధ్యాత్మికాదిత్రయమునందు భేదవిశిష్ట మైనజగమును సృజించుచున్నాడు. కనుకనే సర్వయోని యనబడును. కావుననే సకలప్రాణులకు సృష్టిస్థితిలయములకు కారణ మగుచున్నాడు;

మూ. పుత్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ,
స సాధనేభ్యో వ్యుత్థాయ నిరాకారా, నిష్పరిగ్రహా,
అశిఖా, అయజ్ఞోపవీతా, అంధా, బధిరా, ముగ్ధాః,
క్లీబా, మూకా, ఉన్మత్తాఇవ పరివర్తమానా, శాంతా,
దాంతా, ఉపరతా, స్తితిక్షా, వసమాహితా, ఆత్మరతయ,
ఆత్మక్రీడా, ఆత్మమిధునా, ఆత్మానన్దాః ప్రణవమేవ
పరం బ్రహ్మాత్మప్రకాశం.

తా. ఈషణత్రయవిలక్షణమును, రాగరహితమును, గ్రహించుట కాటంకములేనిదియును, సర్వమును విడిచినదియునగు అఖండపరిపూర్ణ మును సాధకుడు శిఖగా ధరింపవలెను. యజ్ఞోపవీతమువలె (కరతలామ లకమువలె) తెలియవలెను. అట్లు తెలిసికొనిన బ్రహ్మవేత్త. అంధుని వలెను, చెవిటివానివలెను, లోకజ్ఞాన శూన్యునివలెను, మూగివలెను, ఉన్మత్తునివలెను నుండి ఇంద్రియవ్యాపారములో నున్నప్పటికిని అంటక మే యుండు నని తెలియవలెను.

శమదమాదులతో సర్వకాలమందును ఆత్మనేచూచినవాడు తితిక్షా సమాధులయందును, ఆత్మరతియందును ఆత్మయందే క్రీడావిలాసము కలవాడై జీవబ్రహ్మైక్యముగలిగి ఆత్మానందముతో ప్రణవబ్రహ్మాత్మ ప్రకాశకు డయియుండును.

మూ. సర్వాత్మక మాత్మన మన్విచ్ఛే ద్బ్రహ్మైవేదగ్
సర్వం సచ్చిదానన్దరూపగ్ సచ్చిదానన్దరూప మిదగ్ సర్వం॥

తా. సర్వభూతములలోనున్న యాత్మయు, తనలోనున్న యాత్మయు నొక్కటేయని దృఢనమ్మకముతోను, తీవ్రేచ్ఛతోను ఏసాధకుడు చూచునో; అట్టి పుణాత్మునకు సర్వము బ్రహ్మాకారమై పోవును. సర్వమును ఎల్లప్పుడు సదానందముతోను, నిత్యానందముతోను చూచును.

సర్వమును సచ్చిదానందరూపమే. సచ్చిదానందరూపమునం దీసర్వమును తోచుచున్నది. నామరూపములు గోచరముకావు. అంతా బ్రహ్మమయం. ఈజగమంతా బ్రహ్మమయంబగును.

మూ. ఏవం త్రిపుండ్రం విధి భస్మనాకరోతి యో విద్వాన్
బ్రహ్మచారీ, గృహీ, వానప్రస్థో, యతిర్వా స మహా
పాతకోపపాతకేభ్యః పూతో భవతి.

తా. ఎవరైతే త్రిగుణములతోగూడిన ఇంద్రియవృత్తిని భస్మము చేయుదురో వారలే విద్వాంసులని చెప్పబడుదురు.

బ్రహ్మచర్యాది చతురాశ్రమములయం దున్నవార లెవ్వరేనియు (ఆశ్రమముతో నిమిత్తములేక) వృత్తి భస్మముచేయగల్గుచున్నారో అట్టివారు ఘోరతరపాపము లాచరించినను, ఒకప్పుడు త్రికరణశుద్ధిగ పశ్చాత్తాపమనస్కులై వివేక విజ్ఞానముల నలవఱచుకొందురేని తప్పక వారికి ముక్తి (మోక్షము) కరతలామలకమని నమ్మవలెను.

మూ. జాత మృత మిదం దేహం మాతాపితృ మలాత్మకమ్,
సుఖదుఃఖాలయామేధ్యం స్పృష్ట్వా స్నానం విధీయతే.

తా. జననమరణములతోగూడిన యాదేహము మాతాపితృ మలాత్మకమనియును, అమేధ్యము, అయోగ్యము ననియును, ఎందుకు పనికిరానిదనియును, సుఖదుఃఖము లనుభవించు మురికికొంప యనియు

తెలిసికొని, దానియర్థమును వివేకముచే గ్రహించి దేహాభిమానమును విడచి ఆత్మస్నానమును పొందవలెను.

మూ. అంతఃపూర్ణో బహిఃపూర్ణో పూర్ణకుంభ ఇవార్ణవే
అంతశ్శూన్యో బహిశ్శూన్యో శూన్యకుంభ ఇవాంబరే.

తా. లోపల వెలుపల సర్వముపూర్ణము. ఈఘటమునకు లోపల వెలుపల జ్ఞానాగ్నిచే దగ్ధముచేయుటచే సర్వము శూన్యము. అంతయు విషయశూన్యమగుటచే సర్వము శూన్యమై పరిపూర్ణమే శేషించెను.

మూ. నానాత్వ భేదహీనోఽస్మి అఖండానన్ద విగ్రహః,
నాఽహమస్మి నచాన్యోఽస్మి దేహాది రహితోఽస్మ్యహమ్.
ఆశ్రయాశ్రయహీనోఽస్మి ఆధారరహితోఽస్మ్యహమ్,
బంధమోక్ష విహీనోఽస్మి శుద్ధంబ్రహ్మోఽస్మి సోఽస్మ్యహమ్

తా. నేననేకత్వభేదములేని యఖండపరిపూర్ణుడను. అహంకార మమకారములు లేనివాడను. దేహత్రయము లేనివాడను. దైవము వేరు నేనువేరు దైవమునాశ్రయింపవలె ననుభేదము లేనివాడను. (జీవాత్మలు రెండును ఒకేవస్తువైనప్పుడు ఎవరిని ఆశ్రయించుట; అన్న నిశ్చయ జ్ఞానము కలుగవలెను) అట్టిభేదబుద్ధులు లేనివాడను. ఆశ్రయించవలసినది లేనివాడను. సర్వోపాధులలో దేనితోను ఆధారము లేనివాడను. బంధ మోక్షములు లేనివాడను. సర్వకాల సర్వావస్థలయందును శుద్ధబ్రహ్మ మను, అఖండపరిపూర్ణుడను అని త్రికరణశుద్ధిగ నమ్మవలెను.

మూ. గన్ధర్వ నగరోపమే, కదలీగర్భవన్నిస్సారే
జలబుద్బుదవచ్చంచలే.

తా. ఈ జగత్తంతయు గంధర్వనగరమువలె సదృశ్యమును, కదళీ గర్భమందలి పదార్థమువలె నిస్సారమును, నీటిలోబుట్టిన బుగ్గలవలె చంచలమును నై స్థిరమును, శాశ్వతమును కాదని తెలియవలెను.

మూ. సర్వలోకా ఓతాశ్చ ప్రోతాశ్చేతి, సర్వలోక ఆత్మని
బ్రహ్మణి మణయ ఇవోతాశ్చ ప్రోతాశ్చేతి.

తా. సర్వలోకములు పడుగుపేకలవలెఆత్మశక్తి, ఆత్మలచేతనే కలిసియున్నది; కాన జగత్తు ఆత్మకన్న వేరుకాదని తెలియవలెను. ఒకనూలు పోగే అనేకవిధములుగా కనుపడును; గాని యథార్థముగా విమర్శచేసి చూచినయెడల నూలుపోగొక్కటే యగునట్లు త్రికాలములయందును పూర్ణాత్మయేగాని అన్యములేదని తెలియవలెను.

మూ. క్షురికాం సంప్రవక్ష్యామి ధారణం యోగసిద్ధయే
యాంప్రాప్య నపున్మనర్జ యోగయుక్తస్య జాయతే.

తా. జ్ఞానప్రతిబంధకమైన అజ్ఞాన మనుపాశమును ఛేదించుటకు యోగసిద్ధియందుత్తమమయిన ధారణ యనుశస్త్రమువంటి సాధనము నుపదేశించు మూలమున నీయుపనిషత్ క్షురిక చెప్పబడెను. (క్షురిక=కత్తి.) ఈక్షురికలోని రహస్యోపదేశము నెఱిగినవారలకు జననమరణ రూపమైన సంసారముకలుగదు.

ఈ రహస్య మాదియందు పరమేశ్వరునిచే బ్రహ్మకొఱ కుపదేశింపబడెను.

మూ. పాశం ఛిత్వా యథాహంసో నిర్విశంకం ఖ ముత్పతేత్
ఛిన్నపాశ స్తథాజీవః సంసారం తరతే తథా
యథా నిర్వాణకాలేతు దీపో దగ్ధ్వా లయంప్రజేత్

యథా సర్వాణి కర్మాణి యోగీ దగ్ధ్వా లయంవ్రజేత్
ప్రాణాయామసుతీక్ష్ణేన మాత్రాధారేణ యోగవిత్
వైరాగ్యోపలఘృష్టేన ఛిత్వాతంతుం నబధ్యతే॥

తా. మానససరోవరమునందు సంచరించుచున్న రాజహంసము దై వికముగా సంచారసమయమందు కమలనాళములు పాదములకు చుట్టు కొని పాశములవలె బంధములై తనగమనము నరికట్టిన యెడలముక్కుతో నాకమలనాళముల తెగగొట్టికిభయరహితమై ఆకాశమునుజూర్చి యెగి గురుచున్నదో యట్లే నిరంతరాభ్యాసయోగ మొనర్చుటయను తీక్ష్ణ మైన ఖడ్గముచే తెగనరుకబడిన సంసారబంధముగల జీవుడున్నూ సంసా సముద్రమును తరించుచున్నాడు.

ప్రజ్వలించుచున్న దీప మారిపోవునపుడు తన్నాశ్రయించియుండు వర్తి మున్నగువానిని కాల్చివైచి నిజస్థానములో శాంతి నెట్లు పొందు చున్నదో అదేవిధముగ నభ్యాసపరుడు, బ్రహ్మత్వస్వరూపుడు నగు యోగి తన్నావరించియుండు సర్వకర్మజాలమును కాల్చివైచి స్వాతిరి మైన లయమును పొందుచున్నాడు.

యోగరహస్యములన్నియు చక్కగానెఱింగిన యోగవేత్త ప్రాణా సాధనాభ్యాసముచే తీవ్రమైనట్టియు, తీవ్రతరవైరాగ్యమను గరుకురాయి యందు పదునుపెట్టబడిన అరజ్ఞాన మను ఖడ్గముచేత సంసారబంధము లను తంతువులను తెగనరికినవాడై సంసారతంతుచ్ఛేదనోత్తరకాలము నందే సన్మాత్రస్వరూపుడై శేషించును.

అనగా: సంసారబంధమునందు మరలపడడు. సద్యోముక్తి నంద గలుగుచున్నాడు.

మూ. అమృతత్వం సమాప్నోతి యదా కామా త్ప్రముచ్యతే
సర్వేషణ వినిర్ముక్తశ్ఛిత్వా తంతుం నబధ్యతే
ఛిత్వా తంతుం నబధ్యతఇతి ।

తా. తీవ్రవైరాగ్యము కలుగుటచేత ఎప్పుడు సర్వకామములను వదలుచున్నాడో; అప్పుడే సాధకు డమృతత్వమును పొందుచున్నాడు. సాధకుడెప్పు డీషణత్రయమును విడువగలుగుచున్నాడో అప్పుడతడు సంసారపాశములను ఛేదింపగలుగుచున్నాడు కావున నతనికి మరల సంసారబంధము కలుగదు.

మూ. చతుర్వింశతి సజ్ఞాతం వ్యక్త మవ్యక్తమేవచ.

తా. తత్వములు బీజములో వృక్షమువలె కనుపడునవివలె కొన్నిటి లోను, కనుపడనివివలె కొన్నిటిలోను కలసియుండెను.

మూ. బ్రహ్మాద్యం స్థావరాంతంచ పశ్యంతి జ్ఞానచక్షుషః॥

తా. బ్రహ్మ మొదలు గరికపోచవరకు గల స్థావరజంగమము లన్నియు కదలునవి, కదలనివిగాగల సర్వమును జ్ఞాననేత్రముతో చూచినయెడల పరబ్రహ్మమే యగుచున్నది.

మూ. బ్రహ్మాది పిపీలికాన్తం సర్వప్రాణి బుద్ధి సాక్ష్యధిష్ఠానాత్మాస్తి
భాసతేచ సకూటస్థః॥

తా. బ్రహ్మ మొదలు చీమవరకు గల సకలప్రాణులయొక్క బుద్ధియ దవశిష్టమై హెచ్చుతగ్గులు లేక, భేదాభేదములు లేక కనుపడువాడుగన సకలప్రాణులయొక్క బుద్ధిసాక్షికి స్థానమైన ఆత్మగను నుండి యెవ్వడు ప్రకాశించునో వాడే కూటస్థుడు.

మూ. సత్యం జ్ఞాన మనన్తం ఆనన్దం సర్వశరీరోపాధి వినిర్ముక్తం
కటకమకుటా ద్యుపాధిరహితం సువర్ణఘనవ ద్విజ్ఞానఘనం
చిన్మాత్రం స్వభావ మాత్మచైతన్యం బ్రహ్మాయ దవభాసతే
త దవిద్యోపాధికం త్వం పదార్థ స్స ప్రత్యగాత్మా.

తా. సత్యజ్ఞానానందమయ మైనదియు, సర్వశరీరోపాధులు లేనిది యును, కటకమకుటాది భూషణభేదములేని బంగారుకణిక వంటిది యును, జ్ఞానఘన మైనదియును, చిత్స్వభావ మైనదియును, (బహ్మాకార చిత్తము గలది) ఆత్మచైతన్య మైనదియును, బ్రహ్మ మైనదియును నై యేది ప్రకాశించుచున్నదో; అదియే అవిద్యోపాధికి లోబడినదియును, త్వంపదముచేత చెప్పబడినదియు నగు ప్రత్యగాత్మ యనబడుచున్నది.

మూ. సర్వోపాధి వినిర్ముక్తం నిర్విశేష చిన్మాత్రం స దద్వైత
మానన్దం అమాయం బ్రహ్మ.

తా. ఎయ్యది యేవిధమైన యుపాధులులేనిదియు, నిర్విశేషచిన్మాత్రక మైనదియు, సత్తైనదియు, రెండవది లేనిదియు, అఖండమైనదియు, ఆనందమైనదియు, మాయ లేనిదియు నగుచున్నదో; అదియే అఖండ పరబ్రహ్మము.

మూ. ఏకమేవాద్వితీయం సత్యం స్వజాతి విజాతి భేదరహితం
సత్యం దేశకాలవస్తునిమిత్తాదిషు వినశ్యత్సు య
న్నవినశ్యతి - ఇతి॥

తా. రెండవదిలేని అఖండమేసత్యము. స్వజాతివిజాతిభేదము లేనిదియు సత్యమే! దేశకాల వస్తు నిమిత్తాదులు రహితమైనను నెయ్యది వినాశము నొందకుండునో; అదియే అవినాశి యని తెలియవలెను.

మూ. జగత్కల్పితం బ్రహ్మణ్యాసత్యం, జగన్మిథ్యా మృ
ద్వికారేషు మృదివ, స్వర్ణవికారేషు స్వర్ణమివ, తన్తు
వికారేషు తన్తురివ అవ్యక్తాదిసృష్టి ప్రపఞ్చేషు
వ్యాప్యం పూర్ణ మవినాశి చైతన్య మనన్తమ్.

తా. లేని ప్రపంచమును బ్రహ్మమునం దారోపించుట మిథ్య. కుండ మూకుడు మొదలయినవన్నియు మన్నువలెను, కటక కేయూరాదులు బంగారమువలెను, సర్వవిధములైన వస్త్రములు నూలుపోగువలెను-అవ్యక్తము మొదలగు సృష్టి ప్రపంచమునం దంతటను వ్యాపించి పూర్ణమై, నాశరహితమై వెలయు నఖండపరిపూర్ణచైతన్యమే అనంతము.

మూ. బ్రహ్మజ్ఞానం స మూలానాత్మనివర్తకం
స బ్రహ్మణి విలీయతే.

తా. అనాత్మయైన దేహాదులను సమూలముగా నివృత్తిచేసికొని సత్తామాత్రమైన బ్రహ్మమును పొందుటయే బ్రహ్మజ్ఞానము.

మూ. ఏపా మజ్ఞానజంతూనాం సమస్తారిష్టశాంతయే,
యద్య ద్బోద్ధవ్య మఖిలం తదాశఙ్క్య బ్రవీమ్యహమ్॥

తా. ఈ యజ్ఞానజంతువులు సమమైన పీడానివృత్తికొఱకు యెయ్యెయ్యది తెలియదగినదో యది యంతయు ప్రశ్నోత్తరరూపమున జెప్పబడెను.

మూ. కిం బ్రహ్మేతి హోవాచ మహదహఙ్కార పృథివ్య ప్తేజో
వాయు రాకాశాత్మకత్వేన, బృహద్రూపే ణాణ్డకోశేన
కర్మజ్ఞానార్థరూపతయా భాసమాన మద్వయ మఖిలో
పాధి వినిర్ముక్తం త త్సకల శక్త్యుపబృంహిత మనాద్యన్తం
శుద్ధం శివం శాన్తం నిర్గుణ మిత్యాది వాచ్య మనిర్వాచ్యం
చైతన్యం బ్రహ్మ.

తా. బ్రహ్మ మన నెయ్యది? మహదహంకారమై పృథివి, జలము, , వాయువు, ఆకాశము నను నీ భూతములను అణగియున్న మహా

ద్రూపములై నట్లుల ప్రకాశింపచేయుచున్నదియు, రెండవది లేనిదియు, సర్వోపాధులు లేనిదియు, అసత్యపు ఇంద్రజాలవేషము లేనిదియు, సర్వశక్తులతో గూడినదియు, ఆద్యంతములు లేనిదియు, వాక్కుల కందనిదియును, శుద్ధము, శుభము, శాంతము, నిర్గుణము, అనునీ శబ్ద ములచే జెప్పబడునదియు నైయుండు చైతన్యమే బ్రహ్మము.

మూ. అణిమా ద్యష్టైశ్వర్యాశాసిద్ధసంకల్పో బన్ధః
కేవలమోక్షాపేక్షా సఙ్కల్పో బన్ధః
సఙ్కల్పమాత్రసమ్భవో బన్ధః॥

తా. యమనియమాదులు మొదలగు యోగాభ్యాససాధనముల చేయవలయు ననెడికోరిక బన్ధము. కేవల మోక్షాపేక్షాసంకల్పమున్నా బంధమే యగుచున్నది. ఇట్లు సంకల్పమాత్రముచేతనే బంధము కలుగు చున్నది. ఈబంధమునకు కారణము సంకల్పము. సంకల్పమునకు మనస్సు ప్రధానము. కాన తన మనస్సే తన బంధమునకు కారణమగు చున్నది ; కాని ఇతరులుకారు. ఇతరులపై నారోపణము చేయగూడదు

సంకల్పమే బంధము — సంకల్పరహితమే పూర్ణత్వము!

మూ. తప ఇతిచ, బ్రహ్మసత్యం జగన్మిథ్యే త్యపరోక్ష
జ్ఞానాగ్నినా బ్రహ్మాద్యైశ్వర్యాశాసిద్ధసఙ్కల్ప
బీజ సన్తాపనారూపం తపః॥

తా. తప స్సనగానేమి ! 'బ్రహ్మసత్యం, జగన్మిథ్య' యనెడి అపరోక్షజ్ఞానాగ్నిచేత బ్రహ్మాదుల యైశ్వర్యమునందలి దృఢాభిలాష (స్వర్గాదిభోగాభిలాష) యనెడి బీజమును చక్కగాకాల్చుటయే తపస్సు

మూ. సన్న్యాస ఇతిచ, సర్వధర్మాన్ పరిత్యజ్య నిర్మమో,
నిరహఙ్కారో భూత్వా బ్రహ్మైక్యం శరణ ముపగమ్య,

తత్త్వమసి సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నా నా స్తి కించ
నేత్యాది మహావాక్యార్థానుసన్ధా నానుభవజ్ఞానా
ద్బ్రహ్మైవాఽహ మస్మీతి నిశ్చిత్య నిర్వికల్ప
సమాధినా స్వతన్త్రో యతిశ్చరతి స సన్న్యాసీ, సముక్త,
స్సపూజ్య, స్సయోగీ, సపరమహంస, స్సోఽవధూత, స్స
బ్రాహ్మణ - ఇతిచ.

తా. సన్న్యాసి యన నెట్టివాడు? ఎవడు సకలధర్మములను, వర్ణాశ్రమాది ధర్మములను, సమస్తకర్మలను, సకలమును విడచి అహంకార మమకారములను విడచి బ్రహ్మమునే (పరమాత్మనే) శరణు పొందిన వాడై, తదేకధ్యానపరుడై "అది నీవై యున్నావు, ఈ సకలప్రపంచ మును బ్రహ్మమే, ఇచ్చట అనేకమని గాని నేను నీవను భేదము గాని లేదు' అను మొదలగు మహావాక్యార్థానుభవజ్ఞానముచే నేను బ్రహ్మమే యని నిస్సంశయముగా నమ్మినవాడై, నిర్వికల్పసమాధితో గూడిన వాడై, సర్వస్వతంత్రుడై, 'అభేదజ్ఞానము గలుగువరకు కోటీశ్వరుడైనను బుద్ధుడేకాని స్వతంత్రుడు కాజాలడు' అని తెలిసికొని సంచరించు చుండునో ఆ యతియే సన్న్యాసి. వాడే ముక్తుడు. వాడే పూజ్యుడు. వాడే యోగి, వాడే పరమహంస. వాడే అవధూత. వాడే బ్రహ్మజ్ఞాని

మూ. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

తా. సర్వధర్మములనువిడిచి నన్నొకనినే శరణుపొందినయెడల దేహాత్మభావనవిడచి నన్నే శరణుపొందినయెడల) నే నన్ని దుష్కృత ములనుండి అన్ని బంధములనుండి విడిపింతును. విచారింపకుము; - ఊరక విచారించిన లాభములేదు. నిట్టిమాట గట్టిగాపట్టుకోవలెను.

శ్రీశుకోవాచ:—

దేవాదిదేవ, సర్వజ్ఞ సచ్చిదానన్దలక్షణ,
ఉమారమణ, భూతేశ! ప్రసీద కరుణానిధే.
ఉపదిష్టం పరంబ్రహ్మ ప్రణవాన్తర్గతం పరం,
తత్త్వమస్యాదివాక్యానాం ప్రజ్ఞాదీనాం విశేషతః.

తా. ఓ దేవాదిదేవా, త్రికాలవేదీ, సచ్చిదానందస్వరూప, సర్వభూతములతోను శివశక్తితో గూడిన పరమేశ్వరా, సంస్మరణమాత్రప్రసన్నస్వరూప, కరుణాస్వరూపా, ఓంకారము నుపలక్ష్యముగా పెట్టి (సాధకు సౌకర్యార్థము కల్పించి) ప్రణవమున కంతర్గతమైనవాడా, ఓపరమాత్మా! ఆపరమపద మెట్టిదో? మహావాక్యచతుష్టయ మెట్టిదియో? తత్త్వమస్యాది వాక్యమెట్టిదియో? విపులముగా చెప్పుమని శ్రీశుకు డడిగెను

శ్రీసదాశివోవాచ:—

సాధుసాధు మహాప్రాజ్ఞ శుక, జ్ఞాననిధే మునే,
ప్రష్టవ్యం తు త్వయాపృష్టం రహస్యం వేదగర్భితమ్,
యస్యవిజ్ఞాన మాత్రేణ మోక్షస్సాక్షాన్న సంశయః.

తా. సాధువులలో నుత్తమసాధూ, గొప్పబుద్ధికలవాడా, జ్ఞాననిధీ మౌనస్వరూపా! (గురువువద్దకేగి తీవ్రేచ్ఛ, దృఢజ్ఞాన, శ్రద్ధాభక్తులతో నిండిన హృదయముగలవాడు, అజ్ఞానమును వదలినవాడు, మను వ్యాపారములేక వృత్తిశాంతించిన హృదయముగలవాడునునై యుడు. చున్నాడని యర్థము.) శుకమునీ! నీవు చేయవలసినది, నేనుచెప్పవలసినది వేదములో గర్భీకృతమైయున్నది. అతిరహస్యమైన దీనిని నీవెట్లు తెలి వలెననగా: నిత్యానిత్యవస్తు వివేకముచే సులువుగా రాజమార్గమున జని మోక్షసామ్రాజ్యము నందగలవు. సందియము లేదు.

మార్గమున జనినయెడల నే ప్రమాదమును గలుగదు. పురాణాభ్యాసము లను గాథలలోపడి తప్పుదారుల నేగితివేని ముండ్లపొదలో పడినవానికి మరియొకరు చేయూత యొసగినట్లు నిన్నొకరు రక్షింపవలసియుండును; కాన కంటకావృత మార్గతుల్యమగు బోధలులేని గాథలవిడచి గురు బోధచే నిత్యానిత్యములను దెలిసికొని, నిత్యమందు తీవ్రవైరాగ్యము కలిగి, నిత్యమైనదానియందు మనస్సు నుంచవలెను. ప్రారబ్ధానుభవ వశమున నైహికవిషయాది సంబంధములున్నను 'అహా' మనునదిలేకయే వర్తింపవలెను. 'అహా'ము లేనిచో 'ఇహా'ము లేదని పరమేశ్వరుడు చెప్పెను.

శ్లో. నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

తా. సర్వకాల సర్వావస్థలయందును నిత్యానంద స్వరూపుడును, శాశ్వతమైన సుఖస్వరూపుడును. కేవలము శేషించిన బ్రహ్మస్వరూపుడు ను దేహేంద్రియములలో జగత్తులో నున్నప్పటికినీ దేనికి నంటక ఘటాకాశముతో సమానుడును, తత్త్వమస్యాది మహావాక్య చతుష్ట యమునకు లక్ష్యమైనవాడును, ఒకచోనున్నవాడొకచోలేనివా డను భేదములేక జగత్తంతయు నిండిన యఖండపరిపూర్ణుడును, ఎట్టి మహాప్రళయములు వచ్చినను నశింపక సమస్తకాలములయందున్న వాడును, ఏ మలములు లేనివాడును, ఎన్నిగాలివర్షములు వచ్చినను చలించనివాడునూ వ్యష్టిసమిష్టులులేక సర్వభూతములయొక్క బుద్ధి ...యందు సాక్షిగా నున్నవాడును, ఏ భావనలకు నందనివాడును, త్రిగుణములు లేనివాడును నగు సద్గురునకు నేను నమస్కరించుచున్నాను.

ఇట్లు తననిజస్వరూపమును తెలిసికొని నిజగురువునుపొంది నిత్యసుఖమును సాధింపవలెను. ఇదయే జన్మసాఫల్యము.

మూ. ఓం ప్రజ్ఞానం బ్రహ్మ, ఓం అహం బ్రహ్మాస్మి,
ఓం తత్త్వమసి, ఓం అయమాత్మా బ్రహ్మ,
తత్త్వమసీ త్యభేదవాచక మిదం యే
జపంతి తే శివసాయుజ్య ముక్తిభాజో
భవన్తి.

తా. ఈమహావాక్యచతుష్టయముయొక్క అర్థమును, తత్త్వమస్యాది మహావాక్యముయొక్క అర్థమును ఎవరభేదముగా జపింతురో వారి కీ సర్వ జగత్తు తోచనేతోచదు. సాక్షాత్పరమపదమును పొందెదరు.

1. ప్రజ్ఞానంబ్రహ్మ.*
యేన క్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ
స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్.

తా. చక్షువుద్వారా వ్యాపించి అంతఃకరణవృత్తితోగూడిన యేచైతన్యముచే జూచుటకు యోగ్యమైన యీ రూపాదికమును పురుషుడు చూచుచున్నాడో; శబ్దములను వినుచున్నాడో; గంధము నాఘ్రాణించుచున్నాడో ; శబ్దసమూహము నుచ్చరించుచు వ్యవహరించుచున్నాడో, స్వాదు అస్వాదువుల (రసముల) నెఱుంగుచున్నాడో ఆచైతన్యమే ప్రజ్ఞాన మనిచెప్పబడుచున్నది.

మూ. చతుర్ముఖేన్ద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు,
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి.

* ఋగ్వేదము: ఐతరేయోపనిషత్తు, లక్షణ (విధి) వాక్యము.

తా. బ్రహ్మేంద్రాది దేవతలయందును, మనుష్యులయందును, గవాశ్వాది పశువులయందు నొక్కటిగనే యున్న చైతన్యముచే బ్రహ్మమగును; కావున దేహమందుగల ప్రజ్ఞానమున్న బ్రహ్మమే.

2. అహంబ్రహ్మాస్మి. *

పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణే,
బుద్ధిసాక్షితయా స్థిత్వా స్ఫుర న్నహ మితీర్యతే.

తా. పరిచ్ఛిన్నత్వములేని పరమాత్మ యిమ్మాయాకల్పితమగు జగమ్మున జ్ఞానసంపాదనమునకు యోగ్యమైన వేదాంతశ్రవణాద్యనుష్ఠానాంచితమగు మానవాది దేహములందు బుద్ధికి సాక్షిత్వముచే నిర్వికారముగా ప్రకాశించుచుండి (లక్షణావృత్తి చేత) అహం (నేను) అను పదముచే పరిపూర్ణుడగు పరమాత్మ చెప్పఁబడుచున్నాడు.

మూ. స్వతః పూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః,
అస్మీత్యైక్య పరామర్శ స్తేన బ్రహ్మ భవా మ్యహమ్.

తా. స్వాభావికముగా అపరిచ్ఛిన్నుడగు పూర్వోక్తపరమాత్మ ఈ మహావాక్యమందు బ్రహ్మ మను పదముచే లక్షణావృత్తి రూపమున చెప్పబడుచున్నాడు. ఇతి యను పదము ఏకత్వమును (జీవబ్రహ్మైక్యమును) తెలుఁపుచున్నదగును. అందుచే నేను బ్రహ్మమునే యగుచున్నాను.

3. తత్త్వమసి. ♦

ఏకమేవాద్వితీయం స న్నామరూపవివర్జితం,
సృష్టేః పురాధునాప్యస్య తాదృక్త్వం త దితీర్యతే.

---

* యజుర్వేదము. బృహదారణ్యకోపనిషత్తు అనుభవవాక్యము.

♦ సామవేదము, ఛాందోగ్యోపనిషత్తు ఉపదేశవాక్యము.

తా. సృష్టికిపూర్వము నామరూపములు లేనిదియును, రెండవది లేనిదియును, ఏకమును నగునే సద్వస్తువు ప్రతిపాదింపబడియున్నదో ఆవస్తువునకు సృష్టికిపూర్వమందును, ఇప్పుడును, సృష్ట్యుత్తరకాలమందును విచారదృష్టిచే నట్టిస్వభావమే తత్ (అది) అనెడిపదముచే లక్షణావృత్తి చేత చెప్పబడుచున్నది.

మూ. శ్రోతుర్దేహేన్ద్రియాతీతః వస్త్వత్ర త్వంపదేరితః,
ఏకతా గ్రాహ్యతేఽసీతి తదైక్యమనుభూయతామ్.

తా. ముముక్షువుయొక్క స్థూలాదిశరీరత్రయముకంటె విలక్షణమగు సద్వస్తు వీ మహావాక్యమునందు 'నీ' వనెడి శబ్దముచే చెప్పబడుచున్నది. ఐతి యనెడి పదముచేత నైక్యము గ్రహింపబడుచున్నది. ఆతత్త్వము పదార్థములయొక్క ఏకత్వము. అది ముముక్షువులచే ననుభవింపబడు గాక.

4. అయమాత్మాబ్రహ్మ. *
స్వప్రకాశాపరోక్షత్వ మయమిత్యుక్తితో మతమ్,
అహఙ్కారాదిదేహాన్తః ప్రత్యగాత్మేతి గీయతే.

తా. ఈ, యను విశేషణముచే ఆత్మకు స్వప్రకాశత్వముచేత అపరోక్షము గలిగియున్న దనునర్థము సమ్మతమగుచున్నది. అది అహంకారమే ఆదిగా గలిగినట్టిదియు స్థూలదేహామే అంతముగా గలిగినట్టిదియు నగు ప్రపంచమునకంటె అధిష్ఠాన సాక్షిత్వములచేత లోగా, వేరుగా నుండెడు ఆత్మయని, ప్రత్యగాత్మయని చెప్పబడుచున్నది.

మూ. దృశ్యమానస్య సర్వస్య జగత స్తత్త్వ మీరితమ్,
బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్.

* అధర్వణవేదము. మాండూక్యోపనిషత్తు సాక్షాత్కారవాక్యము.

తా. పరిదృశ్యమానమగు సకలజగత్తునకు అధిష్ఠానరూపము బ్రహ్మ శబ్దముచేత చెప్పబడుచున్నది. ఆబ్రహ్మము స్వయంప్రకాశమానుడగు ప్రత్యగాత్మయే స్వరూపముగాగలది యగును.

అనగా: ప్రత్యగాత్మయే బ్రహ్మమనబడును.

మూ. అనాత్మదృష్టే రవివేకనిద్రా
మహం మమ స్వప్నగతిం గతోఽహమ్
స్వరూపసూర్యే భ్యుదితే స్ఫుటోక్తే
ర్గురో ర్మహావాక్యపదైః ప్రబుద్ధః.

తా. దేహేంద్రియములే ఆత్మ యనునజ్ఞాననిద్రలో నుండుటచే ద్వైతము నేను, నేను వేరు యను దీర్ఘస్వప్నములో పడిపోయినవాడు; సూర్యోదయమైన తరువాత చీకటిపోయి నిత్యానిత్యములు స్ఫుటముగ కనుపడునట్లు సద్గురువుచెప్పిన మహావాక్యార్థము అనుపదవిచే దృఢబుద్ధిగలవా డగుచున్నాడు.

గురుబోధచే గాఢలన్నియు పటాపంచలగును.

మూ. కార్యోపాధి రయంజీవః కారణోపాధి రీశ్వరః,
కార్యకారణతాం త్యక్త్వా పూర్ణబోధో ఽవశిష్యతే.

తా. కార్య కారణములతోగూడిన జీవేశ్వరులు కల్పించిన కార్య కారణోపాధులు విడిచినయెడల పూర్ణత్వమే మిగులుచున్నది.

మూ. శ్రవణంతు గురోః పూర్వం మననం తదనన్తరమ్,
నిధి ధ్యాసన మిత్యేత త్పూర్ణబోధస్య కారణమ్.

తా. గురుబోధ వినినపిదప మననము. తదుపరి నిధిధ్యాసనములు. అటిమార్గము పూర్ణబోధకు కారణమగును. గురుబోధ వినునంతవరకు

శ్రవణము. ఇట్టివరుసయగు శ్రవణ, మనన, నిధి ధ్యాసనములు లేకపో యినచో పూర్ణబోధ కలుగదు. పూర్ణబోధ కావలెనన్న సద్గురువును చేరి శ్రవణ మనన, నిధి ధ్యాసనము లలవఱచుకొనవలెను.

మూ. అన్య విద్యాపరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్,
బ్రహ్మ విద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్యకరం స్థితమ్.

తా. అజ్ఞానముతోను, కోరికలతోనుగూడిన విద్యలన్నియు నశించు నవిగావున తొందరగా నయ్యజ్ఞానమును విడిచిపెట్టుము. బ్రహ్మజ్ఞానముతో గూడినవిద్య బ్రహ్మప్రాప్తికి సాధనముకాన తద్బ్రహ్మవిద్యను తెలిసి ఆచరణ లోను, అనుభవములోను ఉంచుము.

మూ. యో రహస్యోపనిషద మధీతే గుర్వనుగ్రహాత్,
సర్వపాపవినిర్ముక్త స్సాక్షాత్కైవల్య మశ్నుతే.

తా. ఈరహస్యోపనిషత్తు సద్గురువుయొక్క అనుగ్రహముచే తెలిసిన వాడై సాక్షాత్కైవల్యమునుపొంది ముక్తుడగును.

మూ. కోవా బ్రహ్మణోనామ కింజీవః కింతు వద దేహః,
కింజాతిః కింజ్ఞానం కింకర్మచ కింతుధార్మికః? ఇతి,

తా. బ్రాహ్మణునకు పేరేమి; అతడెవడు; అతడు జీవుడా; దేహమా; వర్ణమా; జ్ఞానమా; కర్మమా; ధర్మము ననుష్ఠించువాడా?

మూ. యః కశ్చి దాత్మాన మద్వితీయం, జాతిగుణక్రియాహీనం,
షడూర్మి షడ్భావేత్యాది సర్వదోషరహితం, సత్యజ్ఞా
నానందానంతస్వరూపం, స్వయం నిర్వికల్ప, మశేష
కల్పనాధార, మశేష భూతాన్తర్యామిత్వేన వర్తమాన,

మన్త ర్బహిశ్చాకాశవ దనుస్యూత, సుఖజ్ఞానన్ద స్వభావ, మప్రమేయ, మనుభవైక వేద్య, మపరోక్షతయా భాసమానం కరతలామలకవ త్సాక్షా దపరోక్షీకృత్య కృతార్థతయా కామరాగాది దోషరహిత, శ్శమదమాది గుణసంపన్నో, భావమాత్సర్యతృష్ణాశా మోహాది రహితో, దంభాహఙ్కారాదిభి రసంస్పృష్టచేతా వర్తతే ఏవ ముక్తలక్షణో యస్సఏవ బ్రాహ్మణ ఇతి: శృతి స్మృతి పురాణేతిహాసానా మభిప్రాయః అన్యథా బ్రాహ్మణత్వ సిద్ధి ర్నాస్త్యేవ.

తా. ఎవ్వడు, అద్వితీయుడును, జాతిగుణక్రియాదులు లేనివాడును, 'ముసలితనము, చావు, దుఃఖము, మోహము, దప్పి యనుషడూర్ములును - పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, మారుట, చిక్కుట, నశించుట యను షడ్భావములును' లేనివాడును, సత్య జ్ఞానానందానంతస్వరూపము గలవాడును, సంకల్పమునందు వేరువ్యాపారము లేనివాడును, సమస్తసంకల్పముల కాధారుడును, సకలభూతముల కంతర్యామియును, ఆకాశమువలె లోపలను వెలుపలను వ్యాపించియుండువాడును, అవిచ్ఛిన్నమైన ఆనందముగలవాడును, అప్రమేయుడును, అనుభవముచేతనే తెలియతగినవాడును, ప్రత్యక్షముగా ప్రకాశించువాడునునగు భగవంతుని అరచేతిలోని యుసిరికాయవలె చక్కగా ప్రత్యక్షము చేసికొని కృతార్థుడై యాశ మున్నగుదోషముల విడిచి, శాంతిమున్నగు గుణములను పొంది, మోహమాత్సర్యాది దోషములు లేనివాడై, అహంకార దంభాదులను మదమున జొరనీయక యుండునో; అట్టి లక్షణములు గలవాడే బ్రాహ్మణుడని శ్రుతిస్మృతి పురాణేతిహాసముల యభిప్రాయము. ... కాదేని బ్రాహ్మణత్వసిద్ధియే లేదు.

మూ. సర్వం బ్రహ్మేతి వై జ్ఞానా దింద్రియగ్రామసంయమః
యమోఽయమితి సంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః
సజాతీయప్రవాహశ్చ విజాతీయతిరస్కృతిః
ఇతివా తద్భవే న్మౌనం సర్వం సహజసంస్థితమ్
గిరా మౌనంతు బాలానా మయుక్తం బ్రహ్మవాదినామ్
ఆదా వన్తేచ మధ్యేచ జనో యస్మి న్న విద్యతే
యేనేదం సతతం వ్యాప్యం స దేశో విజనస్మృతః
నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః
వృత్తివిస్మరణం సమ్యక్సమాధి రభిధీయతే॥

తా. నియమమనగా: సర్వముబ్రహ్మమే యను దృఢజ్ఞానమువలనను, ఇంద్రియములవలనను విషయాభిముఖములుగ చేయక నిగ్రహము కలిగియుండుట. దీనిని సర్వకాల సర్వావస్థలయందును అభ్యాసముల నుంచవలెను.

సజాతీయమయిన అఖండ చిన్మాత్రవృత్తిని విజాతీయమగు ఘట పటాది వృత్తితిరస్కార పూర్వకమగు నియమముకలిగి సదానంద స్వరూపుడై యుండుట.

మౌనమనగా: "బ్రహ్మము వాగాదికముచేత చెప్పుటకు శక్యమైనదికాదు. ప్రపంచకముకూడ ఇట్టిదని నిరూపింప శక్యమైనదికాదు." అని తద్విషయముగూర్చి యేమియును చెప్పకపోవుటయే మౌనమనబడును; కాని నోటితో పలుకకుండుటమాత్రమే మౌనమనుట బాలుర విషయముగాని బ్రహ్మవేత్తలవిషయము కాదు.

దేశమనగా: ఆదియందు, అంతమందు, మధ్యయందును దేనియందును జనసముదాయము కనబడుటలేదో; ఏవస్తువుచేత ఆదిమధ్యాంతములయం దంతటను వ్యాపింపబడియున్నదో అట్టి ప్రదేశము (బ్రహ్మ) విజనవిశ్రాంతి పొందుటకు తగినప్రదేశము.

సమాధియనగా: అఖండాకారవృత్తి కలిగియుండుట. సవికల్ప సమాధి. అట్టి యఖండాకారవృత్తియను స్మరణమునుగూడ లేకయుండు నట్టి బ్రహ్మాత్మత్వస్థితి నిర్వికల్పసమాధి యనబడును.

మూ. అఖండైకరసంద్దృశ్య మఖండైకరసంజగత్
అఖండైకరసందేహ మఖండైకరసంమనః
అఖండైకరసామాతా అఖండైకరసఃపితా
అఖండైకరసోభ్రాతా అఖండైకరసఃపతిః
అఖండైకరసంపూర్ణ మఖండైకరసామృతం
అఖండైకరసంగోత్ర మఖండైకరసంగృహాన్
అఖండైకరసంరాజ్య మఖండైకరసాఃప్రజాః
అఖండైకరసోధ్యాన మఖండైకరసంపదమ్
అఖండైకరసంభోజ్య మఖండైకరసంహవిః
అఖండైకరసోహోమ అఖండైకరసోజయః ॥

తా. ఇంద్రియములకు గోచరించుచున్నదంతయు అఖండైకరస స్వరూపము. అట్లీసర్వప్రపంచము అఖండపరిపూర్ణమని తెలియవలెను. సర్వకాల సర్వావస్థలయందును, సమస్తమగు జగత్తున నెచ్చట యున్నను, సర్వేంద్రియ విషయికమగు నేకార్యముల యందున్నను, త్రికాలములయందును సర్వము అఖండపరిపూర్ణము నిండియుండెను. వ్యతిరిక్తముగా అణుస్వరూపముగూడ లేదని త్రికరణశుద్ధిగా నమ్మవలెను.

మూ. విజ్ఞానమాత్రరూపోఽహం సచ్చిదానందలక్షణః.

తా. బ్రహ్మముకంటె భిన్నమైనది, వేరైనదియు లేనేలేదు.

మూ. నామరూప విముక్తోఽహం మహదానన్దవిగ్రహః
బన్ధముక్తి విహీనోఽహం శాశ్వతానన్దవిగ్రహః
సర్వత్ర పూర్ణరూపోఽహం భూమానన్దమయో ఽస్మ్యహమ్
సర్వత్ర తృప్తిరూపోఽహం పరామృతరసోఽస్మ్యహమ్॥

తా. నేను నామరూపవిరహితుడ నగుచున్నాడను; నేను ఆనంద స్వరూపుడ నగుచున్నాడను; బంధమోక్షములు నాకులేవు; కావున నేను శాశ్వతానందరూపుడ నగుచున్నాడను; అంతటను పరిపూర్ణ స్వరూపము గలవాడను. అంతట భూమానందమయుడ నగుచున్నాను. అంతట తృప్తియే రూపముగా గలవాడను; పరామృత రసస్వరూపుడ నగుచున్నాడను.

మూ. సజాతీయం నమేకించి ద్విజాతీయం నమేక్వచిత్,
స్వాగతంచ నమేకించి న్నమే భేదత్రయం క్వచిత్.

తా. నాకు స్వజాతీయముగాని, విజాతీయముగాని, స్వగతభేదము గాని వాస్తవముగ నేదియులేదని భావము.

మూ. స్వాత్మమంత్రం సదాపశ్యేత్ స్వాత్మమంత్రం సదాఽభ్యసేత్
అహంబ్రహ్మాఽస్మి మన్త్రోఽయ మన్యమన్త్రం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మన్త్రోయం సర్వవ్యాధీ న్వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మంత్రోయం సర్వశోకం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మన్త్రోయం కామాదీ న్నాశయేత్క్షణాత్
అహంబ్రహ్మాఽస్మి మన్త్రోయం క్రోధవృత్తిం వినాశయేత్
అహంబ్రహ్మాఽస్మి మన్త్రోయం కోటిదోషం వినాశయేత్
సప్తకోటిమహామన్త్రం జన్మకోటిశతప్రదమ్

సర్వమన్త్రాన్ సముత్సృజ్య ఏతన్మన్త్రం సమభ్యసేత్
సద్యో మోక్ష మవాప్నోతి నాస్తి సన్దేహ మణ్వపి॥

తా. అంతయు నాత్మయేకాని తద్భిన్నముగ నేదియులేదని తలంపవలయును. ఇట్లు తలంచుచు సర్వకాలసర్వావస్థలయందును ఆత్మమంత్రము నభ్యసించుచుండవలయును. ఆత్మమంత్ర మనగా: 'అహంబ్రహ్మాస్మి' యనునది. ఇతరమంత్రములను, దేహదోషములను, సర్వవ్యాధులను, సర్వశోకములను, కామాద్యరిషడ్వర్గమును, క్రోధవృత్తిని, కోటిదోషములను, సప్తకోటి మహామంత్రములను జపించుటవలన అనేకకోటి శత జన్మములయందు పుట్టుటకంటె వేరుఫలముకలుగబోదు.

మంత్రాంతరముల నన్నిటిని వదలి 'అహంబ్రహ్మాస్మి' యను మంత్రాభ్యాసమువలన వెంటనే మోక్షము లభించును. ఈవిషయమై యణుమాత్రమైనను సంశయములేదు.

పైన చెప్పినవిషయములు దేహాత్మభావన అతిగాఢముగ నున్నవారల కొఱకని తెలియవలెను.

మూ. నమే పుణ్యం నమేపాపం నమేకార్యం నమేశుభమ్
నమేఽన్తికం నమేదూరం నమేబోధో నమేరహః
నమేగురు ర్నమేశిష్యో నమేహీనో నచాధికః
నమేభ్రాంతి ర్నమేస్థైర్యం నమేగుహ్యం నమేనయః ॥

తా. పుణ్యముగాని, పాపముగాని, కార్యముగాని, జీవుడుగాని, సమీపముగాని, దూరముగాని, రహస్యముగాని నాకులేదు. నాకు గురువుగాని, శిష్యుడుగాని, హీనుడుగాని, అధికుడుగాని లేదు. భ్రాంతిగాని, స్థైర్యముగాని, రహస్యముగాని, కులముగాని నాకులేదు.

మూ. బ్రహ్మభూతః ప్రశాన్తాత్మా బ్రహ్మానందమయ స్సుఖీ
స్వచ్ఛరూపో మహామౌనీ వైదేహీముక్త ఏవసః
కాలభేదం, వస్తుభేదం, దేశభేదం స్వభేదకమ్ ॥

తా. బ్రహ్మమాత్రుడుగా నుండుటచే బ్రహ్మభూతుడుగను, దేహత్రయాభిమానము శాంతించుటచే ప్రశాంతాత్ముడుగను, ఆనందస్వరూపుడగుటచే బ్రహ్మానందమయుడు (రెండవదిలేని భూమానందమాత్రుడు)గను, పూర్ణబోధస్వరూపు డగుటచే స్వచ్ఛరూపుడుగను, స్వమాత్రుడుగ తూష్ణీంభావమునువహించి యుండుటచే మహామౌనిగను ఉండువాడు విదేహముక్తు డనియెఱుంగవలయును. స్వాతిరిక్తమైన దేదియులేదని అభ్యాసమున తోచుచున్నదాని నెవ్వడు నిరసించుచున్నాడో; వాడు విదేహముక్తు డనువిషయమును స్మృతిప్రమాణములచేత తెలియపరుపబడినది.

ఆత్మకు దేశ, కాల, వస్తు. స్వగతాది భేదములులేవు. అతనికి కొంచెమైనను భేదములేదు.

మూ. తురీయాతీతరూపాత్మా శుభాశుభ వివర్జితః
జీవాత్మా పరమాత్మేతి చింతా సర్వస్వ వర్జితః
ముక్తాముక్త స్వరూపాత్మా ముక్తాముక్త వివర్జితః
బన్ధమోక్ష స్వరూపాత్మా బద్ధమోక్ష వివర్జితః
ద్వైతాద్వైత స్వరూపాత్మా ద్వైతాద్వైత వివర్జితః
సర్వాసర్వస్వరూపాత్మా సర్వాసర్వ వివర్జితః.
సర్వసఙ్కల్ప హీనాత్మా వైదేహీముక్త ఏవసః ॥

తా. తురీయాతీతరూపుడును, శుభాశుభములచే వర్జితుడును, జీవాత్ముడులేక పరమాత్ముడు ననుయాలోచనయే లేనివాడును, ముక్తుడు

లేక బద్ధుడనను చింతయే లేనివాడును, ముక్తాముక్త వర్జితుడును, వాస్తవముగ బంధమోక్షములు లేనివాడైనప్పటికినీ బంధమోక్షములు స్వరూపముగా గలవాడును, ద్వైతాద్వైత స్వరూపుడును, సర్వాసర్వ వర్జితుడును, (సాపేక్షములైనబంధమోక్ష ద్వైతాదికములు లేనివాడును, సర్వసంకల్ప విహీనుడును నైనట్టివాడు విదేహముక్తుడు.

పూర్ణరూప, నిర్మలాత్మ, శుద్ధాత్మ, మున్నగుపదములు నిర్విశేష బ్రహ్మమునుగూర్చి బోధించుచుండునని తెలియవలెను.

మూ. నిత్యానిత్యవిహీనాత్మా ఇహాముత్ర వివర్జితః
శమాదిషట్కశూన్యాత్మా ముముక్షుత్వాది వర్జితః
స్థూలదేహవిహీనాత్మా సూక్ష్మదేహ వివర్జితః
కారణాది విహీనాత్మా తురీయాది వివర్జితః
అన్నకోశవిహీనాత్మా ప్రాణకోశ వివర్జితః
మనఃకోశవిహీనాత్మా పంచకోశ వివర్జితః
నిర్వికల్పస్వరూపాత్మా సవికల్పవివర్జితః
దృశ్యానువిద్ధహీనాత్మా శబ్దవిద్ధవివర్జితః
సదాసమాధిశూన్యాత్మా ఆదిమధ్యాన్తవర్జితః
ప్రజ్ఞావాక్యవిహీనాత్మా అహంబ్రహ్మాస్మివర్జితః
తత్త్వమస్యాదిహీనాత్మా అయమాత్మేతిభావకః॥

తా. నిత్యానిత్య విభేదరహితుడును, ముముక్షుత్వము, తత్సాధమగు శమాదిషట్కసంపత్తి లేనివాడును, స్థూల, సూక్ష్మ, కారణ, తురీయాది దేహవిహీనుడును, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశవిరహితమైన స్థితిగలవాడును, దృశ్యానువిద్ధ, శబ్దవిద్ధ వివర్జితుడును, ఆదిమధ్యాంత విరహితుడును,

సమాధిశూన్యుఁడును, మహావాక్యచతుష్టయము లనబడు "1 ప్రజ్ఞానం బ్రహ్మ, 2 అహంబ్రహ్మాస్మి, 3 తత్వమసి, 4 అయమాత్మాబ్రహ్మ" యను వాక్య చతుష్టయార్థమునకు సంబంధించిన వాఁడును విదేహముక్తుఁడని తెలియవలెను.

మూ. చిత్తంప్రపఞ్చ మిత్యాహు ర్నాస్తినాస్త్యేవ సర్వదా
మాయాకార్యాదికం నాస్తి మాయానాస్తి భయంనహి.
కర్తానాస్తి క్రియానాస్తి శ్రవణం మననంనహి
జాతిర్నాస్తి గతిర్నాస్తి వర్ణోనాస్తి నలౌకికమ్.

తా. మనస్సే ప్రపఞ్చమని చెప్పబడుచున్నది. ఎల్లప్పుడు జగత్తు లేనేలేదు; మాయగాని తత్కార్యముగాని లేనేలేదు; మాయయే లేనపుడు దానితోఁబుట్టిన భయముగూడలేదు; కర్తగాని, క్రియగాని, శ్రవణ మననాదికముగాని లేనేలేదు; జాతిగాని, గతిగాని, వర్ణముగాని, లౌకికముగాని లేనేలేదు.

మూ. అనేకకోటిబ్రహ్మాణ్డం సర్వం మిథ్యేతి నిశ్చిను
యత్రయత్ర శుభంకర్మ యత్రయత్రచ దుష్కృతమ్
యద్యత్కరోషి సత్యేన సర్వం మిథ్యేతి నిశ్చిను.

తా. అనేకకోటి బ్రహ్మాండములుగల యిదియంతయు మిథ్యయని యెఱుంగుము. ఆయా ప్రమాణములచే నిర్ణయింపబడిన వివిధాచారోపదేశములు జగత్తునందున్నవి. వానినాధారముగా గొనుము.
ఏ విధముగా పలుకబడినదియు, ఏ విధముగనయిన నంగీకరింపబడినదియు, ఏవిధముగనయిన నివ్వబడినదియును, చేయబడిన శుభాశుభ కర్మలును, సత్యముగా చేయబడినదియును ననునదంతయు మిథ్యయే యని యెఱుంగుము.

పైనజెప్పిన రీతిని 'అంతయుపూర్ణమే, అంతయు బ్రహ్మమే' యని గురువు శిష్యునకు బోధించెను. అట్లీగురుబోధ సాంతముగ వినియు నంతయుపూర్ణమే, బ్రహ్మమేయని గ్రహించియు, నేను ఉన్నాను. అను నభిమానము శిష్యునకు వదలకపోవుటయు, తదభిమాన మనేకానర్థములకు కారణమగుటయు గురువెఱింగియే పూర్ణ, బ్రహ్మములగూర్చి విస్తరించి, అంతయును మిథ్యయే యని బోధించెను. పిమ్మట అనేక కోటి బ్రహ్మాండములు మిథ్యయేయైనచో నేనును మిథ్యయేనా? యని శంకించుచున్న శిష్యునకు గురువు చెప్పుచున్నాడు.

నీవు మిథ్యాధారుడవు నిరాధారుడవు నగుదువేగాని పరమాత్మస్వరూపుడవుమాత్రము కాజాలవని చెప్పుటలేదు. నిస్సంశయముగ పరమాత్మస్వరూపుడవే సందేహములేదు. పరిదృశ్యమానమగు నీజగత్తంతయు మిథ్యగాని, నీ వాపరమాత్మ స్వరూపుడవు. సందేహింపకుమని యభయ మిచ్చెను.

'నేను, నాది' యను నభిమానమువదలుట సామాన్యముకాదు. ఇదియే కోటికొకడు గ్రహించుగూఢవిషయము. ఎంతనేర్చినను, విన్నను, చదివినను, తుద కొక్కొకప్పుడు 'నేను' యనునభిమానము కలుగవచ్చును; కాన అట్టి అనర్థదాయకములగు అభిమానాదుల దరిజేరనీయక, గురుబోధల ననుసరించి సత్యమున్గ్రహించి అయ్యఖండ పరబ్రహ్మ మగుటయే జన్మసాఫల్యము. అట్టివాని కీజననమరణము లుండవు.

మూ. సర్వ ప్రపఞ్చ భ్రమ వర్జితోఽసి
సర్వేషు భూతేషుచ భాసితోఽసి
సర్వత్ర సంకల్ప వివర్జితోఽసి
సర్వాగమాన్తార్థ విభావితోఽసి
సర్వత్ర సంతోష సుఖాసనోఽసి
సర్వత్ర గత్యాది వివర్జితోఽసి

సర్వత్ర లక్ష్యాది వివర్జితోఽసి
ధ్యాతోఽసి విష్ణ్వాదిసురైరజస్రమ్.
భ్రమేణాహం, భ్రమేణత్వం, భ్రమేణోపాసకంమనః
భ్రమేణేశ్వరభావత్వం భ్రమమూల మిదంజగత్.

తా. ప్రాపంచిక సకలవిధ భ్రమావివర్జితుడవును, అంతర్యామివై సకలభూతములందు వసించువాడవును, సర్వసంకల్ప వివర్జితుడవును, సర్వోపనిషత్తులచే ప్రతిపాదింపబడినవాడవును, సర్వకాల సర్వావస్థల యందును నిరతిశయానంద సుఖస్వరూపమున నుండువాడవును, గతివి హీతుండవును, లక్ష్యరహితుండవును, విష్ణ్వాది దేవగణముచే నెల్లప్పు ధ్యానింపబడువాడవును నీవే యగుచున్నాడవు.

నీవు, నేను అను నానావిధవర్తనులగు జీవులును, మనస్సున్నూ, ఈశ్వరుడున్నూ గల సర్వజగత్తున్నూ సకలము మాయాభ్రాంతియేగాని యథార్థములుగావు. కావున మరువక సకలసందేహములుమాని భ్రాంతి రహితుడవై సదా స్వ స్వరూపమునందే రమించుచుండుము. నీనిజ స్వరూపమునందే రమించుచుండుటయును, అందే పరబ్రహ్మభావనతో నుండుటయును నీకు ముఖ్యకర్తవ్యములు.

మూ. ఇదం ప్రపఞ్చం యత్కించి ద్యద్య జ్జగతివిద్యతే
దృశ్యరూపంచ దృగ్రూపం సర్వం శశవిషాణవత్.

తా. ఈ జగత్తునందు దృశ్యరూపముగను, దృగ్రూపముగను, గల్గినదంతయు కుందేటికొమ్మువలె మిథ్యాభూతమే యని తాత్పర్యము.

మూ. దేహోఽహమితి సఙ్కల్పం మహత్సంసార ఉచ్యతే.
దేహోఽహమితి సఙ్కల్పం తద్బన్ధమితి చోచ్యతే.

దేహోఽహమితి సఙ్కల్పం తద్దుఃఖమితి చోచ్యతే
దేహోఽహమితి యద్జ్ఞానం తదేవనరకం స్మృతమ్
దేహోఽహమితి సఙ్కల్పం జగత్సర్వ మితీర్యతే.

తా. దేహమే నేననితలంచుటయే మహాసంసార మనబడును. దేహమే నేనని తలంచుట బంధమనియు, నరకమనియు, జగత్తనియు చెప్పబడుచున్నది.

మూ. కామంక్రోధం బంధనం సర్వదుఃఖం
విశ్వందోషం కాలనానాస్వభావమ్,
యత్కిఞ్చేదం సర్వసంకల్పజాలం
తత్కిఞ్చేదం మానసం సౌమ్యవిద్ధి.
నాస్తి నాస్తి జగత్సర్వం గురుశిష్యాదికం నహి.

తా. కామక్రోధములే సర్వబంధములకును కారణభూతములగు చున్నవి. వివిధస్వభావములు గలదోషములకును, దుఃఖములకును కామమే మూలకారణ మగుచున్నది. నానారూప మగుసంకల్పజాత మేదిగలదో అదియంతయు మానసమే. మనస్సే మనసంబంధ మని తెలిసి కొనుము. కావున సర్వానర్థములకు మనస్సే మూలమగుచున్నది. గత్తుగాని, గురుశిష్యాదికముగాని వాస్తవముగా లేనేలేదు.

మూ. ఇదంబ్రహ్మ పరంబ్రహ్మ సత్యంబ్రహ్మ ప్రభుర్హిసః
లోకోబ్రహ్మ గురుర్బ్రహ్మ శిష్యోబ్రహ్మ సదాశివః
పూర్వంబ్రహ్మ పరంబ్రహ్మ శుద్ధంబ్రహ్మ శుభాశుభమ్
జీవఏవ సదాబ్రహ్మ సచ్చిదానంద మస్మ్యహమ్
సర్వం బ్రహ్మమయంప్రోక్తం సర్వం బ్రహ్మమయంజగత్.

తా. ఈపరిదృశ్యమానమును, దీనికంటెపరమైనదియును బ్రహ్మము సత్యమే బ్రహ్మము. బ్రహ్మమే ప్రభువు, లోకము, గురువు, శిష్యుడు. సదాశివుడు, పూర్వము, పరము, శుద్ధము, శుభాశుభములు నగును. జీవుడెల్లప్పుడును బ్రహ్మమే. నేను సచ్చిదానంద స్వరూపుడ నగుచున్నాను. జగత్తంతయు బ్రహ్మమే.

మూ. బ్రహ్మమాత్ర మిదంసర్వం బ్రహ్మమాత్ర మసన్నహి
బ్రహ్మ మాత్రం శ్రుతంసర్వం స్వయం బ్రహ్మైవ కేవలమ్.

తా. ఆత్మకంటె వేరుగ తుషమైనను (తుషము = పొల్లు)లేదు జగత్తంతయు ఆత్మమయమే. ఇదియంతయు బ్రహ్మమేగాని అసత్తు మాత్రముకాదు. కావున 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' యని తెలిసికొ ఎందుజూచిన బ్రహ్మమే యనినమ్మవలెను.

మూ. వంధ్యాకుమారవచనే భీతిశ్చే దస్తికించన
శశశృంగేణ నాగేంద్రో మృతశ్చే జ్జగదస్తితత్
నరశృంగేణ నష్టశ్చే త్కశ్చి దస్త్విద మేవహి
గంధర్వే నగరేసత్యే జగద్భవతి సర్వదా
గగనే నీలిమాసత్యే జగత్సత్యం భవిష్యతి
శుక్తికారజతంసత్యం భూషణంచే జ్జగద్భవేత్
రజ్జుసర్పేణ దష్టశ్చే న్నరోభవతు సంసృతిః
జాతరూపేణ బాణేన జ్వాలాగ్నౌ నాశితేజగత్ .

తా. గొడ్రాలికొడుకుయొక్క మాటలకు భయముండునేడ నాకంటె భిన్నమైనది యుండును. కుందేటికొమ్ముచే మదించినగజేంద్ర చంపబడినయెడల నాకంటె వేరుగ జగత్తు కలదు. ఎండమావులందలి జలము తృషార్తుడుగ్రోలి తృప్తినందెనేని జగత్తనునది కలదు. మా

యొక్క కొమ్ముచే నేజీవుడైన చంపబడినయెడల జగత్తనునది యుండ వచ్చును. ఆకాశమందున్న నగరము సత్యమైనయెడల జగత్తనునది యుండవచ్చును. ఆకాశమునల్లగానుంచుట సత్యమైనచో జగత్తుకూడ సత్యముగా నుండవచ్చును. శుక్తికారజితముచే నలంకారములు చేయ బడినచో జగత్తు సత్యముగా నుండవచ్చును. రజ్జుసర్పముచే మనుజుడు కరువబడినచో జగత్తు సత్యముగనుండవచ్చును. బంగారుబాణముచే జ్వాలాగ్ని నశింపజేయబడినచో జగత్తు సత్యముగ నుండవచ్చును. కాబట్టి యీసర్వజగత్తును మిథ్యాభూతమువలె చూడవలెను.

మూ. శాంకరీయం మహాశాస్త్రం నదేయం యస్యకస్యచిత్
నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే
గురుభక్తివిశుద్ధాన్తఃకరణాయ మహాత్మనే
సమ్యక్పరీక్ష్య దాతవ్యం మాసం షణ్మాస వత్సరమ్.

తా. పరమశివప్రోక్తమగు ఈ శాస్త్రమును అనర్హులగువారల కుప దేశింపతగదు. నాస్తికుడు, కృతఘ్నుడు, దురాచారుడు, దుష్టుడు మున్నగువారల కుపదేశింపగూడదు. గురుభక్తికలిగిన పరిశుద్ధచిత్తు లకు, మహాత్ములకు, మాసమో, ఆరుమాసములో, సంవత్సరమో వారిప్రవర్తనమును పరిశీలించి ఉపదేశింపవలెను.

మూ. ద్వాదశ్యాం బ్రహ్మ శాశ్వతమ్
ఆత్మానం సతతంజ్ఞాత్వా కాలంనయమహామతే
ప్రారబ్ధ మఖిలం భుంజ నోద్వేగం కర్తుమర్హసి॥

తా. ద్వాదశస్థానమే స్థిరమైనది, రాకపోకలులేని అఖండపరిపూర్ణము నని తెలియవలెను. సర్వకాలములందు సర్వమునందును ఆత్మజ్ఞాన ముతో నెవడు కాలముగడుపునో; వాడు మహాత్ముడు; గొప్ప బుద్ధి కల

వాడును. తాను జన్మించినది మొద లంతమువఱ కెంతకర్మకలదో, ఏవిధ ముగ నున్నదో అది యంతయు ననుభవింపక తప్పదు. అత డాకర్మ ననుభవించుచున్నను సంద్రపు టలలవలె కర్మ నంటడు.

మూ. పుష్పమధ్యే యథాగంధః పయోమధ్యే యథాఘృతమ్
తిలమధ్యే యథాతైలం పాషాణే ష్వివకాంచనమ్
ఏవం సర్వాణిభూతాని మణిసూత్రఇవాత్మని
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణిస్థితః.

తా. పుష్పములో పరిమళమువలెను, పాలలో నెయ్యివలెను, నువ్వులలో నూనెవలెను, పాషాణములందు బంగారమువలెను సర్వములోను నిండియున్న ఆత్మ నెవడు మణులలోని దారమువలె సర్వభూతాంతస్థముగ చూచుచున్నాడో అట్టి స్థిరబుద్ధికలవాడు అజ్ఞానమును మూఢత్వమును విడువగలుగుచున్నాడు.

'బ్రహ్మవి ద్బ్రహ్మైవభవతి' యనునట్లు బ్రహ్మమును తెలిసికొన్నవారు బ్రహ్మమే యగుచున్నారు.

మూ. తథా తురీయాతీతావస్థా
తథా సర్వేషా మానందస్వరూపా భవతి.
ద్వన్ద్వాతీతా భవతి
యావ ద్దేహధారణా వర్తతే తావత్తిష్ఠతి.

తా. ఎయ్యది తురీయాతీతావస్థగా చెప్పబడుచున్నదో అది సకలజనుల కానందకరమైనది; నిజస్వరూపస్థానమైనది; రెండవదిలేనిది; అఖండైకరసము నగుచున్నదని తెలియవలెను. అట్లెఱింగినవారలు దేహాశ్రయముదాల్చి ప్రారబ్ధ మనుభవించుచున్నను కర్మబద్ధులు కారు.

మూ. దేహాన్త స్సవై జ్ఞేయో నిష్కలో దేహవర్జితః
ఆప్తోపదేశగమ్యోఽసౌ సర్వతః కిమవస్థితః
తిలేషుచ యథా తైలం పుష్పే గంధఇవస్థితః
పురుషస్య శరీరేఽస్మిన్ సబాహ్యాభ్యన్తరే స్థితః.

తా. పరమాత్మ సకళుడనియు, నిష్కళుడనియు చెప్పబడు విషయములు దేహాధ్యాసచేతను, తత్సంబంధరాహిత్యముచేతను కలుగుచున్నది. దేహసంబంధము కలిగినప్పుడు సకళుడనియు, దేహాధ్యాసవివర్జితుడైనప్పుడు నిష్కళుడనియు చెప్పబడును. సర్వత్రవ్యాపించియున్న ఈ నిష్కళస్వరూపుడాప్తుడైన సద్గురువుయొక్క సదుపదేశముచేతనే తెలియదగినవాడగుచున్నాడు. నిష్కళుడు, సర్వవ్యాపియునై యున్నను గురూపదేశములేక కేవలసాధనములచే తెలియబడడని చెప్పబడెను. పుష్పములందలి పరిమళమువలెను, నువ్వులయందలి నూనెవలెను పరమాత్మ ప్రాణులయొక్క శరీరములందు బాహ్యాభ్యంతరములయందంతటను వ్యాపించియున్నాడని చెప్పునసద్గురువాక్యమును నమ్మవలెను. నమ్మినవాడెన్నటికిని నాశనము నొందడు.

మూ. అగోత్రోఽహ మగాత్రోఽహ మచక్షుష్కోఽస్మ్యవాగహమ్
అదృశ్యోఽహ మవర్ణోఽహ మఖణ్డోఽస్మ్యహ మద్భుతః
అద్వైతోఽహ మపూర్ణోఽహ మబాహ్యోఽహ మనన్తరః
అశ్రోత్రోఽహ మదీర్ఘోఽహ మవ్యక్తోఽహ మనామయః ॥

తా. కులగోత్రవివర్జితుడ నగుటచే నేను అగోత్రుడను, అగాత్రుడను, జ్ఞానేంద్రియము లేనివాడనగుటచే నేను అచక్షుష్కుడను. కర్మేంద్రియాభావుడ నగుటచే నే నవాక్కుడను అగుచున్నాడను. తాదృశీభావుడ నగుటచే నే నదృశ్యుడను. వర్ణాశ్రమాతీతుడ నగుటచే నే నవర్ణుడను. పరిపూర్ణుడ నగుటచే నే నఖండుడను, అద్భుతుడను అగుచున్నాను.

నిష్ప్రవృత్తియోగికుడ నగుటచే నేనద్వైతుడను. జీవాత్మ పరిచ్ఛిన్న దృష్టి గలవాడ నగుటచే నేనపూర్ణుడను, అపూర్ణు డనగా: శ్రీమహా విష్ణువు; కావున విష్ణ్వాత్మకముగ అంతట పూర్ణుడనై యున్నాను. కావున అపూర్ణుడను. స్వబాహ్యాంతఃకలనా విభేదరహితుడ నగుటచే నేనబాహ్యుడను, అనంతుడను అగుచున్నాను. కారణవిరహితుడ నగుటచే అశ్రోత్రుడను, పరిణామవిరహితుడ నగుటచే అవీక్ష్యుడను, అదృశ్యుడ నగుటచే అవ్యక్తుడను, అన్నావృడ నగుటచే అనామయుడను అగు చున్నాను.

మూ. స్థానత్రయవ్యతీతో౽హం సర్వానుగ్రాహకో౽స్మ్యహమ్
సచ్చిదానన్దపూర్ణాత్మా సర్వప్రేమాస్పదో౽స్మ్యహమ్.

తా. ఏను జాగ్రదాది స్థానత్రయ వ్యతీతుడను. సర్వానుగ్రహ కారకుడను. సచ్చిదానంద పూర్ణాత్ముడను. సర్వప్రేమాస్పదుడను. స్వప్రకాశుడను. చిద్ఘనుడను. సత్యస్వరూపతన్మాత్రుడను, సిద్ధసర్వాత్మకు డను, అగుచున్నాను.

మూ. తేషాం ముక్తికరంమార్గం మాయాజాలనికృంతనమ్
జన్మమృత్యు జరావ్యాధి నాశనం మృత్యుతారకం
నానామార్గైస్తు దుష్ప్రాపం కైవల్యం పరమంపదమ్.

తా. జీవులకు ముక్తిమార్గమును, మాయను తొలగించునదియును. జననము, మరణము, వార్ధక్యము, వ్యాధి అనువానిని నాశనము చేయు నదియును, మరణము లేనిదియును, అనేకమార్గములచే పొందదగని యును నగుపరమపదమే పరబ్రహ్మముగా తెలియవలెను.

మూ. నిష్కళం నిర్మలం శాన్తం సర్వాతీతం నిరామయమ్
తదేవ శివరూపేణ పుణ్యపాప ఫలైర్వృతమ్

జ్ఞాతం యేన నిజంరూపం కైవల్యంపరమం పదమ్
నిష్కళం నిర్మలం సాక్షా త్సచ్చిదానన్దరూపకమ్
ఉత్పత్తి స్థితి సంహార స్ఫూర్తిజ్ఞాన వివర్జితమ్
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త మథ యోగం బ్రవీమి తే
సదా బుద్ధిమతాభావ్యం యోగినా యోగసిద్ధయే
ఏ తే విఘ్నా మహాత్సిద్ధే ర్నరమేత్తేషు బుద్ధిమాన్ ॥

తా. నిష్కళమై, నిర్మలమై, శాంతమై, సర్వశ్రేష్ఠమై, మలరహితమై, యుండునట్టివస్తువే జీవరూపమునొంది ష... యొక్క ఫలములచే నావరింపబడిన దై యున్నది.

నిష్కళమై, నిర్మలమై సాక్షాత్సచ్చిదానందరూపమై ఉత్పత్తిస్థితి సంహారములు, వృద్ధిపొందుట యనునవి లేనిదై యుండెడికైవల్యమైన పరమపదమే పరబ్రహ్మముగా చెప్పబడును.

యోగ్యమైనవాడు తనకు యోగము ... డి తలంపులో యోగము నభ్యసింపవలెను. అనగా జ్ఞానము తో ... డిన యోగము; ఉద్దిష్టవస్తుప్రాపణము; మీదచెప్పిన దూరశ్రవణాదిశక్తులు, సిద్ధులు, మహాసిద్ధియగుపరమాత్మయు ననునివి పూర్ణాత్మ జ్ఞానయోగమునకు విఘ్నములుగా తెలియవలెను.

బుద్ధిమంతుడాశక్తులను వాసనతోగూడ పూర్తిగావిడచి, పూర్ణాత్మ నెఱింగి రాకపోకలులేని రాజమార్గమును తెలిసికొనవలెను.

మూ. యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్
యద్య చ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్
నాసయా లభతే యద్యత్ తత్తదాత్మేతి భావయేత్
జిహ్వాయా యద్రసం హ్యత్తి తత్తదాత్మేతి భావయేత్

త్వచా యద్యత్ స్పృశేద్యోగీ తత్తదాత్మేతి భావయేత్
ఏవం జ్ఞానేన్ద్రియాణాంతు తత్తత్సౌఖ్యంతు సాధయేత్ ॥

తా. ఇట్లు విషయభోగమునం దాత్మదర్శనసౌఖ్య మనుభవించు చున్నట్లుగనే యగును. విషయభోగమునకు వెరగందబనిలేదు. విషయము లకు నింద్రియమనంబులను చలింపచేయుశక్తి లేదు. జ్ఞానము కలిగినపిదప నయితేము ఇంద్రియములలోని బహుకాలానుభవము విలీనముచేయు చుండు రాగవాసనలు బాహ్యస్పర్శచే పైకివచ్చి అడ్డగించవచ్చును. అప్పుడుగూడ వెరగందక "నీవు ఉపాధివాసనాజనిత దోషమేగా ఇతరముకాదు. ఆత్మస్వరూపుడనగు నన్ను నీ వేమిచేయగలవు ?" అని నిరాదరణ చేసినయెడల తనంతటతానే నశించును. కాలత్రయమున నవి బాధింప నేరకయేపోవును. మనము భయపడినందువలన మన కనుష యోగకార్య మాచరించుకొనుటయు, నితరులకు సహాయము చేయలేక పోవుటయు జరుగును. మనకు రాగవాసనలు పైకివచ్చునట్లుగనే ఇతరు లకుగూడ వచ్చినయెడల మనము భయపడక (చలింపక) వాని యథా స్థితి నెఱింగి తగుసహాయ మొనర్పవలెను.

పరిపూర్ణమైన సముద్రమునం దెన్నినదులు చేరినను సముద్రము చలింపనివిధమున సర్వకాల సర్వావస్థలయం దిరువదినాల్గుగంటలును ఆత్మావలోకనచే చిత్తము బ్రహ్మాకారమై తృప్తినందు బ్రహ్మవేత్తను విషయజాత వాసనాత్రయ మంటజాలదు. (చలింపచేయజాలదు).

మూ. ప్రపఞ్చాధారరూపేణ వర్తతే కో జగన్నహి
యథేక్షురస సంవ్యాప్తా శర్కరా వర్తతేతథా
అద్వయబ్రహ్మరూపేణ వ్యాప్తోఽహంనై జగత్రయమ్ ॥

తా. ప్రపంచము నాకు నివృత్తియైనను ఎప్పుడును నుండునటు తోచుచున్నది. రజ్జుసర్పభ్రాంతికి రజ్జువే కారణమగునట్లు జగత్తున

కాధారరూపముగా బ్రహ్మ సత్తామాత్రమే వ్యాపించి యున్నది. కావున జగత్తులేదు. చెఱకురసమున శర్కర వ్యాపించియున్నట్లుగనే అద్వయబ్రహ్మరూపమే లోకత్రయమునను నిండియున్నది.

మూ. ఘటావభాసకో భానుః ఘటనాశే ననశ్యతి
దేహావభాసక స్సాక్షీ దేహనాశే ననశ్యతి
నమేబన్ధో నమేముక్తి ర్నమేశాస్త్రం నమేగురుః
మాయామాత్ర వికాసత్వా న్మాయాతీతో౽హ మద్వయః.

తా. ఘటమును ప్రకాశింపజేయుసూర్యుడు ఘటము నాశన మైన ప్పుడు నాశనమగుటలేదు. దేహమును ప్రకాశింపజేయుఆత్మ దేహము నశింపగనే నాశనమగుటలేదనియు దెలియవలెను.

"నాకు బంధములేదు. ముక్తిలేదు. శాస్త్రములేదు. గురువులేరు. ఇయ్యవి మాయామాత్రప్రకాశమానములగుటచే వీని నతిక్రమించినవా డను. విలక్షణుడను. రెండవది లేనివాడ" నని పరమాత్మ చెప్పు చున్నాడు.

మూ. బ్రహ్మణ్యాం, కులగోత్రేచ నామ సౌన్దర్య జాతయః
స్థూలదేహగతా ఏ తే హ్యలిఙ్గస్య నవిద్యతే॥

తా. బ్రాహ్మణ్యము, కులము, గోత్రము, నామము, అందము, జాతి ఇవియన్నియు స్థూలదేహముతో సంబంధించినవేగాని దేహములేని విదేహికి లేవని తెలియవలెను.

మూ. స్వల్పో౽పి దీపకణికా బహుళం నాశయేత్తమః
స్వల్పో౽పి బోధో౽స్యజ్ఞానం బహుళం నాశయే త్తథా

కాలత్రయే యథాసర్పో రజ్జౌనాస్తి తథాహ్యయి
అహఙ్కారాది దేహాన్తం జగన్నాస్త్యహ మద్వయః॥

తా. దీప మెంతచిన్నదైనను దానిప్రకాశము గాఢాంధకారము పోగొట్టుచున్నయట్లు గురుబోధ యెంతస్వల్పమైనను ఘనతరాజ్ఞానమును నశింపజేయుచున్నది. కాలత్రయమునందును రజ్జువునందు సర మెట్లు లుండదో అట్లే అహంకారము మొదలు దేహముదనకు గలజగత్తు అద్వయుండనగు నాయందు లేదు.

మూ. ఇత్యాత్మబోధోపనిషదం ముహూర్త ముపాసిత్వా
నచ పునరావర్తతే నచపునరావర్తతే॥

తా. ఆత్మబోధలోని రహస్య మొక్క ముహూర్తమాత్రమైన నెవరు తెలియుదురో వారు రాకపోకలులేని రాజమార్గమును పొందెదరు.

మూ. జ్ఞానవైరాగ్య స్సన్న్యాసః॥

తా. సర్వవాసనలువిడిచిన వైరాగ్యముతోను, - నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానముతోనుగూడిన సన్న్యాసమే సన్న్యాసముగాని సన్న్యాసాశ్రమములో నున్నంతమాత్రమున సన్న్యాసము కాదు.

మూ. సర్వసంసారం నివర్త్య, దారేషణ, ధనేషణ, లోకేషణావ
ద్దేహవాసనాం, శాస్త్రవాసనాం, లోకవాసనాంత్యక్త్వా
వమనాన్నమివ ప్రాకృతికం సర్వమిదం హేయం మత్వా
సాధన చతుష్టయసంపన్నో అసన్నశ్యతి సఏవ జ్ఞానసన్న్యాసీ
బ్రహ్మ వ్యతిరిక్తం సర్వం నశ్వర మితి॥

తా. సర్వసంసారము సారములేనిది నశించునది యని తెలిసి, ఈషణత్రయమును వాసనాత్రయమును వమనాన్న మలమూత్రములతో సమముగ చూడవలెను. సర్వేంద్రియములతో వ్యవహారము చేయుచున

జగత్తంతయు హేయమనితలచి, అహంకార మమకారములు విడిచిన బుద్ధిమంతుడు సాధనచతుష్టయసంపన్నుడై నిత్యానిత్య వస్తువివేకముచే నిత్యవస్తువునుపొంది, యనిత్యవస్తువునందు వమనాన్నమువలె విరాగమును జెందియుండునేని వాడు సన్యాసి యనబడును. వాడే జ్ఞానసన్యాసి ఆత్మసన్యాసి యని తెలియవలెను. కన్నుమూసినను, కన్నువిప్పినను, లోపల వెలుపల సర్వమును ఏకాకారముగా నున్నదే అఖండ పరిపూర్ణ పరబ్రహ్మము. మిగిలినదంతయు నశించుచున్నది; కాన 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' యని నమ్మవలెను.

మూ. త్రిశిఖీ బ్రాహ్మణ ఆదిత్యలోకం జగామ తం
గత్వోవాచ భగవన్ కిం దేహః, కిం ప్రాణః, కిమాత్మా? ॥

తా. త్రిశిఖియనువాడు సూర్యలోకమునకేగి, తత్సూర్యమండలాంతర్వర్తియగు సయ్యాదిత్యుని యథాశాస్త్ర నియమపూర్వకముగ సమీపించి, సాష్టాంగనమస్కార మాచరించి షడ్గుణైశ్వర్యసంపన్నుడవగు నోమహానుభావా! దేహమన నేమి? ప్రాణమన నేమి? ఆత్మ యనగా నేమి? యని ప్రశ్నించెను.

మూ. సహోవాచ సర్వమిదం శివఏవ విజ్ఞానీహి కిన్తు
నిత్యశుద్ధో నిరఞ్జనో విభు రద్వయ శ్శివ ఏకత్వేన
భాసేదం సర్వదృష్ట్వా తప్తాయః పిణ్డవ
దేకం భిన్నవ దవభాసతే తద్భాసం కిమితిచే
దుచ్యతే – సచ్ఛబ్దవాచ్య మవిద్యాశబలం బ్రహ్మ.

తా, ఓత్రిశిఖీ! నీవడిగిన దేహ, ప్రాణ ఆత్మలుమూడును శివస్వరూపమే. శివుడన నేమియో తెలియమిచే నిట్టి భ్రాంతియూ శమగు వికల్పజ్ఞానముదయించినది.

నిత్యుఁడును, శుద్ధుడును, నిరంజనుడును, విభుడును, అద్వయానందుడు నగువాడు శివుడొక్కడే. తనకాంతిచేతనే కనబడుచున్న దేహప్రాణాది రూపమైన జగత్తు సృజించి తప్తాయఃపిండమువలె నైక్యమునుపొంది, అజ్ఞానదృష్టిచే భిన్నుడయినవానివలె ప్రకాశించుచున్నాడు. కాన ఇట్లు భాసక మగుచున్నదియే సత్తు "సదేవసోమ్యేద మగ్రఆసీత్" అను శృత్యనుసారము స్వావిద్యాసంబంధముచే అవిద్యాశబలబ్రహ్మము స్వరూపముచేత పూర్ణాత్మ పరబ్రహ్మ మగుచున్నది.

మూ. శ్రీరామసాన్నిధ్యవశా జ్జగదానన్దకారిణీ
ఉత్పత్తిస్థితికారణసంహారిణీ సర్వదేహినాంసీతా
భగవతీ జ్ఞేయా.

తా. ఆత్మారాముని సాన్నిధ్యముచేత జగత్తున కానందముగ తోచుచున్నదియు, సృష్టిస్థితిసంహారములతో సర్వదేహములందుగనబడుచున్నదియు, మూలప్రకృతి నాబడునదియు, భగవతి యనుపేరుగల సీతనుం జగత్తంతయు బీజములోనిచెట్టువలె తోచుచున్నది. ఈతోచుట సంజ్ఞగా తెలియవలెనేగాని ఇదమిత్థమని నిశ్చయించుటకు వీలులేదు. ఈసంజ్ఞయే మహాసంజ్ఞ. కలలోమేలుకున్న శరీరము లేకపోవునుగదా! అప్పు డెరుగువారే వేరు. ఈ మూలరహస్యమును ముఖ్యముగా గురుముఖతో తెలియవలెను.

ఈ సంజ్ఞచే పరిపూర్ణముగ దర్శించి ఈ ఎరుకను, మూలములేని ఈ సంజ్ఞను సమూలముగ విడువవలెను. భగవంతునిచే భరింపబడుచున్నది గాన భగవతి యని చెప్పబడెను.

మూ. సర్వవేదమయీ, సర్వదేవమయీ, సర్వలోకమయీ, సర్వ
కీర్తిమయీ, సర్వమయీ, సర్వధర్మమయీ, సర్వాధారకార్య

కారణమయీ, మహాలక్ష్మీర్దేవేశస్య భిన్నాభిన్నరూపచేతనా చేతనాత్మికా, బ్రహ్మాస్థావరాత్మా, తద్గుణవిభాగాభేదా చ్ఛరీర రూపా, దేవర్షి మనుష్య గన్ధర్వరూపా, అసుర రాక్షస భూత ప్రేత పిశాచ భూతాది భూత శరీరరూపా, భూతేన్ద్రియ మనఃప్రాణ రూపేతి విజ్ఞాయతే.

తా. సర్వవేదములకు, సర్వదేవతలకు, సర్వకీర్తులకు, ఇంతింత యని చెప్ప వీలులేన ట్లంతయునిండిన మహామాయామయమై, సర్వ ధర్మములకు, సర్వకార్యకారణములకును, ఆధారమై, మహాలక్ష్మీ దేవియొక్క ఆలోచనచే నియమింపబడినదై, అనేకరూపములుకలిగి చేతనాచేతనాత్మకమైవెలయు పిపీలికాది బ్రహ్మపర్యంతము గుణవిభాగమే.

భేద శరీరరూపాదులతో దేవతలయందు, ఋషులయందు, మను ష్యులయందు, గంధర్వులయందు రాక్షసులయందు, భూతప్రేత పిశా చాదులయందు నా యా శరీరరూపములచేత నా యా భూతముల యొక్క ఇంద్రియ మనఃప్రాణరూపములు సర్వము ఆమూలప్రకృతి యైన సీతామహాదేవివల్లనే జరుగుచున్నదని తెలియవలెను.

మూ. జాగ్రన్నేత్రద్వయోర్మధ్యే హంసఏవప్రకాశతే
సకారః ఖేచరీప్రోక్త స్త్వంపదంచేతి నిశ్చితమ్
హకారః పరమేశస్యా త్తత్పదంచేతి నిశ్చితమ్
సకారో ధ్యాయతేజన్తు ర్హకారోహి ధ్రువంభవేత్
ఇన్ద్రియై ర్బధ్యతేజీవ ఆత్మాచైవ నబధ్యతే
మమత్వేన భవేజ్జీవో నిర్మమత్వేన కేవలః॥

తా. నేత్ర జాగరితముల కాధారాధేయభావము నిరూపింపబడు ...ది. ఆధారాధేయములైన జాగ్రన్నేత్రముల మధ్యభాగమందు

తదారోపముల కపవాదమైన అధికరణగా హంస ప్రకాశించుచున్నది. హంసయను మంత్రమును ఖేచరియనియు, త్వంపదమనియు నెఱుంగవలెను. హకారము పరమాత్మయనియు,తత్పదమనియు, తెలియవలెను. సకారశబ్ద వాచ్యుడైన జీవుడు స్వగతమైన జీవత్వమును విడచి సోఽహంశబ్దమునకు లక్ష్యమైన ప్రత్యగభిన్న బ్రహ్మరూపుడగును. ఇది నిజము.

దేహేంద్రియాదులయందు సంబంధములేకపోవుటయే ఆత్మలక్షణము. మమత్వము జీవలక్షణమనియు, నిర్మమత్వము పూర్ణాత్మలక్షణమనియు సంగ్రహముగా నెఱుంగవలెను.

మూ. అనిత్యమ్ జగజ్జనితమ్, స్వప్నజగ దభ్రగజాదితుల్యమ్,
తథా దేహాదిసంఘాతమ్, మోహగుణజాలకలితమ్,
తద్రజ్జుసర్పవత్కల్పితమ్॥

తా. ఈ పరిదృశ్యమానమగు జగత్తంతయు మిథ్య. స్వప్నము వంటిది. స్వప్నమందు పెద్దయేనుగుతోడి పోరాటాదికమెట్లు లబద్ధమో అట్లు లీదేహత్రయ సంఘాతమంతయు అహంకార మమకారముల తోను రాగద్వేషములతోను గూడినదంతయు నింద్రజాలమువంటిదే కాని నిజముకాదు. త్రాటియందు సర్పమను భ్రాంతి అజ్ఞానజనితమై కల్పిత మగుచున్నదేకాని నిజము కాదుగదా!

మూ. మహాశ్మశానే ప్యానందవనే వాసః
మాయా మమతాహఙ్కార దహనమ్
భ్రాన్తిహరణం కామాది వృత్తిదహనమ్
స్వస్వభావో మోక్షః సస్సర్వం విన్యాసం సన్న్యాసం
అంతే బ్రహ్మాఖండాకారం నిత్యం సర్వసన్దేహనాశనమ్॥

తా. హృదయాకాశ మంతయు వృత్తిరహితమైనది. జ్ఞానాగ్నిచే మైన హృదయమే మహాయోగి కానందవనవాసము. ఇదియే మహా

శ్మశానము. సూర్యుని మేఘములు కప్పినట్లు [illegible] ములు, రాగ ద్వేషములు కప్పినవి; కాన అహంకార [illegible] జ్ఞానాగ్నిచే కాల్పవలెను.

వివిధమైన జగద్భ్రాంతియు కలుగనీయక, [illegible] కామమ్ములతో గూడిన శత్రువర్గమును (వృత్తి) [illegible] వలెను.

సర్వజగత్తును నిత్యానిత్యముచే పరిశోధించి, [illegible] ఈ నిజసర్వరూపము తెలియుటయే మోక్షమని [illegible]

సర్వవాసనలు విడుచుటయే సన్న్యాసము; [illegible] ములవలె సర్వసంసారము పరులకు ధారపోయుట [illegible] గల మమకారము విడువవలెను. అదియేసన్న్యాసము. [illegible] వలసిన దేదియునులేదు. అయ్యఖండపరిపూర్ణ [illegible] అట్టివానికి కాలత్రయమందును అన్నిస్వభావముల [illegible] మేసందేహములును కలుగవు.

సందేహమును రాక్షససంఘమును మన దేహ [illegible] టచే నిత్యముక్తు డగుచున్నాడు. అట్టివానికి [illegible] మైన సందియములుగాని, అనుమానములు [illegible] వాడై యుండును.

మూ. సర్వపరిపూర్ణ తురీయాతీత బ్రహ్మ [illegible]
భవతి బ్రహ్మేతి స్తువన్తి సర్వలోకస్తుతిపాత్ర
స్సర్వదేశ సంచారశీలః॥

తా. సర్వపరిపూర్ణ తురీయాతీత బ్రహ్మ [illegible] ఉన్న యోగిని బ్రహ్మమని స్తుతించెదరు. [illegible] ప్రపంచమునంతయును బ్రహ్మమయముగా [illegible]

సకలదేశసంచారశీలు డగుచున్నాడు. 'ఆ బ్రహ్మము నేనై యున్నాను; నాకంటె అన్యమేదియును లేదు.' అనెడి సర్వపరిపూర్ణ తురీయాతీత పరబ్రహ్మస్వరూపుడగుచున్నాడు. అట్టివా డంతటను స్తుతింపబడిన వాడై అంతటను నిండినవాడై యున్నాడు.

మూ. శబ్దకాలలయేన దివారాత్ర్యతీతో భూత్వా సర్వపరి
పూర్ణ జ్ఞానోన్మన్యవస్థావశేన బ్రహ్మైక్యం భవతి,
ఉన్మన్యా అమనస్కం భవతి, తస్య నిశ్చింతతా ధ్యానం,
సర్వకర్మనిరాకరణ మావాహనం, నిశ్చయజ్ఞాన మాసనం,
ఉన్మనీభావః పాద్యం, సదాఽమనస్క మర్ఘ్యం, సదా
దీప్తి రాచమనం, అపారామృతవృత్తిః స్నానం, సర్వాత్మ
భావనా గన్ధః, దృక్స్వరూపావస్థాన మక్షతాః, చిదాప్తిః
పుష్పం, చిదగ్నిస్వరూపం ధూపః, చిదాదిత్యస్వరూపం
దీపః, పరిపూర్ణచన్ద్రామృతస్యైకీకరణం నైవేద్యం,
నిశ్చలత్వం ప్రదక్షిణం, సోఽహంభావో నమస్కారః,
మౌనం స్తుతిః, సర్వసంతోషో విసర్జన మితి,
ఏవం వేద.

తా. శబ్దకాలలయముచేత పగలు రాత్రి యనుదీని నతిక్రమించి సర్వపరిపూర్ణ జ్ఞానోన్మన్యవస్థావశముచేత బ్రహ్మైక్యము కలుగుచున్నది. ఆ బ్రహ్మైక్యముయొక్క నిశ్చింతయే ధ్యానము, సర్వకర్మత్యాగమే ఆవాహనము, బ్రహ్మసత్యము, జగత్తుమిథ్య యనునిశ్చయజ్ఞానమే ఆసనము; ఉన్మనీభావమే పాద్యము; సదా అమనస్కభావమందుండుటయే అర్ఘ్యము; అపారామృతవృత్తియే స్నానము; సర్వాత్మభావనయే గంధము; దృష్టి సదా బ్రహ్మమునందు చెదరకుండుటయే అక్షతలు; ఆత్మదర్శనము చేయవలయు ననుతలంపే (ఇదియే జ్ఞానా

పుష్పము ; ఆత్మనిష్ఠయందు బుద్ధినునిచి కదలక స్థిరముగానుంచుటయే (ఇదియేజ్ఞానాగ్ని) ధూపము ; 'నేతినేతి' అనగా : నేను దేహము కాదు, సర్వజగత్తును నేనుకాదు. ఇన్నిటి నెరుగుచుండెడు ఆత్మయే నేను. అని యెఱింగెడు తత్వవివేకజ్ఞానమే సూర్యు డనబడును. ఈజ్ఞానసూర్యుడే దీపము. 'నేను బ్రహ్మము బ్రహ్మమే నేను' అనుకీతి సర్వపరిపూర్ణ మగు పరబ్రహ్మమునం దైక్యభావమే నైవేద్యము; చపలములేక నిస్సంకల్పముగా నుండుటయే ప్రదక్షిణము; సోహంభావమే నమస్కారము; నిర్వాసనామానమే స్తుతి; సర్వసంతోష విసర్జనము నను నివియే జ్ఞాన షోడశోపచార ఆత్మపూజ యనబడును. ఇట్టి స్థితిలో నున్నవానికి బాహ్యపూజ అవసరములేదు. ఇట్టి స్థితి నందిన జ్ఞానయోగి సర్వాత్మ పూజ చేయవలెను.

మూ. తదను నిత్యశుద్ధః పరమాత్మాఽహ మేవేతి తత్త్వమసీ
త్యుపదేశేన త్వమేవాహ మహమేవత్వమితి తారకయోగ
మార్గే ణాఖణ్డానన్దపూర్ణః కృతార్థో భవతి.—
పరిపూర్ణ పరమాకాశ మగ్నమనాః ప్రాప్తోన్మన్యవస్థ
స్సంన్యస్త సర్వేన్ద్రియవర్గో అనేకజన్మార్జిత పుణ్యపుంజ పక్వ
కైవల్యఫలో ఽఖణ్డానన్ద నిరస్తసర్వక్లేశ కశ్మలో
బ్రహ్మాఽహ మస్మీతి కృతకృత్యో భవతి.—
త్వమేవాహం నభేదోఽస్తి పూర్ణత్వా త్పరమాత్మనః
ఇత్యుచ్చరన్ తమాలిఙ్గ్య శిష్యం జ్ఞప్తి మనీనయత్ ॥

తా. అనిత్య శుద్ధ పరమాత్మస్వరూపుడు తత్వమసి మొదలగ నుపదేశములచే నీవే నేను, నేనే నీవు అను తారకయోగ మార్గముచే నఖండానందపూర్ణుడై కృతార్థు డగుచున్నాడు. నేనే బ్రహ్మము. బ్రహ్మమే నేను అనెడి దృఢభావముగలవాడు కృతార్థు డగుచున్నాడు.

పరిపూర్ణపరమాకాశమునందు మునిగి యుండువారు ఉన్మన్యవస్థను పొంది సర్వేంద్రియవర్గముల విడిచి అనేకజన్మములందు సంపాదింపబడిన పుణ్యసమూహ పరిపక్వ కైవల్యఫలమైన అఖండానంద సర్వక్లేశ కల్మ రహితమగు పరబ్రహ్మము నేనే యని కృతకృత్యు డగుచున్నాడు గురూపదేశముచేత పూర్ణాకాశమునందే మనస్సునుంచినవారు అఖం పరిపూర్ణులే యగుచున్నారు.

నీవే నేను, నేనే నీవు అనియు, పరిపూర్ణు డగుటవలన పరమాత్మకం భిన్నమయినది లేదనియునుచెప్పి, ష్యుని సద్గురు వాలింగనముచేసి కొని నిరంతరానందసుఖమును కలుగజేయు జ్ఞప్తియం దుండునట చేసెను.

తారకయోగమార్గముచే నఖండానందము నందుటయే జన్మసార్థ మని యెఱుంగవలెను.

మూ. పరమరహస్య శివతత్వ జ్ఞానేనేతి సహోవాచ:-
యేన దక్షిణాభిముఖ శ్శివో పరోక్షీకృతో భవతి
తత్పరమరహస్య శివతత్వజ్ఞానమ్, య స్సర్వోప
రమకాలే సర్వా నాత్మా నుపసంహృత్య స్వాత్మానన్దే
సుఖ మోదతే ప్రకాశతే వాసుదేవః.

తా. మార్కండేయమహాముని ఇయ్యది పరమరహస్యమగు త జ్ఞానమువలన కలిగెనని పలికెను.

దక్షిణాభిముఖుం డగుపరమశివుని ప్రత్యక్షముగా ననుభవించి తెలిసి కొనెడిజ్ఞానమే పరమరహస్యమగు శివతత్వజ్ఞానము. ఇతడే సంహా ప్రళయ కాలమునందు సర్వమును తనలో లీనముచేసికొని తనకు స్వాభా వికమైన మహదానందముచేతనే ఆనందించుచు ప్రకాశించుచుండును

మూ. మోహభానుజసంక్రాన్తం వివేకాఖ్యం మృకండుజమ్
తత్త్వావిచారపాశేన బద్ధం ద్వైతభయాతురమ్
ఉజ్జీవయ న్నిజానన్దే స్వ స్వరూపేణ సంస్థితః
శేముషీదక్షిణా ప్రోక్తా సా యస్యాభీక్షణే ముఖం
దక్షిణాభిముఖః ప్రోక్తః శివోఽసౌ బ్రహ్మవాదిభిః.

తా. వివేకమనెడి మార్కండేయులు మోహమనెడి యమునిచే నడ్డగింపబడి తత్త్వవిహీనమను పాశముచే బంధింపబడుచు, ద్వైతమనెడి భయమునకు పాత్రుడై పరితపించుచుండగా తనలో నిమిడియుండు పరమాత్మ స్వరూపమైన నిజానందమను ప్రాణమునొసగి నిరతిశయానంద శాశ్వతపదవిని, ఏకచిరంజీవత్వమును (జననమరణరహితము, రాకపోకలు లేనిదియు నగు రాజమార్గమును) పొందెను.

ప్రసన్నమైనబుద్ధి దక్షిణ యనబడుచున్నది. తద్బుద్ధియను నేత్రమున కెదురుగా సుబోధక మగుమూర్తి గలవాడగుటచే పరమశివుని దక్షిణామూర్తిగ బ్రహ్మజ్ఞానులు చెప్పుదురు.

మూ. అణో రణీయా న్మహతో మహీయా
నాత్మాఽస్యజన్తో ర్నిహితో గుహాయామ్,
తమక్రతుః పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః.

తా. ఆత్మతత్త్వము మిక్కిలియు నల్పపరిణామముగల శ్యామాకాది ...ముకంటె మిక్కిలి సూక్ష్మమయినదియు, మిక్కిలి గొప్పపరిమాణము పృథివ్యాదికముకంటె మిక్కిలి మహత్తైనదియు నని యెఱుంగ ...ను. అణుపరిమాణమో లేక మహత్పరిమాణమో గల యేవస్తువు

లోకమునందు గాన్పించుచున్నదో అది నిత్యమగు ఆత్మచేతనే స్థితిగలది యగుచున్నది. ఆత్మవిరహితమగు వస్తువు అసత్తగుచున్నది.

ఇయ్యాత్మ సర్వ నామ రూప వస్తూపాధిక మగుటచేత అణుప మాణ మయినదానికంటె అణుతరమును, మహాత్పరిమాణ మయి దానికంటె మహత్తరమును అగుచున్నది. అట్టియాత్మ బ్రహ్మాది స్తం పర్యంతమగు ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహాయం దాత్మభూత యున్నది. దర్శన, శ్రవణ, మనన, విజ్ఞానములే లింగముగాగ అయ్యాత్మను అక్రతువు (నిష్కాముడు దృష్టాదృష్ట బాహ్యావిష యోపర మ బుద్ధిగలవాడు) మాత్రమే గాంచుచున్నాడు.

ఎప్పు డెట్టి జ్ఞానము లభించునో అప్పుడు మనస్సాదిగాగల యిం యములు శరీరమును ధరించుటచేతను, యౌగికముగా ప్రసన్నమయి యుండుటచేతను ఆత్మయొక్క మహిమను కర్మనిమిత్తమై వృద్ధిక్షయ రహితమైనదానిని 'అయ మహ మస్మి' యని సాక్షాత్తుగా నెఱుంగుచు నిష్కాముడు గతించినశోకముగలవా డగుచున్నాడు.

ఒకే వస్తువున కణువున్నూ మహత్తున్నూ కలుగుట సంభవ మగునా?—— అణుత్వ మహత్వములు పరమార్థముగా ఆత్మకు లేవని చెప్పబడెను. కావున రజ్జు సర్పభ్రాంతివలె నొకవస్తువే అజ్ఞానుల కణువు గను, దూరముగను, కనబడును. విజ్ఞానములకు మహత్తుగను, దగ్గరగ అఖండ పరిపూర్ణమయిన బయలుగను, గనుపడునని తెలియవలెను.

మూ. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేనగన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా॥

తా. యజ్ఞమును, యజ్ఞమునందు హోమముచేయబడు పదార్థము లైన అన్నము, ఆజ్యము మొదలగు యజ్ఞద్రవ్యములు, ప్రయో గింపబడు పాత్రలు మున్నగు నవియు బ్రహ్మమే. బ్రహ్మస్వరూ

మైన అగ్నియందు బ్రహ్మస్వరూపుడగు యజమానిచేత చేయబడు హోమమును బ్రహ్మమే. "బ్రహ్మకర్మ సమారభే" యనినట్లు సర్వమును బ్రహ్మస్వరూప మనెడు చిత్తైకాగ్రతతో నీయజ్ఞాది కర్మలను జేయునట్టి బ్రహ్మజ్ఞానిచేత పొందబడు ఫలమున్నూ బ్రహ్మమే యని తెలియవలెను.

కావున దినచర్యలలో సర్వకాల సర్వావస్థలయందును చేయబడు సకలకర్మలును బ్రహ్మకర్మలనే చేయుచుంటిని గాని, నాది, నేనను ఫలము గోరి చేయుచున్నాననను నజ్ఞానమును పూర్తిగా వాసనలతో విడువవలెను.

మూ. వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవచ్చ వినశ్యతి,
చిజ్జడానాంతు యోద్రష్టా సోఽచ్యుతో జ్ఞానవిగ్రహః॥

తా. ఆత్మకన్యమైన జడవస్తువు లన్నియు స్వప్నమువలె నశించునవి. చిత్, జడము లను చేతనాచేతన ప్రపంచములను చూచువాడెవడో అయ్యచ్యుతుడు జ్ఞానమే స్వరూపముగా గలవాడు.

మూ. సఏవహి పరంబ్రహ్మ తద్బ్రహ్మాఽహం నసంశయః,
జీవశ్శివ శ్శివోజీవ స్సజీవః కేవలశ్శివః ॥
తుషేణబద్ధో వ్రీహిస్స్యా త్తుషాభావేతు తణ్డులః,
ఏవం బద్ధ స్తథాజీవః కర్మనాశే సదాశివః ॥
పాశబద్ధ స్తథాజీవః పాశముక్త స్సదాశివః,
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ॥

తా. ఆవిష్ణువే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే నేను. దీనికి సంశయములేదు. జీవుడే శివుడు. శివుడే జీవుడు. ఊకచే కప్పబడినప్పుడు వడ్లుగను, ఊకలేనప్పుడదియే బియ్యముగను నుండునట్లు జీవుడు కర్మచే

కట్టుబడియున్నాడు. కర్మము నాశమైనప్పుడు నిత్య ముక్తస్వరూపు-
శాశ్వతు డగుచున్నాడు. ఒకేవస్తువుగాని రెండులేవని నమ్మవలెను.

కర్మపాశముచే గప్పబడి యుండునంతవఱకు జీవుడుగా నున్నా-
త త్కర్మపాశమునుండి విడువబడినప్పుడు శివు డగుచున్నాడు. వి
స్వరూపుడైన శివునికొఱకును, శివస్వరూపుడైన విష్ణువుకొఱకును నమ
స్కారము. అనగా శివకేశవులకు భేదములేదని తెలియవలెను.

మూ. త్వమేవ సర్వాధారః త్వమేవ సర్వస్వరూపః
త్వమేవ సర్వేశ్వరః త్వమేవ సర్వప్రవర్తకః,
త్వమే వాఖండానన్దః, త్వమేవ పరిపూర్ణానన్దః,
త్వమేవ సర్వం, త్వమేవ సర్వం, త్వమేవ సర్వమ్.

తా. సర్వమున కాధారమును, సర్వజగత్స్వరూపమును, సమి-
యగు నీశ్వరస్వరూప మంతయును, సృష్టిస్థితి వ్యాపార మంతయును
అపరబ్రహ్మమే యని తెలియుము. అయ్యఖండానందమే (ఖండముకానిది)
పరబ్రహ్మము. విషయానందమున కవధిలేదు గాని బ్రహ్మానందము-
మాత్రము పూర్తికలుగును; కాన పరిపూర్ణానందమే అఖండపరబ్ర
ముగా తెలియవలెను. సర్వమును బ్రహ్మమే యని ముమ్మాటికిని న-
వలెను.

మూ. కాలత్రయాబాధితం బ్రహ్మ, సర్వకాలాబాధితం బ్రహ్మ
సగుణ నిర్గుణ స్వరూపంబ్రహ్మ, ఆదిమధ్యాన్తశూన్యం బ్రహ్మ
సర్వం ఖల్విదం బ్రహ్మ, మాయాతీతం గుణాతీతం బ్రహ్మ,
అనన్త మప్రమేయాఖణ్డం పరిపూర్ణం బ్రహ్మ, అద్వితీయ,
పరమానన్ద, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్యస్వరూప, వ్యాప
కాభిన్న పరిచ్ఛిన్నం బ్రహ్మ, సచ్చిదానన్ద స్వప్రకాశం బ్రహ్మ

మనో వాచా మగోచరం బ్రహ్మ, అఖిల ప్రమాణాగోచరం
బ్రహ్మ, అమిత వేదాన్తవేద్యం బ్రహ్మ, దేశతః, కాలతో,
వస్తుతః పరిచ్ఛేదరహితం బ్రహ్మ, సర్వపరిపూర్ణం బ్రహ్మ,
తురీయం నిరాకారమేకం బ్రహ్మ, అద్వైతమనిర్వాచ్యంబ్రహ్మ॥

తా. త్రికాలములచేతను, సర్వకాలములచేతను అంటబడనిదియు, సగుణ నిర్గుణ స్వరూపముగా నున్నదియు, సృష్టిస్థితి లయములు శూన్యమైన తరువాత అఖండముగా నిండియున్నదియు, (ఈ సర్వమును కల్పితమే కాని నిజముకాదు.) అట్లుకాక యేకల్పనలులేనిదియు, మాయాతీతము, గుణాతీతము నైనదియు, అనంతమైనదియు, పరమానందమైనదియు, పరిశుభ్ర మైనదియు, నిశ్చలమైనదియు, ముక్తిస్వరూప మైనదియు, సత్య మైనదియు, వ్యాపకము లేనిదియు, పరిచ్ఛిన్న స్వరూపమైనదియు, సచ్చిదానంద స్వరూప మైనదియు, సర్వప్రకాశక మైనదియు, మనోవాచామగోచర మైనదియు నింద్రియాతీత మైనదియు, ఏప్రమాణములచే నైనగాని తెలియుటకు వీలుగానిదియు, అమితములు అఖండములు నాబడు వేదాం[illegible]లచే తెలియదగినదియు, దేశ కాల వస్తు రహిత మైనదియు, (ఏదే[illegible]ను, ఏకాలమునను, ఏవస్తువు నైనను నామరూప రహితముచేసి వి[illegible] తెలయదగినది) తురీయ నిరాకారమై, ఎట్టిఅవస్థయును ఎట్టిఆకారమునులేక యేకాకారమై సర్వపరిపూర్ణ మైనదియు, నద్వైతము, ననిర్వాచ్యము నై వెలయునదియే బ్రహ్మ ముగా నెఱుంగవలెను.

మూ. అఖండలక్షణానంతపరిపూర్ణ సచ్చిదానన్ద
స్వప్రకాశం భవతి సర్వపరిపూర్ణానన్ద చిన్మయ
స్తమ్భాకారమ్,
యథా జాత్యన్ధస్య స్వరూపజ్ఞానం నవిద్యతే

తథా గురూపదేశేనవినా కల్పకోటిశతైరపి
తత్త్వజ్ఞానం నజాయతే తస్మాత్సద్గురు కటాక్షలేశ
విశేషేణాచిరాదేవ తత్త్వజ్ఞానం భవతి
యథా సద్గురుకటాక్షో భవతి॥

తా. అఖండ పరిపూర్ణ సచ్చిదానందలక్షణమే తన నిజప్రకాశమనియు దేహేంద్రియములు ఆప్రకాశము చేతనే కదలుచున్నవనియు తెలిసికొనుము. సర్వపరిపూర్ణమే కదలక స్తంభించియున్నదనియు దెలియవలెను.

పుట్టుకతో నంధుడగువాడు తనస్వరూపము నేలాగున తెలియజాలడో అట్లే అజ్ఞానాంధుడు గురూపదేశములేనిచో నూరుకోట్ల జన్మములకైనను తననిజస్వరూపమును తెలియజాలడని శ్రుతిచెప్పుచున్నది.

సద్గురుకటాక్షమును నగ్నికణ మావంతయేని వ్యాపించినచో దూదిభస్మమగునటుల, దేహేంద్రియములే ఆత్మయని చిరకాలమునుండి తన్నాశ్రయించియున్న అజ్ఞానము అనునాభాస నశించి ఆత్మజ్ఞానము కలుగును.

ముముక్షువు వట్టి సద్గురుకటాక్షమునకై యత్నింపవలెను.

మూ. జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పణ్డితంబుధాః,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా॥

తా. జ్ఞానాగ్నిచే కాల్పబడిన కర్మలుగలవానిని సత్యమైన పండితునిగా పెద్దలు చెప్పుదురు.

అట్టిపండితుని కర్మలన్నియు జ్ఞానమను నగ్నిచే భస్మముచేయబడును. కావున నగ్నికణమువలె రవంతయేని సద్గురుకటాక్షము వానికి గలిగినచో ఆభాసలతోగూడిన సర్వకర్మలును నశించి జ్ఞానోదయమగును.

మూ. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య పరిపూర్ణం పరమ
యోగిభిర్విమృగ్యం దేశతః కాలతో వస్తుతః
పరిచ్ఛేదరహితం, నిరంతరాభినవం, నిత్యపరిపూర్ణం,
అఖణ్డానన్దామృతవిశేషం, శాశ్వతం పరమంపదమ్॥

తా. లోపల వెలుపల సర్వమువ్యాపించిన అఖండపరిపూర్ణమే పరమయోగులైనవారు స్వానుభవమున పొందుదురు. అట్టివారు దేశ కాల వస్తుభేదములు చూడక నామరూపరహితమును ఆత్మానుభవమును, నిత్యమును, అఖండ పరిపూర్ణానందమును నగు అమృతస్వరూప విశేషముచేత రాకపోకలులేని శాశ్వత పరమపదమును పొందెదరు.

మూ. గర్భ జన్మ జరా మరణ సంసార మహద్భయా
త్సన్తారయతి తస్మా త్తారక మితి, జీవేశ్వరౌ
మాయికా వితివిజ్ఞాయ సర్వవిశేషం నేతి నేతి
విహాయ యదవశిష్యతే త దద్వయం బ్రహ్మ
గురుభక్తి సమాయుక్తః పురుషజ్ఞో విశేషతః
ఏవం లక్షణసంపన్నో గురి రిత్యభిధీయతే.

తా. గర్భ జన్మ జరా మరణ దుఃఖము లనువీనితో గూడినసంసారమనెడుమహాభయమునుండి దాటునట్లు చేయుచున్నది. (తరింపజేయునది గాన తారకమని చెప్పబడెను.)

జీవేశ్వరులు మాయాసంబంధము గలవారు. అని తెలిసికొని సకలవిశేషములను 'నేతి నేతి' లేదు లేదు. ఇదికా దిదికాదు అని చెప్పగా ఏదిమిగులుచున్నదో అదియే అద్వయపరబ్రహ్మము.

గురుభక్తిగలవాడు, గొప్పఆత్మజ్ఞానము కలవాడు నగునట్టి లక్షణసంపన్నుడే గురువని తెలియుము.

మూ. రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరంతపః
రామ ఏవ పరంతత్త్వగ్‌ం శ్రీరామో బ్రహ్మతారకమ్.

తా. శ్రీరాముడే సాక్షాత్తు పరబ్రహ్మము. పరతత్త్వమునుగూ చేయు తపస్సుకూడా ఆ శ్రీరామచంద్రమూర్తియే, నామరూపరహితమైన ఆపరతత్త్వమే ఆరాముడు. అయ్యఖండ పరబ్రహ్మమును తెలసికొనుటకు, నీవు తారకమేయని బోధించుటకును అవతారమూర్తియని చెప్పబడు ఆ శ్రీరామచంద్రమూర్తియే నిజస్వరూపమైన బ్రహ్మమని తెలియవలెను; కాని దశరథునకు పుట్టిన (దశేంద్రియములతో గూడిన. జీవత్వము కాదని తెలియవలెను.

సాక్షాత్తు శ్రీరామచంద్రమూర్తియే అఖండపరిపూర్ణ బ్రహ్మమని నమ్మవలెను.

మూ. రామో రమన్తే యత్ర యోగినః॥

తా. దురంతమును, దాటశక్యముగానిదియు, గంభీరమైనదియు ... సంసారసముద్ర మెండమావు లనునీటితో నిండియుండును. అందు క్రూర రూపములగు జలజంతువు లనవరతము పీల్చి పిప్పిచేసి భక్షించుచుండును. అట్టియగాధమునుండి బయల్పడుటయే బయలుగాని ఆకాశము బయలు కాదు. సద్గురు కటాక్షముచేత సాధనచతుష్టయసంపన్ను లగు యోగులుమాత్ర మయ్యగాధ సంసారమును దాటి తమ నిజస్వరూపమునందు రమించుచుందురు.

అట్టిమహాయోగుల హృదయములందు రమించుపదార్థమే శ్రీరామచంద్రమూర్తిగాని దశరథునకు బుట్టి దశేంద్రియములతోగూడిన జీవత్వము కాదని నమ్మవలెను.

మూ. ఆద్యోరా తత్పదార్థస్స్యా న్మకార స్త్వంపదార్థవాన్
తయోస్సంయోజనమసీత్యర్థే తత్త్వవిదో విదుః॥

తా. రా, యను నక్షరమునకు తత్పదలక్ష్యార్థమైన నిరాకార పరబ్రహ్మమే యర్థము. మ, యను నక్షరమునకు త్వం పదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మయే యర్థము. కాన రామ యనగా నిరాకార పరబ్రహ్మమే. ఒక్కొక్క జీవజంతువునందును సాక్షిమాత్రముగా, ఆత్మస్వరూపముగా నున్నదనియు, బ్రహ్మాత్మాభేదైక్యముగా నున్నదనియు నెఱుంగవలెను. కాన దేహత్రయసాక్షిగా నుండు ఆత్మయే శ్రీరాముడని నమ్ముము.

మూ. తత్త్వమస్యాది వాక్యంతు కేవలం ముక్తిదం యతః
రామమన్త్రార్థ విజ్ఞానీ జవన్ముక్తో నసంశయః
రామమన్త్రాణాం కృతపురశ్చరణో రామచన్ద్రో భవతి.

తా. తత్త్వమస్యాది మహావాక్యములకు విలక్షణమై శేషించిన పదార్థమును తెలియుటయే ముక్తి యనబడును.

శ్రీరామ మంత్రములోని యర్థము నిత్యానిత్య వస్తువిచారణచేసి నామరూపరహితమైన పదార్థమును తెలిసినవారు (మంత్రరహస్యములో నైక్యమందినవారు) బ్రతికియుండగనే (మంత్రమును జపించునపుడు నేను మంత్రమును జపించుచున్నాను. అను తెలివి లేకుండ మంత్రములోని వాచ్యార్థమును విడచి లక్ష్యార్థమగు మంత్రరహస్యములో నెప్పుడు కలియుచున్నారో అప్పుడు) పొందశక్యముగాని ముక్తిని పొందుచున్నారు. అదియే జీవన్ముక్తి యనబడుచున్నది.

శ్రీరామమంత్రము నెవరు సద్గురువు చెప్పినప్రకారము నేను జీవుడను కాను ఆ శ్రీరామచంద్రమూర్తియే నేను అను నిశ్చయజ్ఞానముతో చేయుదురో వారు శ్రీరామచంద్రమూర్తియే అగుచున్నారు. అట్టి వారు కర్మలుచేయ నవసరములేదు.

మూ. రమన్తే యోగినోఽనన్తే నిత్యానన్దే చిదాత్మని
ఇతిరామపదే నాసౌ పరం బ్రహ్మాభిధీయతే

చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా
రూపస్థానాం దేవతానాం పుంస్త్ర్యంగాదికల్పనా॥

తా. సాధన చతుష్టయసంపన్ను లగు యోగుల హృదయాంతరాళమున నిత్యమును ఆనందముగ నుండుటచే చిదాత్మయనియు, ఆత్మారాము డనియు పేరుగలిగెను. అట్లు రమించు పదార్థమే సాక్షాత్పరబ్రహ్మమని బుద్ధిమంతులు వివేకజ్ఞానముచే తెలియుదురు. అట్టి చిన్మయస్వరూపము ఏకవస్తువేకాని ద్వైతముకాదు. ఏకళంకములేనిదై వెలయుచున్నది.

ఈ శరీరమందుండియు శరీరధర్మములు ఏవియును అంటకపోవుటచే చిదాత్మ అశరీరిగ నెన్నబడుచున్నది. అట్టిస్థితిలో నజ్ఞానుల నుద్ధరించుటకును, ఉపాసకోటికును బ్రహ్మస్వరూపముగా కల్పన అయినది. అనేక రూపములు. దేవతలు, స్త్రీలు, పురుషులు, శాస్త్రములు అనేకములుగా కల్పింపబడినవి. ఈకల్పనఅంతయు మిథ్య యని తెలియవలెను.

మూ. ఏవంభూతం జగదాధారభూతం
రామంవన్దే సచ్చిదానన్దరూపం.

తా. సర్వభూతజగజ్జాలమునకు ఆధారుడును, వివేకముచే చూచిన యెడల జాతమునకు లోపలను వెలుపలను నిండిన అఖండస్వరూపుడును, సచ్చిదానంద స్వరూపుడును నగు శ్రీరామచంద్రమూర్తియే యని తెలిసికొని నమస్కారము చేయవలెను. సర్వభూతములును సచ్చిదానందమేయని నమ్మవలెను.

మూ. నాన్తఃప్రజ్ఞం నబహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం
నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట మవ్యవ

హార్య మగ్రాహ్య మలక్షణ మచిన్త్య మవ్యపదేశ్య
మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాన్తం శివ
మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః.

తా. తురీయాతీతుడగు ఆత్మను ఆత్మజ్ఞానఘనులు అంతఃప్రజ్ఞ కలవాడుకాడనియు, బాహ్యప్రజ్ఞకలవాడుకాడనియు, జాగ్రత్స్వప్నావస్థలకు మధ్యభాగావస్థయందుండు ప్రజ్ఞకలవాడుకాడనియు, ఒకేసారి సర్వవిషయప్రజ్ఞకలవాడుకాడనియు. జ్ఞానేంద్రియములకైనను గోచరింపని వానిగను, వ్యవహారమునకు యోగ్యము కానివానిగను, కర్మేంద్రియములచేత గ్రహింపవీలులేనివానిగను, గురుతులేనివానిగను, చింతింపనలవిగానివానిగను, శబ్దములచేచెప్ప వీలులేనివానిగను, స్థానత్రయమునందును ఈఆత్మఒక్కడే అనెడి అచంచలజ్ఞానముచే ననుసరింప తగిన వానిగను, జాగ్రదాది ప్రపంచవిరహితునిగను, శాంతమైన వానిగను, నిజస్వరూపునిగను, భేదవికల్పవిరహితునిగను తలంచుచున్నారు. ఆ ఆత్మయే తెలియతగినవాడును, కల్పితమగు పాదత్రయమునకు విలక్షణముగా తోచువాడును నగు ఆ తురీయుడే ఆత్మ. అతడే తెలియతగినవాడు.

అవిద్యావశముచేత రజ్జువునందు తోచుచున్న సర్పాదికముకంటె భిన్నముగా రజ్జువెట్లున్నదో అట్లే తత్త్వమసీత్యాది మహావాక్యములయందాత్మపదార్థము తెలియతగినది, తెలిసికొనదగినది యని చెప్పినప్పుడు ద్వైత మున్నట్లు తోచుటలేదా యని సంశయము కలుగవచ్చును; కాని అవిద్యావస్థయందైనచో ద్వైతముండుటయే సహజము. అట్లగుటచే విద్యావస్థయందు ద్వైత ముండజాలదుగదా!

మూ. సర్వాణ్యపినశ్యన్తి రామచన్ద్రానుకీర్తనాత్
భూతప్రేత పిశాచాద్యాః కూష్మాండ గ్రహరాక్షసాః

దూరాదేవ ప్రభావన్తి రామమన్త్రప్రభావతః
ఇహలౌకిక మైశ్వర్యం స్వర్గాద్యం పారలౌకికం
కైవల్యం భగవత్త్వంచ మన్త్రోఽయం సాధయిష్యతి
గ్రామారణ్య పశుఘ్నత్వం సంచితం దురితంచ యత్॥

తా. సర్వజనులకును శ్రీరామమంత్రము జపించుటవలన క్రూరం గ్రహ, రాక్షసాది దుష్టగ్రహబాధలును, భూతప్రేత పిశాచాది సకల బాధలును దూరముగ తొలగిపోవుచున్నవి. శ్రీరామ మంత్ర జప మహిమవలన ఇహపర సుఖములన్నియు బాగుగనుండును. మరియు జన్మజన్మాంతరాయాతములగు దుష్ట జన్మదోషములు, పశుబుద్ధిమున్న ప్రారబ్ధమంతయు పోయి గొప్ప సుఖము కలుగు నని నమ్మవలెను.

మూ. ఏకోవిష్ణు రనేకేషు జఙ్గమస్థావరేషుచ,
అనుస్యూతో వసత్యాత్మా భూతేష్వహ మవస్థితః
తైలంతిలేషు కాష్ఠేషువహ్నిః క్షీరేఘృతం యథా
గన్ధఃపుష్పేషు భూతేషు తథాఽత్మాఽవస్థితో హ్యహమ్.

తా. నేనొక్కడనే సర్వవ్యాపకుడనై సకలచరాచరములయం సకల భూతములయందును "వాసుదేవ స్సర్వమితి" యనునట్లును, "స భూతనివాసోఽసి, శ్రీవాసుదేవ నమోస్తుతే" యనునట్లును ఆత్మ నుగా వసించుచున్నాను.

నువ్వులయందు నూనెవలెను, కట్టెలయం దగ్నివలెను, పాలయందు నేయివలెను, పువ్వులయందు పరిమళమువలెను, నేను సర్వభూతములయం దాత్మగ నున్నాను.

మూ. తద్బ్రహ్మ తాపత్రయాతీతం, షట్కోశవినిర్ముక్తం,
షడూర్మివర్జితం, పంచకోశాతీతం, షడ్భావవికారశూన్య

మేవమాది సర్వవిలక్షణం భవతి,
కుల గోత్ర జాతి వర్ణాశ్రమరూపాణి వ్రభ్రమాః॥

తా. ఆపరబ్రహ్మము తాపత్రయములు లేనివాడు. మూలాధారాది కోశధర్మములు లేనివాడు. పుట్టుట పెరుగుట మొదలగు షడూర్ములు లనివాడు. అన్నమయాది పంచకోశములకు విలక్షణుడు. ఆకలి దప్పిక మొదలగు ప్రాణధర్మముల వికారములు లేనివాడు. ఈ సర్వధర్మములు లేక శూన్యమైనవాడు. దేహత్రయమునకును సర్వవిలక్షణుడు నని అలియవలెను.

కులము, గోత్రము, జాతి, వర్ణము, ఆశ్రమము, రూపమునను సర్వ భ్రమలను వీడినగాని జనన మరణ రహితమైన సామ్రాజ్యపదవి లేదని అలియుము.—నేను ఈకులమువాడను. మాది ఈగోత్రము, మాది ఈజాతి, మేము బ్రాహ్మణులము, వారు శూద్రులు, నే నింత చక్కని రూపముగలవాడను అను భ్రమలలో మునిగినవారికి మోక్షము దూర మగును. మాది సన్యాసాశ్రమము, మే మింద్రియనిగ్రహము గల వారము. మీరు గృహస్థులు-మీకు మోక్షములేదు. మీరు స్త్రీలు-మూ కర్మశిలేను, సంసారమునం దుండి తరించుట కష్టము నను శ్రమభ్రమలు వీడునంతవరకును మోక్ష మనునది లేదు. ఈభ్రమలు పరమాత్మకు లేవని తెలియవలెను.

మూ. భ్రమేణాహం భ్రమేణత్వం భ్రమేణోపాసకం మనః
భ్రమేణేశ్వరభావత్వం భ్రమమూల మిదంజగత్.
కామ క్రోధ లోభ మోహేర్ష్యాదిభి రబాధితో
భవతి, సర్వేభ్యః పాపేభ్యో ముక్తో భవతి, ఇహా
జన్మని పురుషోభవతి; తస్మాదేత త్పురుషసూక్తార్థ
మతిరహస్యం రాజగుహ్యం దేవగుహ్య మతిగుహ్యాత్తరమ్॥

తా. నీవు నేను నాబడు జీవులును, మనస్సు, జగత్తును, ఈశ్వరుడును ననుసకలము మాయాభ్రాంతియేకాని సత్యముకాదు. కావున మీరు సమస్తసందేహములను విడనాడి భ్రాంతిరహితులై సదా స్వస్వరూపమునందే రమించుచుండవలెను. భ్రాంతియుతమగు జగత్తంతయు మిథ్యయనియు బ్రహ్మము సత్యమనియు నమ్మవలెను.

కామక్రోధాది క్రూరసర్పము లారు నెవరిని బాధించకయుండునో వారు వీరనుభేద మేరికి లేకుండునో! అట్టివార లెవ్వరైనను పాపవిము క్తులై యాపురుషుడే యగుచున్నారు. పురుషసూక్తములో నున్న అతిరహస్యమును మహారాజులైనను దెలియలేరు. రజోగుణ మెంత స్వల్పముగ నుండినను రాజులే యగుచున్నారు. రజోగుణము గలవారు పురుషతత్త్వము నెఱుంగజాలరు. ఆ పరమపురుషస్వరూపము రహస్యముకన్న రహస్యమైయున్నది. అనుభవజ్ఞులకే ఆ రహస్యము తెలియునుగాని ఇతరులకు తెలియదు.

మూ. తత్రాహింసానామ మనోవాక్కాయకర్మభి స్సర్వ
భూతేషుసర్వదా క్లేశజననం॥

తా. అహింస: సర్వకాలములయందును సర్వభూతములకు మనో వాక్కాలచేగాని, క్రియలచేగాని హింసచేయరాదు.

మూ. దయానామ సర్వభూతేషు సర్వత్రానుగ్రహః,
క్షమానామ ప్రియాప్రియేషు సర్వేషు తాడన
పూజనేషు సహనమ్॥

తా. సర్వభూతములయందును, సర్వకాలములయందును దయకలిగి యుండవలెను. శత్రుమిత్రులయందు సమానముగనుండి, ఒకరు పూజించినను ఒకరు నరుకవచ్చినను ఒకే మాదిరిగా నుండవలెను.

భూతదయకలవారలే పరమాత్మకిష్టు లగుదురు.

మూ. మితాహారనామ చతుర్థాంశావశేషక సున్నిగ్ధ
మధురాహారః—
యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహా
యత్కేవలం జ్ఞానగమ్యం॥

తా. మితాహారము: కడుపు నిండునట్లుతినక మూడు భాగములు ఖాళీగానుంచవలయును. జలమున కొక భాగము, వాయువున కొక భాగము, అన్నమున కొక భాగము విభజించి యొక భాగము ఖాళీగానుంచ లెను. సాధకు డాసాల్గవభాగమందు స్వేచ్ఛగా సంచారముచేయవచ్చును. తాత్కాలికముగా అప్పటికప్పుడు తటస్థమైన మధురపదార్థములను తీసుకోవచ్చును.

మనస్సుతోగూడిన వాగాదిసర్వేంద్రియములు ఏ పరమాత్మను పొందజాలక మరలిపోవుచున్నవో! అట్లు మరలిపోయిన తరువాత ఇమించిన కేవలజ్ఞానమే పొందవలసినదని తెలియువలెను.

మూ. అథాఽహ పైఙ్గలో యాజ్ఞవల్క్య ముపసమేత్య
ద్వాదశవర్ష శుశ్రూషాపూర్వకం పరమరహస్యకైవల్య
మనుబ్రూహీతి పప్రచ్ఛ— సహోవాచ యాజ్ఞవల్క్యః
స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్ తం నిత్యముక్త
మవిక్రియం సత్యజ్ఞానానన్దం పరిపూర్ణం సనాతన
మేక మేవాద్వితీయం బ్రహ్మ.

తా. పైంగలు డనుమహర్షి ద్వాదశవర్ష శుశ్రూషాపూర్వకముగా యాజ్ఞవల్క్యఋషి నాశ్రయించి పరమరహస్యమైన కైవల్యము నా కుపదేశింపుమని ప్రార్థింపగా నతఁ డామోదించెను. పిదప ఇట్లు చెప్ప

చున్నాడు. సృష్టికిపూర్వము సద్వస్తువుమాత్రమున్నది. అయ్యా దేవ సంబంధమునులేనిది. వికారరహితము, సత్యము, ప్రకాశము, ఆనందము మున్నగునవి స్వరూపముగాగలది. మఱియు సనాతనము, ఏకవస్తు సర్వవ్యాపకము నై వెలయు బ్రహ్మమే ఆత్మయనబడును. ఇదియే తెలియతగిన పూర్ణాత్మయని చెప్పెను.

మూ. సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనా మన్తే
నృణాం మోక్షేచ్ఛా జాయతే.
యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర పరంపదమ్
తత్ర తత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్.

తా. అనేకములగు జన్మలయందు దానధర్మములు, జప తప యాగాది సత్కర్మలు చేయుటవలన కడపట ఒకానొక జన్మమునం దుత్తమమైన మానవజన్మ మెత్తి ఒకసద్గురువును వెతకి, కనుపట్టి (బా గురువా? బోధగురువా? యని) యాతనివలన దెలియవలసిన రహ మును దెలిసికొనును. ఎక్కడెక్కడ మనం బమనస్క మగునో! అక్కడ నక్కడనే పరమపదము దొరుకును. అదియే పరబ్రహ్మము.

మనం బెచట లయమగునో యచటనే బ్రహ్మము; కాని ఎప్పుడో ఎక్కడనో! దేహపతనానంతరము పొందడమనునది కల్ల. పరమపు మనునది మన యనుభవము నందే (సుజ్ఞానము) యున్నది. కాని దేహము విడిచిన తరువాత కాదు.

ప్రయత్నించినచో మోక్షము కరతలామలకసదృశము!

మూ. వృక్షమూలే, శూన్యగృహే, శ్మశానవాసినో వాసామ్బరా
వా, దిగమ్బరావా-న తేషాం ధర్మాధర్మౌ, లాభాలాభౌ,
శుద్ధాశుద్ధౌ ద్వైతవర్జితా స్సమలోష్టాశ్మకాంచనా

స్సర్వవర్ణేషు భైక్షాచరణౌ కృత్వా సర్వత్రాఽఽత్మైవేతి
పశ్యన్తి.

తా. ఆత్మస్థానములో హృదయము సంకల్పశూన్యము చేయుట శూన్యగృహము. విషయములన్నియు జ్ఞానాగ్నిచే భస్మమైనస్థానమే శ్మశాననివాసము. ఆడంబరము లేకుండుటయే జీవత్వము. అంతయును విడనాడుటయే దిగంబరత్వము.

ధర్మాధర్మములయందును, లాభాలాభములయందును, శుద్ధాశుద్ధములయందును సమముగ వర్తించువాడును, ద్వైతమువిడచి ఏకత్వమందినవాడును, బంగారమునందును మట్టియందును సమభావమున నున్నవాడును, ఏవర్ణమువారికడనైనను భిక్షాన్నముచే కాలముగడిపినవాడును, సర్వమునందును ఆత్మనే (తనఆత్మను) చూచినవాడును తురీయుడనబడును.

మూ. గురుశాస్త్రోక్తమార్గేణ స్వానుభూత్యాచ చిద్ఘనే
బ్రహ్మైవాఽహ మితిజ్ఞాత్వా వీతశోకో భవేన్మునిః
దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాంవినా.

తా. గురువు చెప్పినప్రకారము శాస్త్రమందలి రహస్యార్థమును తెలిసికొని యాప్రకారమెవరు నిజమార్గమున చొంతురో, వారికి తమ నిజస్వరూపానుభవముకలిగి ఆత్మస్వరూపము స్ఫుటముగను ఘనముగను గోచరించును. ఆపైన బ్రహ్మరూపమే తానగును. సాధకుండగు నా జ్ఞాత శోకమోహములు వీడినవాడై మహామునియై యుండును; రెండవ వస్తువులేనందునను, ఏసంకల్ప వికల్పములులేనందునను అట్టి నిర్మల స్థితిలో నుండుటయే మౌనము; కాని పైకి మాట్లాడకయుండి మనస్సు

పనిచేయుచుండుట ప్రధానముకాదు. కావున నిర్మలత్వమే ప్రధానమనబడును.

విషయములు విడుచుటదుర్లభము. ఆత్మతత్వము తెలియుటయు దుర్లభము. తనయొక్క నిజస్వరూపము తెలియుటయు దుర్లభము. సద్గురుమూర్తి కరుణాకటాక్షములేనిదే అంధకారబంధము విడదు కావున మందాధికారుల బోధకొఱకు అజ్ఞానాంధకారములోనుండి బైటపడుటకు లోకదృష్టాంతమొకటి ఉదహరింపబడుచున్నది. ఇది దశదృష్టాంతమని వాడుకకలదు.

ఒకప్పుడొక గ్రామమునుండి పదుగురు గ్రామాంతరము పోవుచునుండిరి. మధ్యేమార్గమునందగాధమును, వేగమునుకలిగి ప్రవహించుచున్న ఒకనది అడ్డుతగిలెను. అంత ప్రయాణము చేయుచున్న పదిమందియు శ్రమకోర్చి నదిలోదిగి చేతులతో శక్తి కొలది యీది నది కావలితీరము చేరిరి. పిదప బయలుదేరిన పదిమందియు వచ్చిరా, లేదా! అనుసందియముతోచి వలయాకారముగ నిలువబడిరి. అందొకడు లెక్కింప మొదలుపెట్టెను. తన వామభాగమునందున్నవానితో ప్రారంభించి లెక్కింపగా తనకుడి భాగమందున్నవాడు తొమ్మిదవవాడైనాడు పదిమంది వచ్చితిమి, ఇప్పుడు తొమ్మండుగురము మాత్రమే యుంటిమి. మనలో దశముడు నదిలో మునిగిపోయెనని లెక్కించినవాడు వారికి చెప్పగా అందరును దశముడులేడని నిశ్చయించుకొని వానినిగుఱించి దుఃఖించుచుండిరి.

అప్పుడామార్గమున వచ్చిన యొకబాటసారి విచారగ్రస్తులగు వారిని గాంచి, దయాళుడై, దగ్గఱి, వారి విచారణకారణ మరసి, యాలోచించి, పరికించి, వారి యజ్ఞానమునకచ్చెరువంది, వారి యజ్ఞానమును వారికి దెలియజేయ నూహించి, వారిని బిలిచి, మొదట లెక్కించినప్రకారము

వలయాకారముగ నిలుపబెట్టి, మీలో దశముడున్నాడు భయపడకు డనియెను.

అమృతోపమానమగు యాతని వాక్యమాలకించి యచ్చెరువందుచు నందరునుగలసి మహాత్మా! మాలో పదియవవాడు మీకగుపడెనా? యని దీనముగా బ్రార్థించిరి. అపుడానూతనపురుషుడు వెనుకటిలీరుననే లెక్కించి ఆ లెక్కించినవానినిగూడ చూపుచు నీవే దశముడవని తెలియు నట్లు బోధించి చనియెను. అంత వారు తమవివేకమును గ్రహించి సిగ్గుపడుచు నాతనికి నమస్కరించి చనిరి. ఇ యిత్యితిహాసమునం దజ్ఞా నాది సప్తావస్థలున్నవి. చూడుడు:—

దశముడు నదిలో మునిగిపోయినాడని వానినిగురించి విచారించుట యజ్ఞానము; అపమార్గముగా లెక్కించి దశముడు లేడనుకొనుట ఆవర ణము; వానినిగురించి విలపించుట విక్షేపము; నూతనబాటసారి మీ దశము డున్నాడని చెప్పుటతోడనే కొంతసంతసించుట పరోక్షజ్ఞానము; క్రమముగ లెక్కింపచేసి నీవే దశముడవని బోధించినంత తానే దశముడ నని సంశయ విపర్యరహితమైన నిశ్చయజ్ఞానము కలుగుట అపరోక్ష జ్ఞానము; ఈ పరోక్షాపరోక్ష జ్ఞానద్వయమువలన వెనుకటి విలాపాదు లనుదలచి సిగ్గుపడుట శోకనివృత్తి; అందర మున్నారమని సంతసించుట తృప్తి; ఇటులనే బ్రహ్మవేత్తలగు గురువులచే మహావాక్యార్థ బోధనంది యద్దాన తామే బ్రహ్మస్వరూపుల మనుజ్ఞానము పరోక్షాపరోక్ష జ్ఞానద్వయముకలిగి అజ్ఞానావృత విక్షేపాదులను వదలి, శోకనివృత్తియు నఖండతృప్తియుకలిగి జీవన్ముక్తు లగుచున్నారని తెలియబడుచున్నది.

మూ. ఇమాం సప్తపదాం జ్ఞానభూమి మాకర్ణయానఘ!
నానయాజ్ఞాతయాభూయో మోహపఙ్కే నిమజ్జతి
వదన్తి బహుభేదేన వాదినో యోగభూమికాః

మమత్వాభిమతా నూన మిమాఏవ శుభప్రదాః
అవబోధ్ధంహి దుర్జ్ఞానం తదిదం సాప్తభూమికమ్
ముక్తిస్తు జ్ఞేయమిత్యుక్తం భూమికా సప్తకాత్పరమ్.

తా. ఋషికుమారుడ వగునో నిదాఘా! ఈజ్ఞానభూమికాసప్తక మును వినుము. ఇది తెలిసికొనినవారు తిరిగి మోహపంకమునందు మునుగరు. తిరిగి వారిని అజ్ఞాన మావరింపదనుట నిశ్చయము. బ్రహ్మ వాదు లియ్యజ్ఞాన భూమికాసప్తకమును అనేకవిధములుగా చెప్పిరిగాని నాకు ఈసప్తవిధములే ఇష్టములుగానున్నవి. ఈ జ్ఞానభూమికాసప్త కము తెలిసికొనుట దుర్లభముగ నున్నది. ముక్తికిసాధనమయి జ్ఞానా భ్యాసముగానున్న విముక్తియనునది జ్ఞానభూమికాసప్తకముకంటె పర మైనదై జ్ఞేయరూపముగా నున్నది.

మూ॥ జ్ఞానభూమి స్సుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా
విచారణాద్వితీయాతు తృతీయా తనుమానసీ
సత్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతో సంసక్తినామికా
పదార్థభావనాషష్ఠీ సప్తమీ తుర్యగాస్మృతా
ఆసామంతస్థితాముక్తి ర్యస్యాంభూయో నశోచతి
ఏతాసాంభూమికానాం త్వ మిదం నిర్వచనం శృణు.

తా. 1 సుభేచ్ఛ ప్రథమము. 2 విచారణ ద్వితీయము. 3 త మానసి తృతీయము. 4 సత్వాపత్తి చతుర్థము. 5 సంసక్తినామి పంచమము. 6 పదార్థభావన షష్ఠమము. 7 తుర్యావస్థాప్రా సప్తమము. ముక్తియనునది ఈ సప్తావస్థలలో నిమిడియున్నది.

1 సుఖేచ్ఛా లక్షణము:—

మూ. స్థితః కిం మూఢఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః
వైరాగ్యపూర్వ. మిచ్ఛేతి సుఖేచ్ఛే త్యుచ్యతేబుధైః॥

తా. మూఢుడనై యున్నాను. శాస్త్రములచేతను, సజ్జనులచేతను, బ్రహ్మవస్తువును దెలిసికొని యావస్తువును చూడవలయుననెడి ప్రాపంచిక వైరాగ్యము కలిగి జనించిన బుద్ధి సుఖేచ్ఛయనబడును.

2 విచారణా లక్షణము:—

మూ. శాస్త్రసజ్జనసంపర్క- వైరాగ్యాభ్యాసపూర్వకమ్
సదాచార్యప్రవృత్తిర్యా ప్రోచ్యతే. సా విచారణా.

తా. వైరాగ్యాభ్యాసముకలిగి గురువులవలనను, శాస్త్రముచేతను ఆత్మానాత్మవిచారణ చేయుటయే విచరణనాబడును.

3 తనుమానసి:—

మూ. విచారణాసుఖేచ్ఛాభ్యా మిన్ద్రియార్థేషురక్తతా
యత్రసా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసీ॥

తా. వైరాగ్యవిచారణలవలన నింద్రియవిషయములందు విరక్తి కలిగి మనోవృత్తి తగ్గుటయే తనుమానసి యనబడును.

4 సత్వాపత్తి:—

మూ. భూమికాదిత్రయాభ్యాసా చ్చిత్తేతు విరతీర్వశాత్
సత్వాత్మని స్థితాశుద్ధే సత్వాపత్తి రుదాహృతా.

తా. వెనుకటిభూమికా త్రయాభ్యాసమువలన చిత్తము విశ్రాంతి పొందియుండగా సద్వస్తువు ఆత్మరూపముగా దృఢజ్ఞానము కలిగి యుండుట సత్వాపత్తి యనబడును.

5 సంసక్తి నామిక:—

మూ. దశా చతుష్టయాభ్యాసా దసంసర్గ ఫలాతు యా
రూఢసత్వచమత్కారా ప్రోక్తా సంసక్తినామికా.

తా. ఈ జ్ఞానమువలన మరియొకఫల మున్నదని కోరక వెనుకటి నాలుగవస్థలబలమున తానే ఆత్మస్వరూపుడనని దృఢజ్ఞానము కలుగుట సంసక్తి యనబడును. సకలసంశయములు వదలి 'అహంబ్రహ్మాస్మి' యను నట్లు నేనే బ్రహ్మస్వరూపుడ నని తెలియుటయే యీజ్ఞానమునకు ఫలము గాని యింతకన్న వేరుఫలములేదు. ఈజ్ఞానము కలుగుటయే అమృతత్వసిద్ధి. ఆబ్రహ్మవస్తువునకు జననమరణాదులులేవు. ఇవి మాయాలక్షణములు. ఆబ్రహ్మకు మాయాసంబంధ మెన్నడునులేదు. అసంగుడని శ్రుతిసిద్ధము.

ఈఅవస్థ కలిగినయెడల తిరిగి మాయాసంబంధము కలుగదని తాత్పర్యము.

6 పదార్థభావన:—

మూ. భూమికా పంచకాభ్యాసా త్స్వాత్మారామతయా దృఢమ్
అభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్.
పరప్రయుక్తేన చిరం ప్రయత్నే నావబోధనమ్
పదార్థభావనా నామ షష్ఠీభవతి భూమికా.

తా. వెనుకటి దశాపంచక జ్ఞానమువలన బ్రహ్మస్వరూపమైన ఆత్మ యందు విశ్రాంతిని దృఢిగపొంది, బాహ్యాభ్యంతర పదార్థములను స్మరిం

పక పరులచే బోధింపబడినప్పుడు మాత్రము వ్యవహారజ్ఞానము కలుగుట పదార్థభావన యనబడును, పదార్థము బ్రహ్మస్వరూపము. దానిని మాత్రము భావించుట, తలంచుటయేకాని అంతకన్న వేరుగానున్న బాహ్యాములు పంచ భూతమయములు. ఆంతర్యములు, ఇంద్రియాదులు నివియన్నియు బ్రహ్మవస్తువునందు లీనమైనవి. మనస్సు వృత్తిశూన్యమైనది గాన తాత్కాలిక దేహధారణకొఱకు మాత్రము పరులచే బోధింపబడినపుడు లోకజ్ఞానము వీరికి కలుగుచున్నదని తాత్పర్యము.

7 తుర్యగ:—

మూ. భూమిషట్కచిరాభ్యాసా భేదస్యానుపలంభనాత్
యత్స్వభావైకనిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యగాగతిః
ఏషాహి జీవన్ముక్తేషు తుర్యావస్థేషు విద్యతే
విదేహముక్తివిషయం తుర్యాతీత మతఃపరమ్.

తా. బ్రహ్మాకారమైన ఆత్మానుభవముకలిగి, జాగ్రత్తులో ప్రపంచ జ్ఞాన విస్మృతియు బ్రహ్మవస్తువునందు తాదాత్మ్యమును కలిగి బ్రహ్మానంద రస మగ్నుడై యుండుట తురీయపదప్రాప్తి యనబడును. తురీయదార్ఢ్యమే తుర్యాతీత మనబడును. ఈఅవస్థ ముందు విపులముగ చెప్పబడును. ఈ యవస్థ జీవన్ముక్తులయందును, తుర్యావస్థ నందినవారియందును నగుపడును. దేహము తానే యనుజ్ఞానము వదలుటయే విదేహముక్తి. ఇదియే తురీయాతీత మనబడును.

మూ. యే నిదాఘ మహాభాగా స్సప్తమీం భూమి మాగతాః
ఆత్మారామా మహాత్మాన స్తే మహాపద మాగతాః
జీవన్ముక్తా నజీవన్తి సుఖదుఃఖరసస్థితే
ప్రకృతేనాథ కార్యేణ కంచి త్కుర్వన్తి వా నవా.

పార్శ్వస్థబోధితా స్సన్తః పూర్వాచారక్రమాగతమ్
ఆచారమాచరన్త్యేవ సుప్తబుద్ధవ దుత్థితాః.

తా. ఓ నిదాఘఋషీ! ఏ మహానుభావు లీ సప్తభూమికను పొందగలరో; వారు మహాత్ములు: ఆత్మారాములు, ఉత్తమ స్థానగతులు, జీవన్ముక్తులును నగుచున్నారు. వారి జీవితకాలమంతయు బ్రహ్మాకారముగానే యుండునుగాని సుఖదుఃఖరూప సంసారమునం దెంతమాత్రము నుండదు. దేహధారణమాత్రముకొఱకు పార్శ్వమం దున్నవారిచే బోధితులై నిద్రావస్థలో నున్నవారు మేల్కొ-నురీతిని తురీయమునుం జాగ్రత్తులోనికి వచ్చి లోకానుసరణముగా నేకార్యము చేసిన చేయవచ్చును గాని అంతమాత్రమున వారికి మాయాతాదాత్మ్యము కలుగనేరదు

మూ. భూమికాసప్తకం చైతద్ధీమతామేవ గోచరమ్
ప్రాప్య జ్ఞానదశామేతాం పశుమ్లేచ్ఛాదయోఽపియే
స దేహాన్వాప్య దేహాన్తే ముక్తో నాత్రతుసంశయః
జ్ఞప్తిర్హి గ్రన్థివిచ్ఛేద స్తస్మిన్సతి విముక్తతా
మృగతృష్ణాంబుబుద్ధ్యాది శాంతిమాత్రాత్మక స్త్వసౌ.

తా. ఈభూమికాసప్తకము బుద్ధిమంతులకే తెలియును. పశుతుల్యులయినను, మ్లేచ్ఛాదులైనను సప్తభూమికాక్రమము నెఱింగిజ్ఞానావస్థను పొందిరేని, వారు దేహధారణకాలమందును, దేహాంతమునందును ముక్తులనియే చెప్పబడుదురు. ఇందు సందియ మావంతయు లేదు గ్రంథివిచ్ఛేదమే జ్ఞానము. దేహజీవాదులును, ప్రపంచమును సత్యముని నమ్ముటయే గ్రంథి. అవి మాయామయములనియు, అస్వాతంత్రము లనియు, అందిమిడియున్న వానికి సత్తునుకలుగజేయు సచ్చిదానందస్వరూప బ్రహ్మవస్తువు నిజమైనదనియు నెఱింగి అదియే తాన తెలిసికొనుటయే గ్రంథివిచ్ఛేద మనబడును.

ఈ జ్ఞాన మతికష్టమని తోచునుగాని అతిసులభము ఎండమావుల లోని యుదకమువలె నగుపడును. అయ్యది భ్రమగావున నాభ్రమానివృత్తియే నిజస్థితిగానున్నది గాన మనోవృత్తిశాంతియే జ్ఞానదశగా నున్నదని తాత్పర్యము.

మూ. చిదైచ్ఛత్యకలితో బన్ధః తన్ముక్తౌ ముక్తి రుచ్యతే
చిదచైత్యాఖిలాత్మేతి సర్వసిద్ధాన్తసంగ్రహః.

తా. జ్ఞానస్వరూపమగు ఆత్మను అనాత్మమైన శరీరముగ భావించుటయే బంధము. అనగా:-ఆత్మానాత్మ వివేకాది ఆత్మధర్మములైన సత్య జ్ఞానానంద లక్షణములు శరీరమునకును, శరీరధర్మములైన అనృత జడ దుఃఖాది లక్షణములు ఆత్మకును కలిగియుండునట్లుగ నధ్యాసము చేసికొనుటయే అనాదిమైన సంసారబంధము. అట్టి అధ్యాసమును విడిచిపెట్టుటయే మోక్షమనబడును.

62 శ రీ ర

మూ. అహింసా సత్య మస్తేయం బ్రహచర్య పరిగ్రహః
అక్రోధో గురుశుశ్రూషా శౌచ స్సన్తోష ఆర్జవమ్
అమానిత్వ మదంభిత్వ మాస్తికత్వ మహింసతా
ఏతే సర్వగుణా జ్ఞేయా స్సాత్వికత్వవిశేషతః.

తా. పరులను మాటలనైనను హింసింపకుండుట, ఇతరుల ...వ్యమునం దభిలాషలేకుండుట, కోపములేకుండుట గురుశుశ్రూష, శౌచము, దేహశుద్ధి, మనశ్శుద్ధి, సంతోషము, తన్ను తాను శ్లోత్రము ..కొనకుండుట, డంబము లేకుండుట, శ్రద్ధ, సద్గురువునందు శాస్త్రము దు నమ్మిక, పరులకు కీడుచేయకుండుట, ననునివి యన్నియును త్త్వికగుణము గలవానియొక్క లక్షణములని తెలిసికొనవలెను.

## 63 యోగశిఖ

మూ. పతితా శ్శాస్త్రజాలేషు ప్రజ్ఞయా తేనమోహితాః
స్వాత్మప్రకాశరూపం తత్ కింశాస్త్రేణ ప్రకాశ్యతే
నిష్కలం నిర్మలం శాన్తం సర్వాతీతం నిరామయమ్.

తా. బ్రహ్మచర్యము, గురుకులవాసము, సాధనచతుష్టయ సంపత్తి మున్నగు శాస్త్రవిహితములందు తగినగౌరవములేక నేను వ్యాకరణ సాహిత్యశాస్త్రములందు పండితుడనై యున్నాను. వేదాంతశాస్త్రము రేపటినుండి ప్రారంభించి చదివి తరువాత జ్యోతిశ్శాస్త్రమును చదిదను. అని ప్రజ్ఞలు పలుకుచు ఆ యా శాస్త్రములయం దేమేమో తాము పండితులైనట్లును, అట్లే వేదాంతశాస్త్రమునందును పాండిత్యము గడించినట్లును అజ్ఞానవశముచే తలంచువారలు పతితులు. అట్టివా స్వయంప్రకాశమైన ఆత్మస్వరూపమునాబడు బ్రహ్మము సాధనసంపత్తిలే కేవల శాస్త్రపఠనమాత్రజన్య జ్ఞానముచే లభించునా!

అట్టి బ్రహ్మము నిష్కళము. అనగా: ప్రాణాది షోడశకళలును నిరచిన తరువాత నిప్ప్రతియోగిక బ్రహ్మ మాత్రముగనే ప్రకాశించుచున్నదని భావము.

మూ. పిపీలికా యథాలగ్నా దేహే ధ్యానా ద్విముచ్యతే
అసౌ కిం వృశ్చికై ర్దష్టో దేహాంతే వా వధంసుఖీ
తస్మాన్మూఢా నజానన్తి మిథ్యాతర్కేణ వేష్టితాః ॥

తా. ఆభాసః జ్ఞాని తనదేహమునందు చీమపాకినయెడల వెంటనే అబ్బాయని అతిజాగ్రత్తగా వెతకి దానిని తీసిపారవేయుచున్నాడు. ఇట్టి వానికి తేలు కుట్టినప్పుడును, దేహావసాన సమయమునందును సుఖముగ నుండునని యెట్లుచెప్పగలము. కనుక బ్రహ్మాతిరిక్తముగ స్వదేహమునకు పీడకలుగజేయు పిపీలికాది వృశ్చికాదికము కలదను భ్రాంతిగల

మూఢులు మిథ్యాతర్కముచేత పరివేష్టితులయి పరమాత్మ నెఱుంగ జాలరు.

మూ. అజరామరపిణ్డో యో జీవన్ముక్త స్సఏవహి
పశుకుక్కుటకీటాద్యా మృతిం సంప్రాప్నువన్తివై
తేషాంకిం పిణ్డపాతేన ముక్తిర్భవతి పద్మజ!
స బహిఃప్రతిరాయాతి పిణ్డస్య పతనం కుతః
పిణ్డపాతేన యాముక్తి స్సాముక్తిర్నతుహన్యతే
దేహే బ్రహ్మత్వమాయాతే జలానాంసైంధవంయథా
అనన్యతాం యదాయాతి తదాముక్త స్స ఉచ్యతే
విమతాని శరీరాణి ఇన్ద్రియాణి తథైవచ
బ్రహ్మ దేహత్వమాపన్నం వారిబుద్బుదతామివ.

తా. ఎవని దేహము యోగాభ్యాసబలమున జరామరణ విరహితమై యుండునో వాడే జీవన్ముక్తుడు. దేహము పోయినపిదప లభించునది దేహముక్తియనుట యుక్తియుక్తముగా లేదు. ఏమనగా పశువులు, కోళ్లు, పురుగులుమున్నగువానికి మరణాంతమున దేహపాతము కలుగుచున్నదిగదా? అట్టియెడ వానికి ముక్తి కలుగుచున్నదా ? యోగియగు వానిప్రాణము బైటికిపోవుట లేదుగదా! ఇంక దేహపాత మెట్లుకలుగున్నది!- దేహపాతానంతరము ముక్తికలుగుననుట సరికాదు. దానిని మ్చుట యనవలయునేగాని ముక్తియన జనదు.

వి దేహముక్తి యనగా:- నీటిలోపడిన యుప్పుగెడ్డ జలమయ మెట్లగున్నదో యట్లే దేహము బ్రహ్మత్వమును పొందినదగుచుండగా బ్రహ్మాభిన్నత్వము నెవడు పొందుచున్నాడో వాడేముక్తుడు. పరు దృష్టికి శరీరమనియు, ఇంద్రియములనియు దృష్టియుండిన నుండుగాక

నీరు బుడగరూపము నొందినటులనే బ్రహ్మము దేహత్వమును పొం-దదిగాని బ్రహ్మమునకు భిన్నముగా దేహమనునది లేనేలేదు.

పరులదృష్టియందు గనఁబడుచున్న దేహాభాసాదికమునం దాత్మీయా-మానములేక నిష్ప్రతియోగిక బ్రహ్మమాత్రజ్ఞాన మెవ్వనికి కలుగుచున్నదో అట్టివాఁడే విదేహముక్తుఁడు. స్వాతిరిక్తముగ నేమైనను కలదా? లేదా? యనుసంశయభావము; లేదా స్వాతిరిక్తముగ నేమియు లేదను దృఢభావము కలిగియుండుటయే విదేహముక్తి నాఁబడును కాని వేరుకాదు. ఆత్యంతిక దేహాద్యభిమానములేని జ్ఞానియే దృష్టిచే దేహముగలవానివలె గనుపడినను విదేహముక్తుఁడగుచున్నా-కాని, ఇప్పుడునాకు దేహాదికమునం దాత్మాభిమానము నిజముగాగల కనుక జీవుఁడనగునేను బద్ధుఁడనై యున్నాను. ఇప్పుడు నాకు వ్యావహారి ప్రతిభాసికదృష్టితో చూడఁగా దేహాదికము మిథ్యగా తోఁచుచున్న కనుక నేను జీవన్ముక్తుఁడను కావచ్చును. ఈప్రారబ్ధ దేహపాతానంతరము విదేహముక్తి నాకు చేకూరఁగలదు- అని స్వాతిరిక్తముగ కొం యున్నదని భావించువారలకుమాత్రమే విదేహముక్తి ముందుగ రావలసియుండును.—అయిన నట్టివారలకును దేహపాతానంతరము విదేహముక్తి కలుగవచ్చుననుట యసంభవము. ఏలయన- స్వాతిరిక్తము దేహాద్యాభాసయున్నట్లు కనబడుచున్నది. కాన ఆభావము వారి వాసనాబలముచే ననుసరించి యుండుటవలన నట్టియాలోచనా-యెంతయో స్వల్పముగనున్నను నదియే యధికమై (శతరుద్రోపా నమువలె) అనేకత్వభ్రాంతిని కలుగఁజేసి యనర్థమునొసంగు ననియ శ్రుతి స్మృతి పురాణము లుద్ఘోషించుచున్నవి. ఎవరికి స్వాతిరిక్త దేహాదికము కలదను భ్రాంతి యుండదో అట్టివారు నిష్ప్రతియోగి బ్రహ్మజ్ఞాన సమకాలమునందే జాగ్రదవస్థయందే విదేహులని చెప్పబడుదురు.

అనగా:- దేహాభాస పూర్తిగ విడుచుటచేత నని తెలియవలెను. అట్టి పుణ్యపూరుషులు పరులదృష్టికి దేహాదికము గలవారివలె గనుపడి నను విదేహముక్తు లనబడుచున్నారు. వారే అశరీరులు! వారే పరిపూర్ణులు!

మూ. సర్వదోషైర్విర్ముక్తో జీవః కథం జ్ఞానేన ముచ్యతే
స్వాత్మరూపం యథాజ్ఞానం పూర్ణం తద్వ్యాపకం తథా
కామక్రోధాదిదోషాణాం స్వరూపా నాస్తిభిన్నతా
పశ్యత్యస్యవిధిం కిన్ను నిషేధోఽపి కథంభవేత్
వివేకీ సర్వదాముక్తః సంసారభ్రమవర్జితః
పరిపూర్ణస్వరూపం త త్సత్యం కమలసంభవ!
సకలం నిష్కలంచైవ పూర్ణత్వాచ్చ తదేవహి॥

తా. ఇట్టి నిర్విశేషజ్ఞానము గలజ్ఞానియే కామక్రోధభయాది దోషములనుండి విముక్తు డగుచున్నాడు. కావుననే కృతకృత్యు డనబడుచున్నాడు.

ఇట్టినిర్విశేషజ్ఞానము లేని ఆభాసజ్ఞాని అజ్ఞానవిజృంభితము లగు కామాది శత్రుజాతముచేత ఆవరింపఁబడును. అట్టివానికి జ్ఞానమెట్లు కలుగు ననెడి ఆక్షేపమునకు పరిహారము చెప్పబడుచున్నది. సర్వదోషములను గ్రహించినట్టి స్వజ్ఞానము కలిగినప్పుడుగాని, నిర్విశేషాత్మక సిద్ధియందు ని దోషములే ఉండజాలవు.

అనగా: స్వాత్మరూపమైన జ్ఞానమంతయు బ్రహ్మమే. సర్వత్ర పరిపూర్ణముగా వ్యాపించియుండుటచే కామక్రోధాది దోషముల కాత్మ భిన్నముగా సత్తయేలేదు. నిర్వృతియోగిక బ్రహ్మమాత్రము కామాది దోష మున్నదా లేదా? యను స్మరణయే కలుగుట కవకాశము లేదు గదా! అట్టి స్వాత్మమాత్రస్వరూపు డగువానికి విధినిషేధములు లేవు.

ఇట్లు జ్ఞానియగువాడు సర్వసంసారవిరహితుడు కావున సర్వదాముక్తుడై విదేహుడే యగుచున్నాడు.

ఓహిరణ్యగర్భా! సంసారభ్రమ విరహితుడగుజ్ఞానియే బ్రహ్మము అతడే పరిపూర్ణస్వరూపమగు సత్యశబ్ద వాచ్యమగు బ్రహ్మము. ఆ సత్యమే సర్వపరిపూర్ణ మగుటచేత నజ్ఞానదృష్టి ననుసరించి సకలమనియు, అనేకమనియు చెప్పబడును. ఆసత్యమే జ్ఞానదృష్టి ననుసరించి నిష్కళమనియు నేకత్వమనియు చెప్పబడును.

మూ. కర్పూరేలీయమానే కం కాఠిన్యం తత్రవిద్యతే
అహంకారక్షయేతద్వ ద్దేహే కఠినతాకుతః
సర్వకర్తాచ యోగీన్ద్రః స్వతన్త్రోఽనన్తరూపవాన్
జీవన్ముక్తో మహాయోగీ జాయతే నాత్రసంశయః.

తా. కర్పూరము ప్రజ్వలించుచున్నపుడు దానియందలి కాఠిన్యము పోయినట్లు దేహమునందుండు అహంకారము నశించినమొదల ననేక జన్మల నుండి సంచితాగాములను కొండలవలె ఘనీభూతమైన కాఠిన్యముగూడ నుండజాలదు.

యోగి సర్వకర్తయు, స్వతంత్రుడును, అనంతరూపములు గలవాడును, జీవన్ముక్తుడును, మహాయోగియు నగును. సంశయములేదు.

మూ. ఉపాదానంప్రపఞ్చస్య బ్రహ్మణోఽన్య న్నవిద్యతే
తస్మాత్సర్వప్రపఞ్చోఽయం బ్రహ్మైవాస్తి నచేతరత్
వ్యాప్యవ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతి శాసనాత్
ఇతి జ్ఞాతేపరేతత్త్వే భేదస్యావసరః కుతః
బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి విభావయ

సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వంచ శాశ్వతాత్
బ్రహ్మణోజాయమానస్య బ్రహ్మత్వంచ తదాభవేత్॥

తా. ప్రపంచోత్పత్తి కుపాదానకారణము బ్రహ్మముకంటె వేరయి నదిలేదు. అజ్ఞానదృష్టికి కనంబడు నీ జగత్తంతయు బ్రహ్మమేగాని బ్రహ్మ ముకంటె వేరు కాదు. 'సర్వమాత్మా' యని శ్రుతిశాసించుటచేత వ్యాప్యవ్యాపకత్వ భావమనునది మిథ్యయేకాని నిజముకాదు. అను తత్వము తెలిసినప్పుడు భేదమున కవసరమేలేదుగదా! నామరూపకర్మలు గల భూతసముదాయ మంతయు బ్రహ్మకార్యము. కార్యకారణముల కభేదము శాస్త్రసమ్మతమగుటచే బ్రహ్మమునందే సకలనామరూపము లిమిడియున్నవి. బంగారముతో చేయబడిన కణికయు, వలయాంగుళీయ కాదులునుకూడ బంగారమేయని చెప్పబడుచున్నట్లు బ్రహ్మమిూద కలి గిన భ్రాంతి యను ప్రపంచముకూడ విచారదృష్టిచే బ్రహ్మమే యని తెలియవలెను.

మూ. స్వల్పమ ప్యన్తరంకృత్వా జీవాత్మపరమాత్మనోః
యస్తిష్ఠతి విమూఢాత్మా భయం తస్యాపిభాషితమ్
యదజ్ఞానా ద్భవేద్వైత మితరత్తత్ప్రపశ్యతి
ఆత్మత్వేన తథాసర్వం నేతరత్తత్రచాణ్వపి॥

తా. జీవబ్రహ్మలకు స్వల్పభేదమున్నదని భావించినను నట్టిభావన ల మూఢులకు జననమరణ సంసారాదిభయము తప్పదు. అని శ్రుతి చెప్పుచున్నది. అజ్ఞానముచే (దేహాత్మభావనచేత) ద్వైతమనునది తోచు చున్నది. అప్పుడాత్మకంటె (బ్రహ్మ) వేరైనదానిని చూచుచున్నాడు. సుజ్ఞానము (ఆత్మద్రష్ట, బ్రహ్మదృష్టి) చేత సర్వమును బ్రహ్మగను, ఆత్మ ఎప్పు డెట్లుంగునో యప్పు డణుమాత్రమైనను బ్రహ్మేతరము గాదు.

మూ. యథా వంధ్యాసుతో నాస్తి యథానాస్తి మరౌజలం
యథానాస్తి నభోవృక్ష స్తథానాస్తి జగత్థ్సితిః
గృహ్యమాణేఘటేయద్వ న్మృత్తికాభాతివై బలాత్
వీక్ష్యమాణేప్రపఞ్చేతు బ్రహ్మైవాభాతి భాసురమ్.

తా. వంధ్యాపుత్రు డేవిధముగ లేడో! ఎండమావులయందు నీరనునది యెటులలేదో! అదేవిధముగా జగత్తనునది లేనేలేదు. ఘటమును గ్రహించి పరిశోధించి చూచినయెడల ఘటమునందు మృత్తికయేప్రకారముగా సర్వత్ర గోచరమగుచున్నదో అట్లే జగత్తు పరిశీలించి చూచినచో అంతటను బ్రహ్మమే తోచునుగాని తద్భిన్నముగ నేమియు గనుపడజాలదు.

మూ. సదైవాత్మా విశుద్ధోఽస్తి హ్యశుద్ధోభాతివై సదా
యథైవ ద్వివిధారజ్జు ర్జ్ఞానినోఽజ్ఞానినో ఽనిశమ్
యథైవ మృణ్మయఃకుమ్భ స్తద్వద్దేహోఽపి చిన్మయః
ఆత్మానాత్మవివేకోఽయం ముధైవక్రియతే బుధైః
సర్పత్వేన యథారజ్జూ రజత్వేనతుశుక్తికా
వినిర్ణీతావిమూఢేన దేహత్వేన తదాత్మతా
ఘటత్వేన యథాపృథ్వీ జలత్వేన మరీచికా
గృహత్వేనహి కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా
తద్వదాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః.

తా. రజ్జువొక్కటియే జ్ఞానులకు త్రాడుగను, అజ్ఞానులకు సర్పముగను తోచునటుల ఆత్మ సర్వదా విశుద్ధుడేయైనను నజ్ఞానుల కశుద్ధునివలె తోచుచుండును. కుంభము మృణ్మయమైనట్లుగనే దేహముకూడ చిన్మయమే, చిద్వికారమే యగుచున్నది. పండితమ్మన్యు లగువారలు

కొంద ఱాత్మానాత్మ వివేకమనునది వాస్తవముగ నున్నటులును, తామా విభేదమును చేయుచున్నటులును తలంచుచున్నారు. కాని యిది వ్యర్థమైనపని. మూఢులు రజ్జువునందు సర్పమును, ముత్యపు చిప్పయందు వెండిని తలంచుచున్నటుల ఆత్మయందు దేహేంద్రియ త్వమును గాంచుచున్నారు.

మృత్తికను ఘటముగను, ఎండమావులను నీటివలెను, కాష్ఠసమూహము నిల్లుగను, లోహమును ఖడ్గముగను అజ్ఞానవశముచేత తలంచుచున్నటులనే ఆత్మయందు దేహత్వమును గాంచుచున్నారు.

మూ. సిద్ధౌ చిత్తంనకుర్వీత చంచలత్వేన చేతసః
తథాఽపి జ్ఞాతతత్వోఽసౌ ముక్తిరేవ నసంశయః.

తా. యోగాభ్యాసకుడు మనస్సెప్పుడును చంచలమైన దగుటచే యోగసిద్ధులగు నణిమాదిసిద్ధులతోడి సంబంధానుబంధమును వాసనలతోగూడ విడువవలెను. లేనియెడల నాసిద్ధులు చూడవలెను, వినవలె నను తత్తత్ప్రభావజనితములగు విషయములకు లోనగువానిగ జేయుటయు నద్దాన పూర్ణత్వసిద్ధి లేకపోవుటయు జరుగును. కావున నాసిద్ధులయందు మనస్సుంచకూడదు. ఆత్మతత్వమును చక్కగ నెఱింగిన యోగి తనకుగల యోగసిద్ధులను ప్రకటనమొనర్చినను, రహస్యముగ నుంచినను దానివలన నతనికి వచ్చులాభముగాని, నష్టముగాని యేమియును లేదు.

సిద్ధులును కోరకలే యగుచున్నవిగాన నాసిద్ధులతో సంబంధ ముంచ గూడదు. ఆత్మవివేకికిని, అమృతస్వరూపము పొందినవానికిని సిద్ధులతో ంబంధము లేదు.

## 64 తు రీ యా తీ త ము

మూ. మహాపురుషో య స్తచ్చితం మయేవాఽవతిష్ఠతే॥

తా. సాధనచతుష్టయ సంపన్నులగు మహాపురుషుల హృదయములో నెల్లప్పుడు నేను నివసించుచున్నాను. అట్టివారి చిత్తమెప్పుడును బ్రహ్మాకారముగనే యుండును.

మూ. సర్వత్ర పుణ్యాపుణ్యవర్జితో జ్ఞానాజ్ఞాన మపివిహాయ
శీతోష్ణ సుఖదుఃఖ మానావమానాని నిర్జిత్య వాసనా
త్రయ పూర్వకం నిన్దానన్ద గర్వ మత్సర దమ్భ దర్పేచ్ఛా
ద్వేష కామ క్రోధ లోభ మోహ హర్షామర్షాసూయాऽత్మ
సంరక్షణాదికం దగ్ధ్వా స్వవపుః ॥

తా. పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వమునందు పుణ్యాపాపములను విడిచినవాడై జ్ఞానాజ్ఞానాది సర్వమునువిడచి, శీతోష్ణాదులవల్లనగు సుఖదుఃఖములు, మానాభిమానములు, పరులవల్ల నగు పూజావమానములు మున్నగు సుఖదుఃఖవిషయములను విడచి, మనస్సులోనైన హర్షవిషాదములు లేక నిందాపనిందలు, గర్వము, మత్సరము, దంభము, ఇచ్ఛ, ద్వేషము, కామక్రోధ లోభమోహములు నను దుర్గుణములను విడచి, తనఆత్మను తను రక్షించుకొనుటకై హర్షామార్షాసూయాదులను భస్మముచేసి శేషించినపదార్థము పూర్ణాత్మయని తెలియవలెను.

మూ. సర్వ విద్యాపాణ్డిత్యప్రపఞ్చం భస్మీకృత్య॥

తా. సర్వవిద్యలు, సమస్తమగు పాండిత్యము, సర్వప్రపంచము, సర్వమును బ్రహ్మసత్యము - జగత్తుమిథ్య యను జ్ఞానాగ్నిచే భస్మము చేయవలెను.

మూ. సర్వత్ర శుభాశుభయో రనభిస్నేహః స్సర్వేన్ద్రియోపరమశ్చ
పూర్ణాపన్నాऽऽశ్రమాऽऽచార విద్యాధర్మ ప్రభావ మను
స్మరన్ త్యక్తవర్ణాऽऽశ్రమాచార స్సర్వదా దివానక్తం సమత్వే

నాస్వప్న స్సర్వదా సఞ్చారశీలో దేహమాత్రావశీలో
దేహమాత్రావశిష్టో జలస్థలకమణ్డలు స్సర్వదాఽనున్మత్తో
భావోన్మత్తపిశాచవత్ .

తా. సర్వములగు శుభాశుభములయందు "అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా" యనున ట్లసంగమును లేక, సర్వేంద్రియములద్వారా వృత్తి రహితమైయుండి పూర్వము తనయొక్క ఆశ్రమాదులు, ఆ యా ఆచారాదులు విడిచినవాడై; రాత్రింబగ ళ్ళైడతెరిపిలేక సర్వకాలముల యందు సమముగనుండి, ఈసర్వము స్వప్నమని తానమ్మి జీవయాత్ర చేయవలెను.

అట్టివాని దేహము మహాసముద్రములో మునిగిపోయిన కమండలమువలెను, ఘటమువలెను నుండును. ఎల్లప్పుడు పసిపిల్లవానివలెను, కల్లుతాగిన వానివలెను, పిశాచము పట్టినవానివలెను నుండును.

ఎంతగాఢనిద్రలో పిలచినను నేను జీవుడను దేహేంద్రియములే ఆత్మ యన్న యాభాస పూర్తిగ వాసనతో 'కర్పూరము రూపులేకుండ వేడి లేకుండ హరించినట్లు' నేను అన్న అజ్ఞానము (ఆభాస) నశించి, అఖండ పరిపూర్ణ పరబ్రహ్మములో నుప్పుగడ్డ మహాసముద్రములో కలిసి రూపు లేనట్లుగ నభిమానరహితమై నే నన్నపదార్థము కలిసిపోవలెను. అట్టి స్థితిలో దేహేంద్రియములతో జాగరూకులై వ్యవహరించుట శ్రేయము. ఇదియంతయు నింద్రజాలము; నాటకమువంటిది; కనురెప్పపాటులో నశించిపోవునది యని తెలిసి దానియందు రాగద్వేషములు విడిచిపెట్ట వలెను.

సర్వభూతములయందు నేను, నాలో సర్వభూతములు ఉన్నవను జ్ఞానము కలుగుట దుర్లభము. సర్వభూతములులేవు. నేనులేను. సర్వ మఖండ పరిపూర్ణ పరబ్రహ్మమే యనుజ్ఞానము కలుగుట మరియు దుర్ల

భము. ఈ విషయములలో మాటలు చెప్పవచ్చునుగాని యఖండ సామ్రాజ్యపదవిలో మునుగుట చాలదుర్లభము. అట్టివాడు కోటిలో నొకడనునానుడి అబద్ధముకాదని తెలియవలెను. (లోకేదుర్లభతరో నతుబాహుళ్యో యద్యేకో భవతి) అనునట్లు అట్టి మహానీయుడు లోకములో దొరుకుట దుర్లభము. అట్టివాడు వేరొక డుండడనియు కోటికొక డుండిన నుండవచ్చుననియు నమ్మవలెను. సహస్రానేకకోటి జన్మసుకృతముచే గాని అయ్యఖండసామ్రాజ్యపదవి దొరుకదు. ఆ పదవిలో తాను మునిగిననే కాని జన్మసాఫల్యము కాదు.

కోటీశ్వరులైనను నశ్వరమగు నైశ్వర్యమును నమ్మి చెడక సద్గురువు నాశ్రయించి అనశ్వరమును, రాకపోకలు లేనిదియునగు అఖండపదవి నందుటకై ప్రయత్నింపవలెను.

## 65 సన్న్యాస

మూ. శాస్త్రజ్ఞానా త్పాపపుణ్యా లోకానుభవశ్రవణా త్ప్రపఞ్చో
పరతో దేహవాసనాం శాస్త్రవాసనాం లోకవాసనాం త్యక్త్వా
ఉవమానం మానమివ ప్రవృత్తిం సర్వం హేయం మత్వా
సాధన చతుష్టయసంపన్నో య స్సన్న్యస్యతి సఏవ
జ్ఞానసన్న్యాసీ॥

తా. శాస్త్రజ్ఞానము, పాపము, పుణ్యము, లోకములోని శ్రవణాదులు మున్నగు సర్వప్రపంచమును శాంతింపజేసి వాసనాత్రయమును విడిచినవాడు; దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన విడిచినవాడును (కక్కినకూడువలె చూచినవాడు) మానాభిమానములకు చెందిన ప్రవృత్తియంతయు సర్వము హేయమని తెలిసికొని తన్ను తా దెలిసికొనుటకు దగిన సాధనచతుష్టయ సంబంధములగు సుగుణములు గలవాడును సన్న్యాసి యనబడును.

యర్థము. కావున శిష్యుల కజ్ఞానాంధ కారమును పోగొట్టి జ్ఞానముకలి గించువాడే గురువు.

కావున గురుముఖతా పరిశీలనచేసి తననిజస్వరూపమును తెలియ వలెను. లోపలను వెలుపలను ఎవరియందు నేవిధమైన స్నేహమును నుంచగూడదు.

## 67. అ క్ష మా ల

మూ. సకల లోకోద్దీపిని! సకలలోక రక్షాధికే! సకలలోకో
జ్జీవికే! సకలలోకోత్పాదికే! దివాప్రవర్తకే! రాత్రి
ప్రవర్తకే! నద్యన్తరంయాసి, దేశాంతరంయాసి, ద్వీ
పాన్తరంయాసి, సర్వదాస్ఫురసి, సర్వహృది వాసయసినమస్తే.

తా. సకలలోకములకు దీపమువంటిదియు, రక్షించునదియు, జీవ నాధార మైనదియు, సకలము పుట్టుటకుకారణ మైనదియు, పగటివేళను రాత్రివేళను తత్తద్వ్యాపారము చేయునదియు, ఆద్యంతములయం దున్నదియు (త్రికాలములయందు) అన్ని దేశములకును అంతర్యాముగా నున్నదియు, అన్ని ద్వీపాంతరములయం దున్నదియు, అన్ని లోకము లయం దంతర్యామిగా నున్నదియు నై ఎయ్యది సర్వకాలములయం దున్నట్లు తెలియుచున్నదో; సర్వహృదయములయందు (సర్వభూత నివాసోఽసి శ్రీవాసుదేవ నమోస్తుతే.) యనునట్లున్నదో అట్టి భూత నివాసినికి నమస్కారము.

## 68. అ వ్య క్త

మూ. తత్రావ్యక్తం భవా ని త్యజ్ఞాయ వ్యక్తంమే
కథమేతి వ్యక్తంవై విశ్వం చరాచ గాత్మకమ్॥

తా. పరమేశ్వరు డవ్యక్తము గా నుండెను. సర్వకాలములయందు జగత్తునకు విలక్షణముగా నుండెను. అవ్యక్తముగను, వ్యక్తముగనునున్న యీ సర్వప్రపంచము చరాచరమంతయు అవ్యక్తపరబ్రహ్మ మని యెఱుంగుము.

## 69. ఏ కా క్ష ర ము

మూ. సర్వభూతగ్ం హిరణ్మయమ్॥
హిరణ్మయం బుద్ధిమతాం పరాంగతిమ్.

తా. సర్వభూతములయందు జ్యోతిర్మయమైనది. ఆజ్యోతిర్మయము బుద్ధివృత్తికి విలక్షణముగను పైమార్గముగను నున్నదని తెలియవలెను.

## 70. అ న్న పూ ర్ణ

మూ. నిదాఘుత్వం కృతార్థోసి శృణు విద్యాం సనాతనీమ్
యస్యావిజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి.
ఆత్మవ త్సర్వభూతాని పరద్రవ్యాణి లోష్ఠవత్॥

తా. ఓ నిదాఘమునీ! నీవు కృతార్థుడవు. సనాతనమునుండియు నున్న విద్యను చెప్పెదను వినుము. ఏవిజ్ఞానముచే నీవు నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానము చేయగలుగుచున్నావో ఆ వివేకజ్ఞాన మున్నయెడల తప్పక జీవన్ముక్తుడవు కాగలవు.

తన ఆత్మ సర్వభూతములయం దున్నదనియు, సర్వభూతములు తన యం దున్నవనియు దెలిసికొనిన బుద్ధిమంతుడు పరుల ద్రవ్యమును మట్టిబెడ్డవలె చూచును.

మూ. సర్వమేవ పరిత్యజ్య మహాశయాసీ భవానఘ!
నిర్వాణవా న్నిర్మనసః క్షీణచిత్తః ప్రశాంతధీః

ఆత్మన్యేవ స్వశాంతాత్మా మూకాంధబధిరోపమః
నిత్య మన్తర్ముఖస్స్వచ్ఛ స్స్వాత్మనాంతః ప్రపూర్ణతః
జాగ్రత్యేవ సుషుప్తిస్థః కురుకర్మాణివై ద్విజ!
అన్త స్సర్వపరిత్యాగీ బహిఃకురు యథాగతమ్
చిత్తసత్తాపరాదుఃఖం చిత్తత్యాగః పరంసుఖమ్॥

తా. హృదయములో సర్వవాసనలు విడిచినవాడే మహాజ్ఞాని వాడే లోకమునకు విలక్షణమగు ఘనవస్తువును తెలిసినవాడు. హృదయములోనుంచి సర్వవాసనలు విడుచుటయే నిర్వాణమనబడును. అ నిర్మలమైన మనస్సుగ నెన్నబడుచున్నది. అట్టివాని చిత్తమంతయు క్షీణించి గొప్ప శాంతముతోగూడిన బుద్ధిమంతు డగును. తన ఆత్మ తననిజస్వరూపముగ తెలియుటచే శాంతాత్ముడు నగును. అట్టివానిస్థి నోరుండియు మూగవానివలెను, కళ్ళుండియు గ్రుడ్డివానివలెను, చెవు లుండియు చెవిటివానివలెను నగును. సర్వము శమించినవాడు, నిత్యము లోపల స్వచ్ఛముగ ఆత్మను తెలిసినవాడును పరిపూర్ణమును పొందును. అట్టివాడు జాగ్రదవస్థలో నున్నను గాఢసుషుప్తిలో నున్నట్లుండును. అట్లుండి తనప్రారబ్ధమంతయు ననుభవించునుగాని బుద్ధిమంతుడు విచారిం పడు. నేను చేయుచుంటినని యభిమానపడడు. అంతఃకరణములోని సర్వవాసనలు విడిచినవాడు బాహ్యమున యథాప్రకారముగ కర్మలుచేసి నను చేయనివాడే యగును, చిత్తము వాసనలతో గూడినప్పుడు గొప్ప దుఃఖము పొందును. చిత్తము వాసనలను విడిచినపుడు పరమసుఖము పొందును.

## 71. సూర్య

మూ. సూర్యఆత్మా జగతస్తస్థుషశ్చ సూర్యాద్వై ఖ ల్విమాని
భూతాని జాయన్తే సూర్యాద్యజ్ఞః పర్జన్యోఽన్నమాత్మా

నమ స్తే ఆదిత్య త్వమేవ ప్రత్యక్షం కర్మకర్తాఽసి, త్వ
మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వమేవ ప్రత్యక్షం విష్ణురసి
త్వమేవ ప్రత్యక్షం రుద్రోఽసి.

తా. మనకు సూర్యుడే ప్రత్యక్షదైవము. ఆత్మయే సూర్యరూప ముగా ప్రకాశింపజేయుచున్నది. సూర్యాత్మలే ప్రపంచము లని తెలి యుము. యజ్ఞము సూర్యుడు. వర్షాధిపతియగు పర్జన్యుడును సూర్యుడే. అన్నము ఆత్మగ నెంచుము. నమస్కరింపుము. ఆసూర్యుడే ప్రత్యక్షముగా నుపడు కర్మకర్త. మూర్తిత్రయమును సూర్యుడే. సర్వము సూర్యాత్మ యని తెలియవలెను.

## 72. అక్షి

మూ. లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనం
పరమానన్దసన్దోహో ,వాసుదేవోహ మోమితి
తస్మాత్సర్వం పరిత్యజ్య తత్త్వనిష్ఠో భవానఘ !
అవిద్యా తిమిరాతీతమ్ సర్వాభాస వివర్జితమ్
ఆనన్ద మమలం సిద్ధం మనోవాచా మగోచరమ్॥

తా. వృత్తిసహితముగ లోకవాసన దేహవాసన విడిచినవాడు పూర్ణానందములోమునిగి ఈసర్వప్రపంచము వాసుదేవ స్వరూపమని వాసుదేవ స్సర్వమితి) నమ్మినవాడు నిత్యసుఖమును పొందును.

నేను అనుపదార్థము లేకుండునట్లు సర్వమువిడిచి సర్వప్రపంచమునకు విలక్షణముగానున్న ఘనపదార్థము నందు నిష్ఠకలిగియుండవలెను. అజ్ఞాన ముతో గూడిన తిమిరరోగమునకు విలక్షణముగనున్న సత్పదార్థమున సమస్తములగు ఆభాసలను విడిచి ఏవిధమైన మలములులేకుండా అంత రణము శుభ్రముగ తుడిచినయెడల స్వతస్సిద్ధముగ ఆత్మానుభవము

మనస్సుచేతగాని, వాక్కుచేతగాని చెప్పుటకు వీలులేదు. స్వానుభవము చేతను నిజానుభవముచేతను తెలియవలెను.

## 73. అధ్యాత్మ

మూ. మాతాపిత్రమలోద్భూతం మలమాంసమయం వపుః
త్యక్త్వా చణ్డాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీభవ
తద్బ్రహ్మాఽహ మితిజ్ఞాత్వా కృతకృత్యో భవానఘ!
సర్వత్ర సర్వతస్సర్వ బ్రహ్మమాత్రావలోకనమ్
సద్భావభావనా దార్ఢ్యా ద్వాసనాలయ మశ్నుతే
స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణ మద్వయ మక్రియమ్॥

తా. తల్లిదండ్రుల మలమూత్రములే యీశరీరము. కావున జనన మరణములతోగూడిన అజ్ఞానమును విడిచి ఛండాలుని భాతి దూరము నుంచవలెను. అట్లొనర్చినవాడే బ్రాహ్మణుడు. కృతకృత్యు డనబడు బ్రహ్మాత్మభావమును పొందినవాడు చేయతగిన కృత్యము లేమియులేవు జగత్తునకు విలక్షణమైన బ్రహ్మభావమును పొందును.

సర్వత్ర, సమస్తపదార్థములందును సర్వము బ్రహ్మభావము చూడవలెను. ఆసద్భావముయొక్క దార్ఢ్యముచేతనే సర్వవాసనలు నశించును. తన నిజస్వరూపమే పరబ్రహ్మము. పూర్ణాత్మతక్క రెండవ వస్తువులేదు. చేయవలసిన క్రియలులేవు. అనినమ్మవలెను.

## 74. కుండిక

మూ. నిష్కలోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్భయః
సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహ మద్వయః
కేవలాఖణ్డబోధోఽహం స్వానన్దోఽహం నిరంతరః.

తా. నేను ఏసంకల్పవికల్పములు లేనివాడను, నిత్యుడను, ఏ ఆలంబనము లేనివాడను, రెండవవస్తువు లేనివాడను, అంతటనిండిన సర్వాత్మస్వరూపుడను, సర్వము నే నై యున్నాను, సర్వమునకు విలక్షణమైనవాడను, అద్వయుడను, కేవల మఖండపరిపూర్ణ బోధస్వరూపుడను, సర్వకాలములయం దున్నవాడను.

## 75. సా వి త్రి

మూ. స్త్రీచైవ పురుషశ్చ ప్రజనయతో యోవా ఏతాం సావిత్రి
మేవం వేద సపున ర్మృత్యుర్జాయతే॥
అమృతకరతలార్ద్రా సర్వసంజీవనాఢ్యా
వఘహరణసుదీక్షా వేదసారే మయూఖే.

తా. ఈసావిత్రి ఉపనిషత్ స్త్రీగాని పురుషుడుగాని వేదములో చెప్పబడిన ప్రకారము అధ్యయనము ఆచరణలో పెట్టినయెడల జనన మరణములను జయించును. హృదయ మమృతమయమై అమృతత్వము రతలామలక మగును. జనన మరణప్రవాహ మనురోగమునకు సంజీవిని. దీని నుపాసించినవాని కాకలిదప్పు లుండవు. వేదసారామృతము గ్రోలినతోడనే క్షుధ నివారణ యగును.

## 76. ఆ త్మ

మూ. ఏకఏవాద్వయ స్సదా,
బ్రహ్మరూపతయా బ్రహ్మ కేవలం ప్రతిభాసతే
జగద్రూపతయాప్యేత ద్బ్రహ్మైవ ప్రతిభాసతే
విద్యావిద్యాదిభేదేన భావాభావాది భేదతః
గురుశిష్యాదిభేదేన బ్రహ్మైవ ప్రతిభాసతే
బ్రహ్మైవ కేవలం శుద్ధం విద్యతే తత్త్వదర్శనే॥

తా. అట్టి నిత్యమంగళ స్వరూపుడగు పరమాత్మయే ఈ శరీరము నందు వసించుటవలన అతడున్నూ ఆత్మ యనబడుచున్నాడు. ఆత్మ స్వరూపు డగునతడు మాయాసంబంధము లేక సజాతీయ విజాతీయ స్వగత భేదములేనివాడై సదా బ్రహ్మస్వరూపుడుగా నుండుటవల కేవల నిర్వికార స్వయంప్రకాశుడై వెలుగుచున్నాడు.

ఆత్మస్వరూపు డగు నాపరబ్రహ్మమే యీ నానావిధ నామరూపాత్మక చరాచరప్రపంచముగా కనుపడుచుండెను. అధిష్ఠానమగు ఒకత్రాటి అట్లు సర్పముగదోచుచున్నదిగాని, వేరు సర్పమొకటి యచట లేనలుగ పరబ్రహ్మనుగు ఆత్మయొక్కడే కల్పితములైన స్వప్నప్రపంచము వలె మిథ్యగా నగును. ఈ నానావిధ రూప మనాత్మక మగునట్టి చరాచర ప్రపంచంబు సర్వంబుగా తోచుచున్నాడుగాని యతని కన్యముగా నణుమాత్రమగువస్తు వేదియునులేదు. (విద్యావిద్యలు) జ్ఞానాజ్ఞానములును, భావాభావములును అతడే యగుచున్నాడు. గురుశిష్యులిద్దరు ఆత్మస్వరూపు లగుటవలన వారిద్దరును పరబ్రహ్మస్వరూపులే.

తత్వజ్ఞానములేని యజ్ఞానదశయందే బ్రహ్మమువేరు జగత్తువేరు అను నజ్ఞానము తోచుచుండునుగాని (తత్వవివేకము) ఆత్మానాత్మ విచారణ చేసి స్వానుభవమును పొందినప్పుడు పైబోధలెవ్వియు నుండవు. సర్వము బ్రహ్మమాత్రముగనే తోచును.

మూ. సత్యత్వేన జగద్భావం సంసారస్య ప్రవర్తనమ్
అసత్యత్వేన భావంతు సంసారస్య నివర్తకమ్
ఘటోయమితి విజ్ఞాతుం నియమః కోన్యపేక్షతే
వినా ప్రమాణసుష్టుత్వం యస్మి న్సతిపదార్థధీః
అయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతిభాసతే
న స దేశం నాపి కాలం వా న శుద్ధం వా ప్యపేక్షతే

దేవదత్తో౽హ మిత్యేత ద్విజ్ఞానం నిరపేక్షకమ్
తద్వ ద్బ్రహ్మవిదో౽ప్యస్య బ్రహ్మాహమితి వేదనమ్.

తా. ఈమాయాకల్పితమగు జగత్తును సత్యమని భావించుటవలన జననమరణ రూపమగు సంసారము వృద్ధిపొందుచున్నది. అసత్యమని తెలిసికొనినచో వృద్ధిపొందక నశించును.

ఇది ఘటమని యెఱుంగుటకు ప్రత్యక్షప్రమాణ ముండవలయును. అగుచో బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణములచే పొందుటకు శక్య మగునా? కాదా? అనిన — "యద్దృశ్యం తన్నశ్యం" మొదలగు వాక్యములచే కంటితో చూడబడు పదార్థము లన్నియు నశించునవి. బ్రహ్మము కంటితో చూచుటకు వీలులేనిది కావున ప్రత్యక్షప్రమాణము లకు తెలియునది కాదు. ఈ శరీరమునందు స్వయంప్రకాశకమై, అప రోక్షమైయుండు నియ్యాత్మ యెల్లప్పుడును సహజముగనే నిర్మలమైనది. అట్టి యీ ఆత్మ శ్రుతిప్రమాణములచేతనే తెలియబడునుగాని కాశీ రామేశ్వర కురుక్షేత్రాది పుణ్యక్షేత్రముల కేగినమాత్రమున తెలియ బడదు. అజ్ఞానముచే ఆత్మ ఆవరింపబడియుండ తాను జీవు డనుభ్రాంతిని పొందును. కావున 'తత్త్వమసి' మున్నగు ఉపనిషద్వాక్యములను చక్కగ విచారించి, తత్త్వజ్ఞానమునుపొంది, యద్దాన నజ్ఞానము నివర్తించుటచే తాను జీవుడను భ్రాంతినశించి ఆత్మ తాను కేవల సాక్షిమాత్ర బ్రహ్మ ముగ నెఱుంగుచుండును.

ఒకడు తన పేరు దేవదత్తుడని తెలిసినపిదప మాటిమాటికి "నేను దేవదత్తుడను-నేను దేవదత్తుడ" ననుచు స్మరింపబనిలేనట్లుగనే సద్గురువు కొద్ద తత్త్వవిచారణచేసి ఆత్మస్వరూపుడగు తానే బ్రహ్మమని తెలిసికొని ఆత్మానుభవమును పొందినవెనుక నెల్లపుడు తదాకారముగ, కేవల సాక్షిమాత్రముగ నుండవలయునుగాని మరలమరల అహంబ్రహ్మాస్మి= నేను బ్రహ్మమైతిని. నేను బ్రహ్మమైతి ననుచు ధ్యానింప పనిలేదు.

మూ. క్షుధాం దేహవ్యథాంత్యక్త్వా బాలః క్రీడతి వస్తుని
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ
కామా న్నిష్కామరూపీసన్ చరత్యే నచరో మునిః
స్వాత్మనైవ సదాతుష్టః స్వయం సర్వాత్మనా స్థితః
నిర్ధనోఽపి సదాతుష్టో ప్యసహాయో మహాబలః
నిత్యతృప్త స్త్వ భుంజానో ప్యసమ స్సమదర్శనః
కుర్వన్నపి నకుర్వాణ శ్చాభోక్తా ఫలభోగ్యపి
శరీర్య ప్యశరీర్యేషః పరిచ్ఛిన్నోఽపి సర్వగః.

**తా.** పసిపిల్ల లాటలాడుకొనుసప్పు డాకలి, దప్పిక, దేహశ్రమ మున్నగువానిని లెక్కగొనక నాటలయందు నిమగ్నులగురీతి బ్రహ్మజ్ఞాని నేను నాది యనెడు అహంకార మమకారములను విడిచిపెట్టి సర్వమును బ్రహ్మముగాజూచుచు సదా బ్రహ్మమునందే రమించుచుండును.

బ్రహ్మజ్ఞాని నిష్కాముడై సకలవాంఛల విడనాడి సదా పరబ్రహ్మమగు తన ఆత్మస్వరూపమునందే జ్ఞప్తిగలవాడై తృప్తుడై యెప్పుడును బ్రహ్మస్వరూపుడై యుండును.

బ్రహ్మజ్ఞాని ధనములేనివాడయ్యును నిత్యము సంతోషముగ నుండును. అట్లు కోటీశ్వరుడును నుండజాలడు.

బ్రహ్మజ్ఞాని సహాయము లేనివాడయ్యును తాను మహాబలము కలవాడుగ నుండును. చక్రాధిపతులును, మహారాజులును అంతటి స్థైర్యయుతులై యుండలేరు.

బ్రహ్మజ్ఞాని యొకవేళ భుజింపకున్నను నిత్యతృప్తి కలవాడుగ నుండును. ఆకలిదప్పులు ప్రాణవాయు ధర్మములేగాని, దేహేంద్రియ ప్రాణాది సకలమునకు సాక్షిగనుండు నాకు లేవనియు, నెండమావు-

యందు జలమును జూచునట్లు భ్రాంతిచేత ఆకలిదప్పులు నాకు కలిగినట్లు తోచుచున్న విగాని యెంతమాత్రమును నాకు లేవనియును దెలిసికొని నిత్యానందుడై నిత్యతృప్తుడై యుండును. పంచభక్ష్య పరమాన్నము లతో భుజించినవాడైనను అజ్ఞాని అట్టి నిత్యానందమును, నిత్యతృప్తిని బొందజాలడు. జ్ఞానిఅందరిలోను సమానునివలె నున్నను తాను మాత్రము పక్షపాతములేక సర్వమును తనవలెనే జూచుచుండును.

బ్రహ్మజ్ఞాని నిత్యనైమిత్తికాది సకలకర్మములు చేయుచున్నను "అహంకార మమకారములు లేనివా డగుటవలన" చేయనివాడే యగు చున్నాడు. శరీరసంబంధములగు సమస్త సుఖదుఃఖము లనుభవించు చున్నను "కర్తృత్వ భోక్తృత్వములు చిదాభాసుని లక్షణములేగాని దానికి సాక్షిగనుండు పరబ్రహ్మమగు ఆత్మయే తా ననుదృఢనిశ్చయము గలిగియున్నవా డగుటచే" ఆ సుఖదుఃఖముల నంటనివాడే యగు చున్నాడు. శరీరము కలవాడుగ లోకులకు కనబడుచున్నను "దేహేంద్రి యములకు వేరుగను, సాక్షిగను నుండుఆత్మయే తానను నిశ్చయము కలవా డగుటచే" శరీరము లేనివాడగుచున్నాడు. ఒకస్థలమునం దొక దేహమునం దుండువాడైనను "ఆత్మస్వరూపుడై జీవసాక్షిగనుండు తానే సర్వసాక్షియగు కేవల సర్వ పరిపూర్ణ పరబ్రహ్మ మగుచుండుటచే" తాను సర్వవ్యాపకు డగుచున్నాడు.

ఋూ. అశరీరం సదాసన్త మిమంబ్రహ్మవిదం క్వచిత్
ప్రియాప్రియే నస్పృశత స్తథైవచ శుభాశుభే
మాయాకల్పౌ బంధమోక్షౌ నస్త స్స్వాత్మని వస్తుతః
యథారజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాసవినిర్గమే
న నిరోధో నచోత్పత్తి ర్నబద్ధో నచసాధకః
న ముముక్షు ర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా.

తా. దేహేంద్రియాదులకు వేరై కేవలసాక్షిమాత్రుడై అశ యయుచు నాత్మరూపముగనుండు యీ బ్రహ్మజ్ఞానిని సుఖదుఃఖములు పుణ్యపాపములు అంటజాలవు.

దూరముగనుండు త్రాడునుజూచి యజ్ఞానమువలన సర్పమని భ్రాంతి పడునట్లు ఆత్మజ్ఞానము లేనివారు తాము నిత్యముక్త పరబ్రహ్మమని తెలియక భ్రాంతిచే తామును జీవస్వరూపులని తలంచుచున్నారు. అట్టి వారికే మాయాకల్పితములైన బంధమోక్షములు కలవుగాని మరల పూర్వపురజ్జు సమీపమునకేగి చక్కగపరీక్షించి చూచిన వెనుక " యిది పాముకాదు. త్రాడే యని వెనుకటిభ్రాంతి నశించినట్లు" తాను జీవుడనను భ్రాంతిలేని బ్రహ్మజ్ఞానికి బంధమోక్షములులేవు.

నాశము, ఉత్పత్తి, సంసారబంధము మొదలగునవి బ్రహ్మమునకు లేవు. కావున బ్రహ్మస్వరూపుడగు బ్రహ్మజ్ఞానికిని పైయుత్పత్తి నాశ నాదులు లేవు. సంసారబంధము లేకపోవుటవలన బ్రహ్మానుభవము బ్రహ్మజ్ఞానికి శ్రవణ, మననాది సాధనము లక్కఱలేదు. అజ్ఞానమును కామమును, కర్మాదులను నివృత్తిచేసికొనినవాడే ముక్తుడనబడును బ్రహ్మజ్ఞానికి అజ్ఞాన కామకర్మాదులు లేవు. కాన తాను వానిని నివృ.. చేసికొనవలయునను వ్యవహారమేలేదు. అందువలన తాను ముక్తుడను భ్రాంతియు తనకులేదు.

అజ్ఞానభూమియందు సంచరించువారికే సమస్తమగు లౌకిక వైదిక కర్మలు, వర్ణాశ్రమాచారాదులును కలవు; గాని జ్ఞానభూములయం సంచరించు బ్రహ్మజ్ఞానులకు పైజెప్పిన వ్యవహారము లెవ్వియునులే...

## 77. పా శు ప త

మూ. స్వాత్మన్యేవ స్వయంసర్వం సదాపశ్యతి నిర్భయః
తథాముక్తో నముక్తశ్చ బద్ధస్యైవ విముక్తతా

స్వశరీరే స్వయంజ్యోతి స్స్వరూపం పారమార్థికమ్
ఆకాశమేకం సంపూర్ణం క్వచి న్నహిగచ్ఛతి.

తా. తనఆత్మనే స్వయముగ సర్వము•ానుు, సర్వకాల సర్వావస్థల యందు నేమహానీయుడు చూచునో అట్టిపుణ్యాత్మునకు ముక్తిలేదు. ంధములేదు. ఎల్లప్పు డఖండపరబ్రహ్మమే యగుచుగాన నేవిధమయిన ంధములులేవు విముక్తుడగును.

తనశరీరమునందేకలిగి స్వయంజ్యోతిమైన పరంజ్యోతిని నిజస్వరూప ముగ నెఱిగినవాడు పరమాత్మను పొందును.

ఆకాశమువలె సర్వత్రనిండినదై ఏకమైనట్టి పూర్ణాత్మతప్ప మరి యొకవస్తువు లేదు. పొందవలసిన దేదియునులేదు.

## 78. పరబ్రహ్మము

సూ. సర్వేషాం బ్రహ్మాదీనాం దేవర్షీణాం మనుష్యాణాం
ముక్తిరేకా బ్రహ్మైకమేవ బ్రాహ్మణత్వ మేకమేవ
వర్ణాశ్రమాచార విశేషాః పృథక్ పృథక్—
పునర్జన్మ నివృత్త్యర్థం మోక్షస్యాహర్నిశం స్మరేత్.

తా. మనుజులకెల్లరకు బ్రహ్మస్వరూపమును పొందుటకు హక్కు గియున్నది. లోకమున తండ్రిఆస్తి ననుభవించుటకు గ్రుడ్డి, కుంటి, మూగయనుభేదములేక కుమారులందరును హక్కుదారు లగునట్లు గవంతునిపొంది జననమరణవ్యాధి నివారించుకొనుట కందరును హక్కు పలే యని తెలియవలెను.

మానవులాదిగ బ్రహ్మాదిదేవత లందరకును ముక్తియొక్కటే. బ్రహ్మమొక్కడే. బ్రాహ్మణత్వము పొందుట యొక్కటియే. భేదము

లేను. నిత్యానిత్య వస్తువివేకముచే పరిశోధించి, వర్ణాశ్రమధర్మములను విడచి, నిత్యవస్తువుందెలిసి అనిత్యమును విడువవలెను.

జనన మరణములను మహత్తరమగు వ్యాధిపోవుటకు మోక్షస్వరూపమను మహదౌషధమును మరువకూడదు.

## 79. అ వ ధూ త

మూ. తత్త్వమస్యాదిలక్ష్యత్వా దవధూత ఇతీర్యతే;—
నకర్మణా నప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానసుః

తా. తత్త్వమస్యాది మహావాక్యములయందున్న లక్ష్యము నెవరు తెలియుదురో వారే అవధూత లనబడుచున్నారు.

అట్టి మహనీయులకు చేయవలసిన కర్మలులేవు. చూడవలసిన జనులులేరు. పొందవలసిన ధనములేదు. సర్వమును విడిచినవారై సర్వకాల సర్వావస్థలయందును వారి మానస మమృతస్వరూపమై యుండును.

మూ. యథాఽరవి స్సర్వరసా న్ప్రభుఙ్క్తే
హుతాశన శ్చాపిహి సర్వభక్షః
తథైవయోగీ విషయాన్ప్రభుఙ్క్తే
నలిప్యతే పుణ్యపాపై శ్చ శుద్ధః.
ఆపూర్యమాణ మచలప్రతిష్టమ్
సముద్రమాపః ప్రవిశన్తియద్వత్
తద్వత్కామాయం ప్రవిశన్తిన ర్వే
సశాన్తిమాప్నోతి నకామకామీ
న నిరోధో నచోత్పత్తి ర్న బన్ధో నచసాధకః
నముముక్షు ర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా.

తా. సూర్యుడు సర్వరసముల నావిరిగాపముగా చేయునట్లును, అగ్ని తనలోపడు సమస్తపదార్థములను భస్మముచేయునట్లును యోగి విషయములచే నావరింపబడు, తత్తద్విషయములను లయమునొందించి, పుణ్యాపాపముల నంటక శుద్ధుడైయుండును.— అనేకములగు నదీప్రవాహములు సముద్రములోకలిసినను చలింపకుండ (వికృతిని పొందకుండ) ట్లుండునో అట్లే కోర్కెలెల్ల నేజ్ఞానిని వికృతినందింపజాలవో అతడే పరిపూర్ణుడు. అతడే మనశ్శాంతిని గాంచును. విషయములందు వాంఛ యున్నవాడు మనశ్శాంతి నందలేడు.

సృష్టిస్థితిలయములు లేవు. ఉపాసకుడు లేడు. ముముక్షువు లేడు. ముక్తుడును లేడు. అనియు అఖండపరిపూర్ణమే నిండియున్నదనియు తెలియవలెను.

సూ. గుఞ్జాపుఞ్జాది దహ్యేత నాన్యారోపితవహ్నినా
నాన్యారోపితసంసారధర్మా నేక మహం భజే.

తా. గురువింజగింజమీాద ఎరుపు ఆరోపితమేగాని నిజమైన అగ్ని కాజాలదు. ఎర్రగా నున్నందువలన నదికాల్పలేదుగదా! అట్టులే సర్వ సంసారముకూడ ఆరోపితమేగాని నిజముకాదని తెలిసినయెడల సంసార ధర్మము లంటక విలక్షణుడైన పరమాత్మను తెలియును.

సూ. ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానన్దోవిభాతి మేసర్వం
ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సంసారికం నవీక్షేఽద్య
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితంక్వాపి
ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మేనవిద్యతే కించిత్
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమత్ర సంపన్నమ్
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యోధన్యః పునఃపున ర్ధన్యః

అహోపుణ్య మహోపుణ్యం ఫలితం ఫలితంద్దృఢమ్
అస్యపుణ్యస్య సంపత్తే రహోవయ మహోవయమ్
అహోజ్ఞాన మహోజ్ఞాన మహోసుఖ మహోసుఖమ్
అహోశాస్త్ర మహోశాస్త్ర మహోగురు రహోగురుః॥ ఇతి—

తా. నేను ధన్యుడనైతిని. అజ్ఞానమంతయుపోయి బ్రహ్మానందము స్పష్టమగుటచేతను, సంసారదుఃఖములన్నియు విడిపోవుటచేతను, నిజస్వరూపము స్వీయమగు జ్ఞానముచే తెలియబడుటచేతను, అవిద్యతోగూడిన కర్మ చేయవలసినదియు, పొందవలసినదియు కించిత్తయినను లేకపోవు చేతను, సర్వమంత్రముల వలననగు ఫలము పొందబడుటచేతను శతధా సహస్రధా ధన్యుడనైతిని. ఇకనుచేయవలసిన దేదియునులేదు. పుణ్యము లన్నిటిలో గొప్పదగు పుణ్యము నందితిని. ఫలము లన్నిటిల గొప్పదగుఫలము నందితిని. దృఢమైన పదవి నందితిని. జన్మజన్మాంతరములనుండి చేసినపుణ్యసంపద చ్యుతము కాకుండగను, మరచిపోకుండగను నుండెడుపదవిని పొందితిని. జ్ఞానము లన్నిటిని విడచి ఆత్మజ్ఞానము పొందగలిగితిని. సుఖము లన్నిటికన్న మిన్నయగు ఆత్మసుఖము కలిగినది. శాస్త్రములన్నిటికన్న ఘనమగు ఆత్మశాస్త్రము దొరికినది. బాధగురువులుకాక బోధగురువులకైనను చెప్పశక్యముగాని అఖండ పరిపూర్ణమే శాశ్వతగురువుగను, సద్గురువుగను దొరికెనని తెలియవలెను.

## 80. త్రిపురతాపన్యు

మూ. పరమాత్మా సదాశివోఽక్షరం విమలం నిరుపాధిః;—
మనోహి ద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధ మేవచ
అశుద్ధం కామసఙ్కల్పం శుద్ధం కామవివర్జితమ్.
మనఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః

బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్
ఏకఏవాత్మ మన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు
స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ నవిద్యతే॥
ఇత్యేవం పరంబ్రహ్మరూపం సర్వభూతాధివాసం.

తా. పరమాత్మ ఎల్లప్పుడు శివస్వరూపమే; అక్షరస్వరూపమే; గాని క్షరస్వరూపము కాదు. ఏమలములు లేనివాడు, ఏయుపాధియు లేనివాడు అని తెలియవలెను.

మనస్సు శుద్ధమనియు, అశుద్ధమనియు రెండువిధములుగా నుండెను. కామసంకల్పముతో గూడినప్పుడు అశుద్ధమనియును, కామసంకల్ప వర్జితమైనపుడు శుద్ధమనియు చెప్పబడెను.

మనుష్యుని బంధమోక్షములకు కారణము తనమనస్సే యగుచున్నదిగాని ఇతరు లెవ్వరును కారు. విషయమం దాసక్తిగల మనస్సు బంధమగును. విషయములం దాసక్తి లేనిమనస్సు మోక్షమునకు కారణమగుచున్నది.

జాగ్రత్స్వప్న సుషుప్తులయందు ధ్యానించతగిన ఆత్మయొకటే అనియును,- త్రివిధ స్థానములయందు, అవస్థలయందు, జాగ్రత్స్వప్న సుషుప్తులయందును అవస్థలనంటక అతిక్రమించినవానికి జననమరణములుండవు.

పరిదృశ్యమానప్రపంచ మంతటను, సర్వభూతములలోను పరబ్రహ్మస్వరూపము నివాసముగ నున్నదనియు నమ్మవలెను. "వాసుదేవస్సర్వమితి" యను వాక్యమునుబట్టి సర్వమును భగవత్స్వరూపమనియు 'సర్వభూతనివాసోఽసి" అనుదానినిబట్టి సర్వభూతములయందు నివాసముగా నుండుటచే సర్వభూతములసేవయే భగవంతునిసేవయనియు తెలిసికొని చేయవలెను.

## 81. దేవి

మూ. హృత్పుణ్డరీక మధ్యస్థాం ప్రాతస్సూర్యసమప్రభాం
నమామిత్వా మహందేవి! మహాభయ వినాశినీమ్
నమామిభవభీతోఽహం సంసారార్ణవతారిణీమ్.

తా. ప్రాతఃకాలమందలి సూర్యబింబమువలె హృదయకమలమునం దాపరమాత్మ యుండునని తెలియుము. నిత్యము ఆ మహాస్వరూప మును ధ్యానించి నమస్కరించుచుంటివేని జననమరణాది రూపకమైన సంసారభయము నశించి తరించుమార్గము కరతలామలక మగును.

## 82. త్రిపుర

మూ. నిత్యా సాషోడశికం పురమధ్యం భిభర్తి,
దేవతాయై మహత్యై స్వాత్మీకృతే సుకృతీ సిద్ధిమేతి.
భగశ్శక్తిర్భగవాన్.

తా. షోడశకళలతో గూడినపురమందు మధ్యస్థమై నిత్యకళ యున్న దనియు; గొప్పమహత్తని చెప్పబడు ఆపరదేవతయే తననిజస్వరూపవ గను, ఆత్మస్వరూపముగను, సుఖస్వరూపముగను నుండి సిద్ధి నొందిం జేయున దనియును; సూర్యునికంటె కిరణములు వేరుకానట్లు లాభ వంతునిదైనశక్తి భగవంతునికంటె వేరుకాక భగవంతునిగనే చెప్పబ చున్నదనియును తెలిసికొనుము.

పుష్ప - గంధములకును, పంచదార - మాధుర్యములకును మధ్య వేరురూపము లేనట్లుగనే భగవంతునికినీ తచ్ఛక్తికినీ మధ్య వేరురూపము లేదని నమ్మినయెడల సూర్యోదయమైన పిదప చీకటిపోయినట్లు అజ్ఞాన జనితములగు ఆభాసలన్నియు నశించును.

83. క ర్మ

మూ. సర్వోపాధివినిర్ముక్తం స్వాత్మానం భావయే త్సుధీః
సర్వవేదాన్త సిద్ధాన్తసారం వచ్మి యథార్థతః.

తా. సర్వోపాధులను విడచి తననిజమైన ఆత్మ నెవరు తెల్పియుదురో వారు ముక్తులు కాగలరు. సర్వవేదాంతములలో చెప్పిన ముఖ్యసార దే యని యథార్థముగ తెలిసిన సాధకుడు ముక్తుడని తెలియుము.

84. భా వ నో

మూ. ఆత్మానమఖణ్డాకార మావృత్య సకలబ్రహ్మాణ్డ
మణ్డలం, స్వప్రకాశం ధ్యాయేత్,—
స్వ వ్యతిరిక్త వస్తు సంఘ రహితస్మరణం విభూషణమ్,
సమస్తయాతాయాతవర్జ్యం నైవేద్యమ్; అవస్థా
త్రయీ ఐకీకరణం తామ్బూలమ్;—
శ్రీచక్రరాజసాన్నిధ్యం గ్రహదోషనివారణమ్
సర్వానిష్టప్రశమనం సర్వసౌభాగ్యకారణమ్॥

తా. అఖండముగనున్న ఆత్మస్వరూపమును ఆవరణ విక్షేపశక్తు లతో గూడిన బ్రహ్మాండములు సర్వజగత్తుతో కప్పబడెను. అయ్యా నావరణము తన నిజప్రకాశముచే ధ్యానముచే ఖండించవలెను.
తనకంటె వేరుగ నొకవస్తువైనను లేదను దృఢనిశ్చయముచే ఖండించి స్మరణలో నుండుటయే భూషణమనబడును. రాకపోకలులేని స్థితియే నైవేద్యము. మూడవస్థలు లేక ఏకస్వరూపముగా నుండుటే (గుణ త్రయాతీతముగ నుండుట) తాంబూలము.

ఈ శ్రీచక్రార్చన లున్నచోట గ్రహబాధలు, నానావిధములగ

వ్యాధిబాధలు నుండజాలవు. మహత్తరసౌఖ్యము కలుగును. అది యునుగాక నాశనములేని అఖండసౌభాగ్యము కలుగును.

## 85. రుద్రహృదయము

మూ. సర్వాధిష్ఠాన మద్వన్ద్వం పరంబ్రహ్మ సనాతనమ్
తదాత్మకత్వా త్సర్వస్య తస్మాద్భిన్నం నహిక్వచిత్
అహమస్మీతి నిశ్చిత్య వీతశోకో భవేన్మునిః
స్వశరీరే స్వయంజ్యోతి స్స్వరూపం సర్వసాక్షిణమ్॥

తా. అధిష్ఠానమై, ఏకస్వరూపమై, చిరకాలమునుండియు నున్న యఖండపరబ్రహ్మము సర్వజగత్తునకు కారణమగుచున్నది. పూర్ణాత్మ కంటె వేరుగనున్న సర్వము మిథ్యయేయని తెలియుము.

బ్రహ్మమే నేను; నేనే బ్రహ్మము నని యనుకొను మహాముని శోక మోహములను విడచి తనశరీరములోనే స్వయంజ్యోతిచే తననిజస్వరూప మును తెలిసి విదేహు డగుచున్నాడు.

## 86. మోగకుండల్య

మూ. అభ్యాసం జన్మనామన్తే కృత్వా తద్భావసాధితమ్
గురువాక్యసమాభిన్నే బ్రహ్మజ్ఞానం స్ఫుటీభవేత్
కర్ణధారం గురుంప్రాప్య కృత్వా సూక్ష్మంతరన్తిచ
అభ్యాసవాసనాశక్త్యా తరన్తి భవసాగరమ్.

తా. అనేకజన్మలనుండియు చేసినఅభ్యాసబలముచే తన య స్వరూపమును పొంది కృతార్థు డగుచున్నాడు. అట్టివాడు చేయఁ కృత్యములేవియు లేవు.

గురువాక్యములచే మనస్సునకు సమాధానము (సంశయ రాహిత్యము) కలుగకపోయినచో బ్రహ్మజ్ఞానము విపులముగ గోచరముకాదు. గురువుచెప్పుచున్న సద్బోధను చక్కగ గ్రహించి అధ్యాత్మారాముని, ఆసద్గురుమూర్తిని పొందవలెను. సూక్ష్మబుద్ధిచే నాపదార్థమును పొందినవాడు జనన మరణాది రూపమగు దుష్కరప్రవాహమును దాటి కృతకృత్యుడగుచున్నాడు.

అభ్యాసబలముచే వాసనలు విడిచినవాడే యి మ్మహాసముద్రమును దాటగలవాడు.

## 87. భ స్మ జా బా ల

మూ. అనాద్య స్తం, నిష్కళం, నిర్గుణం, శా స్తం, నిరఞ్జన, మనామయమ్॥

తా. ఆ పరమశివుడు సృష్టిస్థితి సంహారములు లేనివాడు. నిష్కళుడు, నిర్గుణుడు, నిరంజనుడు, శాంతుడు, వృత్తిరహితుడు, నామరూపములులేనివాడు, నని యెఱుంగవలెను.

## 88. రుద్రాక్షజాబాల

మూ. భక్తానుగ్రహకారణాత్ భక్తానాం ధారణా త్పాపం
దివారాత్రకృతం హరేత్.

తా. ఆపరమశివుడు భక్తులయందు దయకలిగి యుండుటయే ముఖ్యకార్యముగ గలవాడగుటచే భక్తులందరియొక్క పాపములను తత్తద్భక్తి తారతమ్యము ననుసరించి రాత్రింబగళ్లను భేదములేక హరించును.

## 89. గ ణ ప తి

మూ. త్వం వాఙ్మయ స్త్వం చిన్మయ స్త్వ మానన్దమయ
స్త్వం బ్రహ్మమయ స్త్వం సచ్చిదానన్దాద్వితీయోఽసి

త్వం ప్రత్యక్షం బ్రహ్మాఽసి త్వం జ్ఞానమయో
విజ్ఞానమయోఽసి;—
సర్వంజగదిదం త్వత్త స్తిష్ఠతి సర్వంజగదిదం త్వయి
ప్రత్యేతి;—
నమో వ్రాతపతయే నమోగణపతయే నమః ప్రమథ
పతయే నమస్తే అస్తు లంబోదరా యైకదన్తాయ
విఘ్న వినాశినే శివసుతాయ వరదమూర్తయే నమోనమః.

తా. నీవు వాఙ్మయుండవు; చిన్మయుండవు; ఆనందమయుండవు; బ్రహ్మమయుండవు; సచ్చిదానంద స్వరూపుడవు; రెండవదిలేని ప్రత్యక్ష పరబ్రహ్మ స్వరూపుడవు; నీవే జ్ఞాన విజ్ఞానమయుడవు;—

నీవలననే సకలప్రపంచమును కలుగుచున్నది. నీవే ప్రపంచము నందలి జంగమస్థావరములను రక్షించుచున్నావు. నీయందే ప్రపంచ మంతయు లయమును పొందుచున్నది;—

సమస్త సముదాయములకును, సకల గణములకును నధిపతి యగుగణేశునకు నమస్కారము. లంబోదరునకు, ఏకదంతునకు, సమస్త విఘ్నములను నాశనము చేయువానికి, శివునికుమారునకు సకలాభీష్ట ముల ననుగ్రహించు నాదివ్యమూర్తికి నమస్కారము.

## 90. దర్శనో

మూ. తీర్థే దానే జపే యజ్ఞే కాష్ఠే పాషాణకే సదా
శివం పశ్యతి మూఢాత్మా శివేదేహే ప్రతిష్ఠితే
అన్తస్థం మాం పరిత్యజ్య బహిష్ఠం యస్తు సేవతే
హస్తస్థం పిణ్డముత్సృజ్య లిహేత్కూర్పర మాత్మనః
శివమాత్మని పశ్యన్తి ప్రతిమానసయోగినః
అజ్ఞానినాం భావనార్థం ప్రతిమాః పరికల్పితాః.

తా. మంగళకరుడగు పరమాత్మ దేహమునందు ప్రతిష్ఠితుడై యుండ-మూఢుడు బాహ్యము లగుతీర్థములందును, దానములందును, జపముల యందును, యజ్ఞములయందును, కాష్టములయందును, పాషాణముల యందును, నప్పరమాత్మను గాంచుటకు ప్రయత్నించుచున్నాడు. ఎవ్వడు తన దేహమునందు ప్రతిష్ఠితు డైయున్న దేవుని విడనాడి వెలుపల నెచ్చటనో యుండె ననితలచి విగ్రహాదులయందు వెదకు చున్నాడో; వాడు చేతియందలి వెన్న ముద్దను విసర్జించి తనమోచేతిని నాకుటకు ప్రయత్నించు మూర్ఖునితో సమానుడు.

యోగీశ్వరు లగువారు పరమాత్మను తమలోపల గాంచు చుందురు గాని విగ్రహాదులయందు చూచుటలేదు. మూఢులు నజ్ఞానులు నగువారల భావనార్థమై విగ్రహములు కల్పింపబడిన వని యెఱుంగవలెను.

మూ. ఆత్మతీర్థ మహాతీర్థ మన్యతీర్థం నిరర్థకమ్
శతశోఽపి జలై ర్ధౌతం సురాభాణ్డ మివాశుచి.

తా. కల్లుకుండ నూరుకడవల నీటితో కడిగినను, శుభ్రవస్త్రముతో తుడిచినను శుచికానియట్లు లన్యతీర్థములయం దెంతకాలము మునిగినను లాభములేదు. ఆత్మతీర్థమే మహాతీర్థమని యెరిగివర్తింపవలెను.

మూ. అపూర్వ మపరంబ్రహ్మ స్వాత్మానం సత్య మద్వయమ్
ప్రజ్ఞానఘన మానన్దం యఃపశ్యతి సపశ్యతి
నాడీపుంజం సదాసారం నరభావం మహామునే
సముత్సృజ్యాత్మనాఽఽత్మాన మహా మిత్యవధారయ
అశరీరం శరీరేషు మహాన్తం విభు మీశ్వరమ్

ఆనన్ద మక్షరంసాక్షా న్మత్వాధీరో నశోచతి
విభేదజనకే జ్ఞానే నష్టే జ్ఞానబలాన్మనే
ఆత్మనో బ్రహ్మణోభేద మసన్తం కింకరిష్యతి.

తా. పరబ్రహ్మము నపూర్వముగను, అపరముగను భావింపవలెను. పూర్వమనగా: తనకంటె ముందుగా నున్నదనునది కారణము. అట్టి కారణములేనిది అపూర్వమనబడును. పరమనగా-తనకంటె తరువాత పుట్టినదనునది కార్యము. అట్టికార్యాదికములేనిది అపరము. ఇట్టిబ్రహ్మము సత్యముగ అద్వయము. (తనకంటె భిన్నమైనదిలేనిది) ప్రజ్ఞానఘనమైనది, ఆనందస్వరూపమైనది యనియు, నిట్టిబ్రహ్మమే తాననియు నెవ్వ రెఱుంగుదురో; వారే జ్ఞానులనబడుదురు.

చిత్తశుద్ధి యెంతవఱకు కలుగజాలదో అంతవఱకు నరభావమును పొంది యోగాభ్యాసాదికములగు శాస్త్రప్రతిపాదితోపాయ సమాశ్రయణముచే బ్రహ్మభావమును పొందినవాడై-నరభావ మనునది నాడీపుంజమనియు సారములేని సంసారమనియు చక్కగనెఱింగి నరభావము - జీవభావము వదలినవాడై "యద్భావం తద్భవతి" యనునట్లాత్మభావమును పొందును. (నేనే ఆత్మస్వరూపుడ నను దృఢభావనను పొందవలయును) ఇట్టి ఆత్మభావము తెలిసినవాడు ఈపాంచభౌతికదేహము తనదికా దనియును; బ్రహ్మాది పిపీలికాంతమగు ప్రాణిజాతముయొక్క శరీరముల యందు సాక్షిమాత్రుడై పరమేశ్వరుడుండు ననియును; అట్లగుటచే నాతడశరీరు డనబడుననియును; ఆనంద స్వరూపుడగుననియు, నట్టి పరమేశ్వరుడే తా నను దృఢబుద్ధికలిగి దుఃఖింపజాలడు.

సాంస్కృతీజ్ఞాన బలమువలన నజ్ఞానము నశించుచున్నది. అజ్ఞానము నశించునంత తనకంటె వేరుగబ్రహ్మము లేదను దృఢతరమగు జ్ఞానము కలుగును.

మూ. అథాతః సంప్రవక్ష్యామి సమాధిం భవనాశనమ్
సమాధి స్సంవిదుత్పత్తిః పరజీవైకతాంప్రతి
నిత్య స్సర్వగతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః
ఏకస్సన్ భిద్యతే భ్రాన్త్యా మాయయా నస్వరూపతః
తస్మా దద్వైత మేవాస్తి నప్రపంచో నసంసృతిః
యథాకాశో ఘటాకాశో మఠాకాశ ఇతీరితః
తథా భ్రాన్తై ర్ద్విధాప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా
నాహం దేహో నచప్రాణో నేంద్రియాణి మనోనహి
సదా సాక్షిస్వరూపత్వా చ్ఛివఏవాస్మి కేవలః
ఇతిధీర్యా మునిశ్రేష్ఠ! సాసమాధి రిహోచ్యతే.

తా. ఇక జన్మ సంసార నాశకర మగుదానినిగూర్చి వివరించు చున్నాడు. పరమాత్మయు, దేహాభిమాని యగుజీవుడును వాస్తవముగ నొక్కడే యనుజ్ఞానము కలుగుటయే సమాధియని చెప్పబడును. కూటస్థుడును, దోషవర్జితుడును, సర్వగతుడును, నిత్యుడునునగు ఆత్మయొక్కడే అయినను భ్రాంతిచే వేరుగ గనబడును; గాని వాస్తవముగ చూచిన యెడల నాతడు వేరుకాజాలడు. కావున అద్వైతమే వాస్తవముగాని బ్రహ్మముకంటె వేరుగ జగత్తుగాని సంసారముగాని లేదు.

ఆకాశమంతయు నొక్కటియే యైనను భ్రాంతియుతు లద్దానిని ఘటాకాశ మఠాకాశము లనుచు భేదమును నిరూపించునటుల యాత్మ యొక్కటియే యైనను 'జీవ బ్రహ్మ' లని భేదముగ యజ్ఞాను లందురు.

నేను దేహేంద్రియములుకాను. సర్వసాక్షి స్వరూపుడనగుటవలన కేవల మీశ్వరుడనే నేను. అని యిట్టి స్థిరబుద్ధి సర్వదా కలిగియుండుటయే సమాధి యనిచెప్పబడును. దీనినే నిర్వికల్పసమాధి యనియు చెప్పుదురు.

## 91. తారసార

మూ. తత్పరః పరమపురుషః పురాణపురుషోత్తమో నిత్య
శుద్ధ బుద్ధ ముక్త సత్య పరమానన్దానన్తాద్వయ
పరిపూర్ణః బ్రహ్మైవాహం రామోఽస్మి॥

తా. సృష్టికి పూర్వమందున్న యాపరతత్వమే (ఆపరమ పురుషుడే) ఈసృష్టిలో సకలపురాణములలో నుత్తమపురుషుడుగను, నిత్య స్వరూపుడుగను, శుద్ధబుద్ధ ముక్తముగను, (ఏవిధమైన మలములు లేనివాడుగను) నిత్యస్వరూపుడుగను (సమస్తమగుసృష్టి నశించినను నాశనము లేకుండ యథార్థముగ నున్నవాడుగను) పరమానంద స్వరూపుడుగను, అనంత స్వరూపుడుగను, అద్వయుడుగను (రెండవది లేనివాడుగను) అఖండ పరిపూర్ణుడుగను చెప్పబడిన యాపరబ్రహ్మమే శ్రీరామచంద్రమూర్తి అని తెలియవలెను.

## 92. మహావాక్యము

మూ. అథ హోవాచ భగవాన్బ్రహ్మాఽపరోక్షానుభవ పరో
పనిషదం వ్యాఖ్యాస్యామః గుహ్యాద్గుహ్య తరైషా
న ప్రాకృతాయోపదేష్టవ్యా సాత్వికాయాంత
ర్ముఖాయ పరిశుశ్రూషవే॥

తా. ఇయ్యుపనిషత్తునం దాత్మకంటె వేరుగ ప్రపంచ మనునది యుండుట సంభవింప జాలదనియు, శాస్త్రయుక్త్యనుభవ విమర్శన పూర్వకముగా విచారించినయెడల బ్రహ్మమాత్రమే కలదనియు ప్రతిపాదింపబడుచున్నది. ఈవిషయము క్రమముగ సంగ్రహముగ తెలుపబడును. సాధనచతుష్టయ సంపత్తిగలుగుటచే నుత్తమాధికారులైన పురుషులనుజూచి సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మ ఆత్మానుభవము

నిట్లు ప్రకటించియున్నాడు. కేవలము అపరోక్షానుభవమును మాత్రమే ప్రతిపాదించునట్టి యుపనిషత్తును మాత్రమే మేము చెప్పుచున్నారము.

ఈ చెప్పబోవు ఉపనిషత్తు అతిరహస్యమైనది. కావున దీని నసర్వుల కుపదేశింపక అతిరహస్యముగ నుంచవలెను. ఇయ్యుపనిషత్తు సాధన చతుష్టయ సంపత్తిలేని సాధారణపురుషుల కుపదేశింపక, సత్వగుణ ప్రవృత్తి గలవారలకును, విషయాది కాంక్షల విడచి అంతర్ముఖులైన వారికిని, స్వాచార్య శుశ్రూషాపూర్వకముగ చరించువారికి నుపదేశింప వలెను.

మూ. అథ సంసృతిబంధమోక్షయోః విద్యాఽవిద్యే చక్షుషే
ఉపసంహృత్య విద్యాయాఽవిద్యా లోకాండ
స్తమోదృక్.—
తమోహి శారీరప్రపఞ్చ మాబ్రహ్మస్థావరాన్త మన
న్తాఖిలాజాండభూతం నిఖిల నిగమోదిత కర్మవ్యవ
హారో లోకః॥

తా. నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వము నను సాధనచతుష్టయ సంపత్తి కలిగినతరువాత ముముక్షు వగువాడు సంసారబంధ మన నేమియో; మోక్షమన నేమియో; అవిద్యయు — విద్యయునన నేమియో యెఱుంగవలెను.

బంధమనగా:— తనకంటె భిన్నముగా బ్రహ్మమగు నొకటి కలదను భావన. దీనికే ప్రవృత్తిమార్గమని వ్యవహరింతురు.

ఇట్టి సంసారబంధమునకును, మోక్షమునకును కారణభూతము లగునవి అవిద్యాచక్షుస్సు, విద్యాచక్షుస్సునని రెండువిధములు. అందు అవిద్యాచక్షుస్సు సంసారమనునది వాస్తవముగ కలదని తోపింపచేసి

బంధమునందు బ్రవర్తింప జేయుచుండుటచే బంధహేతు వగుచున్నది. విద్యాచక్షుస్సు సంసారమును నివర్తింపజేసి మోక్షమునందు బ్రవర్తింప జేయుటచే మోక్షహేతు వగుచున్నది. ఇయ్యవిద్యా విద్యాచక్షుస్సులు రెండును రెండునేత్రములవలె నుండి సంసారమనునది వాస్తముగ కలదని యొకటియు, లేదని యొకటియు తెలుపుటచే వేదసరూపమగు ఆభాస కలుగుచున్నది. బ్రహ్మాతిరిక్తముగ నెట్టివస్తువైనను వాస్తవముగ లేదను సమ్యక్ జ్ఞానముచే ఆభాసరూపమైన బ్రపంచమును నిరసించి స్వతస్సిద్ధమైన బ్రహ్మమును నిష్ప్రతియోగిక స్వమాత్రముగ నెఱింగిన పండితుడు విదేహముక్తు డగుచున్నాడు.

అవిద్యానేత్రము గలవా డవిద్యాదృష్టితో బ్రహ్మముకంటె భిన్నముగ మరొక్కటికలదని భావించును. బ్రహ్మము నావరించు కొను చుండుటచే నితడు తిమోదృష్టి కలవాడని చెప్పబడును. స్వావరకము — తన్నుకప్పివైచునది యగు తమస్సనునది ఎట్టిది అనగా: స్వజ్ఞానము చేతగాని కాలవిక్షేపముచేతగాని నశించునది. అదియే శరీర మనబడు చున్నది. దీనికే అవిద్య యనిపేరు. అవిద్యయే స్థానము. ఇయ్యవిద్యా కార్యమే బ్రహ్మమొదలు స్థావరములవఱకు గలిగియున్నది. ఇదియే జగత్తు. బ్రపంచ మనగా:— అంతట వ్యాపించియుండునది. బ్రహ్మము నావరించి యున్నదనియు, వ్యవహారకాలమందుమాత్రమే ఉన్నదానివలె తోచుచున్నదికావున వ్యవహారికమును ఆభాసకమని యెఱుంగవలెను. అనంతమును సకలమును నై వెలయుచు బ్రహ్మాండముగతోచు చున్న చరాచరసర్వప్రపంచము ఆభాసకముగను, ప్రాతిభాసికముగను చెప్పబడుచున్నది. అజ్ఞానలోకమును బాగుగ నెఱుంగవలెను. తా నెవరో తెలిసికొనలేని జనసముదాయ మజ్ఞానలోకమని వాడబడుచున్నది.

మూ. పరమాత్మాऽऽవిర్భవతి —

సహస్రభానుమచ్ఛురితా పూరితత్వాదలీయా పారావార

పూర్ణఇవ నైషాసమాధిః నైషాయోగసిద్ధిః నైషో
మనోలయః బ్రహ్మైక్యంతత్ ॥

తా. పరమాత్మ స్వమాత్రముగ, నిజస్వరూపముగ ఆవిర్భవించును. అట్టి పరమాత్మయే తా నగుచున్నాడు.

బ్రహ్మమాత్ర పర్యవసన్నమైన తత్వజ్ఞానవృత్తి ఒక్కసారిగ కోటిసూర్యు లుదయించినప్పు డుండునట్టి కాంతిచే ప్రకాశించుచుండును. ఇట్టి బ్రహ్మమాత్ర పర్యవసన్నమైన వృత్తి అలలులేని నిండుసముద్రము జలముచే పరిపూర్ణమై యుండునట్లు బ్రహ్మమాత్ర రస స్వరూపముచే సంతతనిండి చిచ్ఛక్తి లేకయుండును. ఇట్టివృత్తిని సమాధియనిగాని, యోగసంసిద్ధి యనిగాని, మనోలయ మనిగాని చెప్పుటకు వీలుకాదు. ప్రత్యగ్బ్రహ్మైక్య మనియే భావింపదగినది.

మూ. ఆదిత్యవర్ణం తమసస్తుపారే సర్వాణిరూపాణి విచిత్య
ధీరః, నామానికృత్వాఽభివ దన్యదాస్తే;—
ధాతా పురస్తా ద్య ముదాజహార శక్రః ప్రవిద్వాన్
ప్రదిశ శ్చతస్రః తమేవం విద్వా నమృత ఇహాభవతి
నాన్యఃపన్థా అయనాయ విద్యతే;—
యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తానిధర్మాణి ప్రథమా
న్యాసన్ తేహనాకం మహిమాన స్సచన్తే యత్ర
పూర్వే సాధ్యాస్సన్తి దేవాః॥

తా. ప్రత్య గ్బ్రహ్మైక్యమన నేమియో చెప్పబడుచున్నది. ఏది ప్రత్య క్పర చిదైక్యగత సవిశేషమును నిరసించుటచే సిద్ధ మగు చున్నదో అట్టి పరబ్రహ్మము అంధకారముయొక్క అంతమందును నుద యాస్తమయములులేని చిదాదిత్య రూపాత్మకమయి సచ్చిదానంద

రూపముతో అంతట పరిపూర్ణముగ ప్రకాశించుచున్నది. బ్రహ్మవేత్త యగువాడు స్వాతిరిక్త మైనట్టియు, నవిద్యాగోచర మైనట్టియు, నామ రూపముల నన్నిటిని మిథ్యాభూతములని నిరసించినవాడై బ్రహ్మముకంటె వ్యతిరిక్తముగ నేమియు లేదని యెప్పుడు నిస్సంశయముగ బల్కునో అప్పుడే బ్రహ్మస్వరూపు డగుచున్నాడు.

ఇంద్రాది దేవతలును, జ్ఞానయజ్ఞముచే యజ్ఞస్వరూపుడగు ఆత్మను యజనముచేసిరి. జీవన్ముక్తులగు న య్యింద్రాదులయొక్క అమానిత్వాది మైత్రాదిగుణములు ప్రధానములై నవిగ చెప్పబడెను. పూర్వులును. జీవన్ముక్తులును, సాధ్యులును నగుదేవతావిశేషు లేస్థానమునందుందురో మహాత్ము లా స్థానమును పొంది ప్రకాశించుచుందురు.

## 93. పంచబ్రహ్మ

మూ. సర్వదృష్టప్రశమనగ్ స్సర్వైశ్వర్య ఫలప్రదమ్
సర్వసౌభాగ్యదం నృణాం సర్వకర్మ ఫలప్రదమ్
అవస్థాత్రితయాతీతం తురీయం సత్యచిత్సుఖమ్
బ్రహ్మవిష్ణ్వాదిభి స్సేవ్యం సర్వేషాం జనకంపరమ్॥

తా. చూడబడుచున్న సర్వజగత్తును శమింపజేయునదియును, మహైశ్వర్యముగలదియును, అన్ని సౌభాగ్యములకన్న మిన్నయగు సౌభాగ్యమునిచ్చునదియును, అనేకజన్మములనుండి చేయుచున్న కర్మలవలన కలిగినమహాదోషము లనుమూడు అవస్థలకు విలక్షణమైనదియును, తురీయ స్వరూపమై శాశ్వతమైన సత్యసుఖము గలదియును, నశింపులేనిదియు, బ్రహ్మేంద్రాది త్రిమూర్తులుకూడ సేవింపతగినదియు (బ్రహ్మేంద్రాది పదవులుకూడ నశించిపోవును కావున వారుకూడ సేవింపదగినది.) సమస్తప్రజలకుగూడ నిత్యసుఖము నిచ్చు ఆ పరబ్రహ్మమే మనకు జనకుడు.

## 94. ప్రాణాగ్ని

సర్వోపనిషత్సారమ్:—

మూ. అన్తశ్చరతిభూతేషు గుహాయాం విశ్వతోముఖః
త్వంయజ్ఞ స్త్వంబ్రహ్మా త్వగ్రుద్ర స్త్వంవషట్కార
ఆపోజ్యోతీ రసోమృతంబ్రహ్మ భూర్భువ స్సువరోం నమః॥

తా. సర్వోపనిషత్తులసార మేమనగా: ఆభగవంతుడు సమస్త భూతములయొక్క హృదయములయం దుండువాడును, సమస్తములగు బుద్ధిగుహలయం దుండువాడును, సర్వత్ర అంతర్బాహ్యములందును నిండి యుండువాడును, మూర్తిత్రయాత్మకుడును, యజ్ఞస్వరూపుడును, వషట్కార స్వరూపుడును, ఇంద్రుడును, రుద్రుడును, విష్ణువును, బ్రహ్మ స్వరూపుడును నై యున్నాడు.

స్వప్రకాశుండ నైన పరమాత్మా! నీవు ఆపోజ్యోతిస్వరూపుడవు; అమృతరూపుడవు; రసరూపుడవు; బ్రహ్మస్వరూపుడవు; భూలోక భువర్లోకాదిసమస్త లోకస్వరూపుడవు; ప్రణవముతో గూడిన ఏకాక్షర స్వరూపుడవు.

## 95. గోపాల

మూ. అనేజదేకం మనోజవీయో నైతద్దేవా ఆప్నువన్
పూర్వ మర్షతు;
ఏకోదేవ స్సర్వభూతేషుగూఢ
స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా,
కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస
స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ.

తా. ఆత్మతత్వము చలనరహితమై ఏకరూపముగనుండి సర్వభూతములయందును ఒక్కటైయుండును. అతివేగముగల మనస్సుకంటె మిక్కుటమైన వేగముగల ఆత్మతత్వమును ఇంద్రియము లందజాలవు.

అద్వితీయుడగు నప్పరమాత్మ స్వయంప్రకాశుడై; సకల భూతములయందును, సమస్తజీవులయందును రహస్యముగ నున్నవాడై; అంతటను వ్యాపించియున్నవాడై; సమస్తభూతముల లోపలనుండు నాత్మస్వరూపమును, కర్మాధిపతియునై సర్వభూతములయందు నధిష్టించి నివసించియుండువాడైన సాక్షియును, సమీపముననుండి చూచువాడును, చైతన్యస్వరూపుడునునై; సమస్తంబగు నవ్యక్తాది విశేషశూన్యుడై; ఏకస్వరూపుడై; నిర్గుణుడై వెలయుచున్నవాడు.

96. కృష్ణో

మూ. అజయా వైష్ణవీమాయా జప్యేనచ సుతాపురా
దేవకీ బ్రహ్మపుత్రా సా యా వేదై రుపగీయతే.

తా. ఆవిష్ణుమాయకు విష్ణువే అధిపుడు గావున నమ్మాయాశక్తి జయింపసాధ్యముగానిది. దానిని బ్రహ్మదేవుడుసైతము జయింపలేకపోయెను.

మూ. దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవ యేప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే.

తా. "లోకోత్తరసామర్థ్యము కలదియు, త్రిగుణాత్మకమైనదియు నగు నాయొక్క ప్రకృతి దాటశక్యముకానిది. సమస్తధర్మములను వదలి ఎవ్వరాత్మమైన నన్నే శరణము పొందుచున్నారో వారలీ మాయయను ప్రకృతినిదాటుచున్నారు. కావున ఆత్మ పరమాత్మ జ్ఞానము

గలవారలుతక్క మిగిలినవార లీ మాయను దాటలేరు." అని గీతల యందు చెప్పబడెను.

దేవతలకుగూడ జయింప నలవిగానిదై కొనియాడబడుచున్న యీ మహామాయ బ్రహ్మవిద్య యనబడుచున్నది. ఆ బ్రహ్మవిద్యయే దేవకి నాబడుచున్నది. కావుననే శ్రీకృష్ణరూపమగు బ్రహ్మ తృష్ణ నశింప జేయుట కచ్చట నావిర్భవించెను.)

మూ. వనే బృన్దావనే క్రీడన్ గోపగోపీసురైస్సహ
గోప్యో గానరుచ స్తస్య యష్టికా కమలాననః.

తా. వేదార్థరూపుడగు శ్రీకృష్ణభగవానుడు గొప్పవనములు, నదీ తీరములు మున్నగువానియందును, బృందావనమందును గోపికలుగను గోపాలురుగను అవతరించిన దేవతలతోడను, దేవతా స్త్రీలతోడను కలిసి విహరించుచుండెను. ఆగోపగోపికలు శ్రీమహావిష్ణువుచే ప్రతిపాదిత మగు వేదముయొక్క మంత్రరూపములు. విహార సమయమునందు శ్రీకృష్ణభగవానుని హస్తమునందుండు వేణుదండమే బ్రహ్మదేవుడు. (జగద్గృహమునందు శ్రీమహావిష్ణువు బ్రహ్మరూప దండసహాయము చేతనే సకలకార్యముల నిర్వర్తించుచున్నాడు.

మూ. ఋచోపనిషద స్తాన్వై బ్రహ్మరూపా ఋచః స్త్రియః
ద్వేష శ్చాణూరమల్లోయం మత్సరో ముష్టికో యజః.

తా. ఋగ్రూపములగల ఉపనిషత్తును, వేదరూపములగు ఋకులను ఆ స్త్రీలుగను; ఈద్వేషమే చాణూరమల్లుడుగను; మత్సరః జ్ఞుడగు ముష్టికాసురుడుగను; ఉపనిషన్మంత్రములే షోడశసహస్రాల సంఖ్యగల స్త్రీలుగను; మంత్రములలో ఫలముకోరి చేయుటచే ఆకోరికద్వే మాయారూపస్త్రీగను యెఱుంగవలెను.

మూ. తస్మాన్నభిన్నం నాభిన్న మాభిర్భిన్నో న వై విభుః
భూమా వృత్తారితం సర్వం వైకుంఠం స్వర్గవాసినామ్.

తా. ఈవిధముగ శిష్యగణమునకు సకలోపదేశము లొనర్చిన శ్రుతియే యిప్పుడు శ్రీకృష్ణు నాశ్రయించియున్న దేవతలందరు శ్రీకృష్ణ రూపులే యనిచెప్పుచున్నది. వెనుక చెప్పబడిన నందాదిబృందమంతయు శ్రీకృష్ణభగవానునికంటె భిన్నము కాదు. సర్వదేవ వ్యాపకుడగు శ్రీహరియు, నీ సర్వజగత్తును శ్రీకృష్ణునికంటె భిన్నములుకావు. "ఏక మేవాద్వితీయంబ్రహ్మ" యని కలదుగాన భగవానుడునైత మీ సకల విభూతులకంటె భిన్నుడుకాడు. స్వర్గలోకమునందు, వైకుంఠమునందు నివసించునట్టి ఇంద్రాది దేవతాబృందమంతయు లోకానుగ్రహ సంగ్రహార్థ మిట్లు భూమియం దవతరించెను. "వైకుంఠం స్వర్గవాసినాం, బృన్దా వనం" అనగా:— దేవతలతోగూడిన యీబృందమంతయు ఆదిబ్రహ్మ స్వరూపమే కాని వేరుకాదు.

## 97. యాజ్ఞవల్క్య

మూ. స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్,

తా. ఈమాయతోగూడిన జగత్స్వరూపమును, స్త్రీస్వరూపమును విడిచిన మహాపుణ్యశాలి నిత్యసుఖమును పొందును.

మూ. యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధావసిద్ధౌచ కృత్వాపి ననిబధ్యతే.

తా. అయాచితముగా సంభవించిన యాహారపదార్థములతో తృప్తి పొందినవాడును, శీతోష్ణాది ద్వంద్వములను లక్ష్యము సేయనివాడును, మాత్సర్యము లేనివాడును నగు బ్రహ్మజ్ఞాని ఆహారాదుల యదృచ్ఛా

ప్రాప్తియందు నప్రాప్తియందును తుల్యబుద్ధికలవాడై యొకప్పుడు భిక్షాట నాదికర్మములను చేసినను కర్మబంధమును (సంసారమును) పొందడు.

మూ. చిదిహాస్తీతి చిన్మాత్ర మిదం చిన్మయమేవచ
చిత్త్వం చి ద్దహం తేచ లోకా శ్చి దితి భావయ.

తా. ఓ యాంజనేయా! జ్ఞానస్వరూపమగు పరమాత్మయే యిచ్చట నున్నది. ఈప్రపంచము సర్వము నా చిన్మయబ్రహ్మమే. మన మిద్ద రమును నా బ్రహ్మస్వరూపులమే. ఈకనబడు సర్వము పదునాలుగు లోకములు సమస్త చరాచరములున్నూ, సర్వజగత్తును, సర్వమును బ్రహ్మమే యని యెఱుంగుము.

98. వ రా హ ము

మూ. ఉపవాస స్స విజ్ఞేయో నతు కాయస్య శోషణమ్
కాయశోషణ మాత్రేణ కాతత్ర హ్యవివేకినామ్.

తా. ఉపవాసశ్రమచే శరీరశ్రమయే కాని ఆత్మ తెలియబడదు. శరీర శ్రమచే పరివేదనయేగాని విజ్ఞానము కలుగదు. అజ్ఞానము వదలనంత కాలమే యుపవాసములు చేయుటయు, ఆత్మను శుష్కింపచేయుటయు నని యెఱింగి సద్గురువు నాశ్రయించి యుపవాస మననేమియో తెలియ వలెను. గాని వృథా శ్రమపడఁగూడదు. తన నిజస్వరూపమును మరచి పోవు టుచితము కాదు. కావున అన్యనిష్ఠలవిడచి ఆత్మనిష్ఠను పొంద వలెను.

మూ. సుషుప్తికాలే సకలే విలీనే తమసావృతే
స్వరూపం మహదానన్దం భుఙ్క్తే దృశ్యవివర్జితః
నేతినేతీతిరూపత్వా దశరీరో భవత్యయమ్.

తా. సుషుప్తికాలమందు సర్వమజ్ఞానతమోంధకారములో మునిగి (సర్వదృశ్యము విడచి) శేషించిన పదార్థమును భుజింపవలెను. (రెండు పదార్థములుకాక ఏకత్వముకావలెను.) అదియే శరీరమనబడును. నేతి నేతియను మహావాక్యార్థమును తెలియవలెను. ప్రపంచవిషయములు. ఇంద్రియవిషయములు విడువకుండ ఆత్మను తెలియుట చాలకష్టము. నిత్యానిత్యవస్తు వివేకముచేసి ఆత్మతత్వము తెలియుట మఱియు దుర్లభము. తనయొక్క నిజస్వరూపము (అవస్థాచతుష్టయము దాటిన నిజావస్థ) తెలిసికొనుట చాలకష్టము. సద్గురువుయొక్క కరుణాకటాక్షము కలుగుట మఱియు దుర్లభము. జగత్తున చాలవఱకు బాధ గురువులేగాని బోధగురువులు లేకపోవుటచే తగిన సద్గురువు దొరుకుట యరుదు. దొరికినను తత్సద్గురు కటాక్షము కలుగుట అతిదుర్లభము-కావున నెన్నిశ్రమలకోర్చియైన సద్గురు కరుణాకటాక్షమును సంపాదింపవలెను.

మూ. పుంఖానుపుంఖ విషయే క్షణతత్పరోఽసి
బ్రహ్మావలోకనధియం నజహాతి యోగీ
సంగీత తాళ లయ వాద్యవశం గతాపి
మౌళిస్థకుంభ పరిరక్షణధీ ర్నటీవ.
సర్వచిన్తాం పరిత్యజ్య సావధానేన చేతసా.

తా. ఆడుచు పాడుచు భరతశాస్త్రప్రావీణ్యము నంతయు చూపు చుండియు జమత్కారియు, బుద్ధిమంతుడు నగునటుడు తనశిరముపై నున్న పెద్దదొంతర నించుకయైన నేమరక చిత్తమునంతయు నందే నిలిపి యుండుట లోకమున జూచుచున్నాము. అట్లే బ్రహ్మజ్ఞాని సర్వేంద్రియములతో సర్వవిషయముల ననుభవించుచున్నను సర్వకారణమగు స్వస్వరూపమును చూచుచునే యుండును. సర్వచింతలు విడచి ని-

స్వరూపమునందే నెమ్మదియును, శాంతమును కలిగియుండును, కాని దేనికిని తొందరగాని విచారముగాని పొందడు.

ఇంద్రజాలకుడు తనమాయచే కల్పింపబడినదగు సర్వమును శూన్యమే యని యెఱిగియుండుటచే భ్రాంతిలేక సర్వమును చేయుచున్నట్లు జ్ఞానియు తనమాయచే కల్పింపబడిన సర్వజగత్తు మిథ్యయనియు, స్వప్న సమనియు నెఱింగినవాడు కావున సర్వకార్యములు చేయుచున్నను దాని వికారములకు లోనుకాడు. (విషయముల నంటడు.)

మూ. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్న న్గచ్ఛన్ స్వపన్ శ్వసన్
ప్రలప న్విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతిధారయన్.

తా. నిష్కామకర్మముగల యోగి గురూపదేశముచే పరమార్థ తత్త్వమును దెలిసినవాడై జ్ఞాన కర్మేంద్రియ ప్రాణాదులయొక్క సమస్త మైన పనులకును కారణములగు వ్యాపారములయందు కర్తృత్వాభి మాన ముంచుకొనడు. జ్ఞానికి కర్మసంగము లేకుండుటచే నతడీ సర్వకర్మసన్న్యాస మనునవస్థను బొందినవాడని చెప్పబడెను.

ఎండమావులను చూచి యందుదకముకలదు త్రాగెదను. అని పరువులిడువాడు అందుదకము లేదని యెఱిగినపిమ్మట నందు దాహమును దీర్చుకొనుటకు ప్రవర్తింపనియట్లు లాత్మతత్త్వవేత్త, కేవల మింద్రియ ములు విషయములందు ప్రవర్తించుచున్నవి గాని నేనేమియును చేయుట లేదని జాగరూకుడై కర్తృత్వాభిమానమును విడుచును. కాన భేద జ్ఞానజనకములగు కర్మములెప్పుడును వానిని బంధింపజాలవని తెలియుము.

ఇందు చెప్పబడినవాడు జ్ఞానాధికారి గాని జ్ఞానపూర్ణుడు కాడని యెఱుంగవలెను.

మూ. జన్మమృత్యు సుఖ దుఃఖ వర్జితమ్
జాతి నీతి కుల గోత్ర దూరగమ్
పూర్ణమద్వయ మఖణ్డ చేతనమ్
విశ్వ భేద కలనాది వర్జితమ్ ;—
నకర్తా నైవభోక్తాచ నచ భోజయితా తథా.

తా. చావుపుట్టుకలు, సుఖదుఃఖములు, జాతి, నీతి, కులము, గోత్రము నను రీతి సమస్తము లగు ఆభాసలు, అభిమానములు విడచి అఖండా ద్వయ పరిపూర్ణమగు చైతన్యముకంటె నేను అనుపదార్థము వేరుగ లేదని నిశ్చయించి కల్పితానేకరూప సమన్విత మగు జగత్తు సంతను విడువవలెను.

నేను కర్తగాదు; ఏమియుచేయుటలేదు. నేను భోక్తకాదు; ఏమియు ననుభవించుటలేదు. నే నితరులచే ననుభవింప జేయుటయులేదు. కేవల సాక్షిమాత్రుడను. అకర్తను, అభోక్తను అని నిశ్చయించి కర్తృత్వాహం కారములను విడనాడినవాడే జ్ఞాని. అట్టిఅహంకారములేనిజ్ఞాని యేకార్య మును జేయడు. ఒకవేళ తెలియకచేసినను సర్వమును బ్రహ్మమను దృష్టి కలవా డగుటచే వాని నంటజాల వనుట సత్యము.

మూ. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః.

తా. పాండిత్యమును, ఉపశమమును (ఓర్పు) గల బ్రాహ్మణుని యందును, గోవుయందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్క మాంసముతిను ఛండాలునియందును బ్రహ్మమును సమముగ చూచు వారు జ్ఞానులు. అట్టిస్వానుభవముగల జ్ఞానులు సర్వమునందును సమబుద్ధి కలవారై యుందురు.

అట్టి జ్ఞానులు బాలోన్మత్త పిశాచాదులరీతిగ నుందురు.

మూ. య స్సమస్తార్థజాలేషు వ్యవహార్యపి శీతలః
పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే
ఆచార్య శాస్త్రమార్గేణ ప్రవిశ్యాశు స్థిరోభవ
శివోగురు శ్శివోవేద శ్శివోదేవ శ్శివఃప్రభుః॥

తా. జ్ఞాని లోకులరీతిగా సకలమైన వ్యవహారములు చేయుచున్నను ఇతరులుచేయు కార్యములవలె నేను, నాది యనుపట్టుదలతో చేయడు. ఒకవేళ చేసినను అహంకార మమకారములనువిడచి చేయును. సర్వజగత్తును మిథ్యయని తలచి భ్రాంతిలేనివాడై, ఆశారహితుడై, పరమ శాంతిని పొంది బ్రహ్మస్వరూపుడై, పూర్ణాత్ముడై యుండును.

గురువుచే చెప్పబడినదియు, శాస్త్రములయం దుద్ఘోషింప బడుచున్నదియు నగు సారము నెఱింగి, తన్మార్గముగ నేగినవాడు తనప్రవృత్తి యంతయు శాంతించినవాడై జననమరణములు లేక స్థిరముగ నుండును.

శివుడే గురువు ; శివుడే వేదము ; శివుడే దేవుడు ; శివుడే అఖండ పరబ్రహ్మము ; శివుడే సర్వజగత్తునకు విభుడు నని తెలియవలెను.

మూ. శుకోముక్తో వామదేవోఽపి ముక్త
స్తాభ్యాంవినా ముక్తిభాజో వసన్తి
శుకంమార్గం యేఽనుసరన్తి ధీరా
స్సద్యోముక్తా స్తే భవన్తీహ లోకే,
వామదేవం యేఽనుసరన్తి నిత్యం
మృత్వా జనిత్వాచ పునఃపున స్తత్
తేవై లోకే క్రమముక్తా భవన్తి
యోగై స్సాఙ్ఖ్యైః కర్మభి స్సత్వయుక్తైః,
శుకశ్చవామదేవశ్చ ద్వేశ్రుతీ దేవనిర్మితే

శుకోవిహంగమః ప్రోక్తో వామదేవః పిపీలికా,
ఏతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేనవా
మహావాక్యవిచారేణ సాంఖ్యయోగసమాధినా,
విదిత్వా స్వాత్మనోరూప మసంప్రజ్ఞాసమాధితః
శుకమార్గేణ విరజాః ప్రయాన్తి పరమం పదమ్.

ఇతి ప్రథమముత్తమం :—

యమా ద్యాసనజా యా సహఠాభ్యాసా త్పునః పునః
విఘ్న బాహుళ్యసంజాత అణిమాది వశాదిహ,
అలబ్ధ్వా విఫలంసమ్యక్ పునర్భూత్వా మహాకులే
పూర్వవాసనయైవాయం యోగాభ్యాసం పునశ్చరన్,
అనేక జన్మాభ్యాసేన వామదేవేనవై తథా
సోఽపిముక్తిం సమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్,
ద్వావిమా వథపన్థానౌ బ్రహ్మప్రాప్తికరౌ శివౌ
సద్యో ముక్తిప్రదస్త్వేకః క్రమముక్తిప్రదః పరః,
అత్రకో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః
యస్యానుభవపర్యన్తా బుద్ధిస్తత్త్వే ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యన్తే సర్వపాతకైః
ఖేచరా భూచరా స్సర్వే బ్రహ్మవి ద్దృష్టిగోచరాః
సద్యఏవ విముచ్యన్తే కోటిజన్మార్జితై రఘైః.

తా. శుకమార్గము, వామదేవమార్గము నను రెండుమార్గములు ముక్తిదములుగ దేవనిర్మితములై యున్నవి. అందేమార్గము ననుసరించిపోయినను ముక్తిని పొందుచున్నారు; కాని వానిలో శుకమార్గము సద్యోముక్తిప్రదము - వామదేవమార్గము క్రమముక్తిప్రదము. శుకమార్గము జ్ఞానయోగము - వామదేవమార్గము కర్మయోగము. వాయు

ధారణాది హఠయోగము మొదలగు యోగాదులవలన విఘ్న బాహుళ్య మును పొందుచు జననమరణములు కలవారై అనేక జన్మాభ్యాస పుణ్యమువలన క్రమముగ ముక్తులగుదురు.

శుకమనగా:— పక్షి, (విహంగము) ఇది సాధారణముగ నేదేని యొక వృక్ష శాఖాగ్రమందున్న ఫలమును చూచినచో తక్షణ మందు ప్రవే శించి యాఫల మనుభవించును. అటులనే జ్ఞానయోగి తురీయస్వరూప బ్రహ్మతత్వము తెలిసినయపుడే తత్స్వరూపుడై అవిద్యాముక్తు డగును. కావున జ్ఞానయోగము శుకమార్గ మనిచెప్పిరి.

వామదేవమనగా:— పిపీలికము. ఇదియు వృక్షాగ్రమందున్న ఫలా స్వాదనాసక్తి కలదై తత్ఫలమును కోరియే వృక్షారోహణము చేయును. మధ్యేమార్గమున దీనికి శాఖాంతరాదులచే వినిపాతములు కలుగును. ట్లయినను చిరకాలమున కా ఫలము సిద్ధించుచున్నది. కావున -ష్కామకర్మ హఠయోగాదులకు పిపీలికా సాదృశ్యముచే వామదేవ మార్గమని చెప్పిరి.

పై రెండుమార్గములనుబట్టి జ్ఞానయోగ మావశ్యకమై యున్నది. జ్ఞానయోగ మావశ్యకమని సద్గురుశాస్త్రాదు లుద్ఘోషించుటలో ,ాథార్థముకలదని పుణ్యపూరుషు లూహింపవలెను. శుకమార్గము గమమైనదేకాని దొరుకుటమాత్ర మరుదు. అలవడుటయును కష్టము. మీాపమార్గ మనుమాటయెగాని పక్షివలె యెగిరి ఫలమునంద ప్రయ త్నించునపుడు క్రిందికి పడిపోవుదుమను భయసంశయములు సాధకులకు కలుగవచ్చును; కాని సమీపము, దూరము, సులభము, కష్టము నను నవి మన యనుభవములో నున్నవి కాని శాస్త్రమున లేవు. కాగా శాఖాగ్రమందలి ఫలముకావలె ననుయాతురత యెంతతీవ్రముగ నుండునో దానినిబట్టి ఫలమంత సులభముగ దొరుకును. ఇట్టి లక్ష్యము దృఢ ముగ నున్నచో పడిపోవుదు మనిగాని, ఎగురనే లేమనిగాని, దొరుకునో

దొరుకదో యనిగాని భయసంశయాదులు కలుగవు. తీవ్రతరమగు కృషి యెన్నటికిని విఫలము కానేరదు. -ఈజ్ఞానమార్గ మలవడకనే పోవచ్చును గాని యలవడినచో నిది జీడిపలె విడువదు.

వామదేవమార్గమున ప్రయత్నించితిమా యీ మానవజన్మపోవుట, మరల గర్భనరకమును పొందుటయు మున్నగు దుర్భర బాధాయుతము లగు గాథ లనేకములు కలుగవచ్చును.

కావున పుణ్యశీలురగు నో మహానుభావులారా! ఈ చక్కని రాజ మార్గమును గని రాజహంస లగుదురుగాక! నిత్యానిత్య వస్తువివేకముచే నిత్యవస్తువునుపొంది నిత్యసుఖము నందుదురుగాక! పక్షి యెగిరిన ట్లే బుద్ధి గుహనుండి ఋత సత్యము లను రెక్కల యాధారమున నెగిరి అమృతత్వ ఫలమునుపొంది శోకమోహములు లేని యఖండపరిపూర్ణు లగుదురుగాక!

## 99. శాట్యాయని

మూ. అహింసాతు తపోయజ్ఞో వాఙ్మనఃకాయకర్మభిః
ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః
కిమిచ్ఛ న్కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్॥

తా. మనోవాక్కాయములు నాబడు త్రికరణశుద్ధిగ జీవహింస చేయకుండుట తపస్సును మహాయజ్ఞముగ నెన్నబడుచున్నది; కాని నల్లని మేకనుచంపి అగ్నిగుండములో పడవైచి కాల్చి తినుట యజ్ఞముకాదు. ఇట్లు యజ్ఞములుచేసి జీవహింసచేయువారు నిజమైన బ్రాహ్మణులు కాజాలరు. అట్టివారిని జీవహింసకు లనకతప్పదు. జీవహింసకుడు బ్రాహ్మణుడగునా!

ఆత్మస్వరూపు డగుతానే బ్రహ్మమని తెలిసినజ్ఞాని ఏదియోపొంద వలె ననిగాని, దేనినైన కోరిగాని తపస్సుచేసి శరీరమును తపింప చేయును! - దేనినిగూడ కోరజాలడు, మూఢులరీతి తనకంటె వేరుగ దైవ

మున్నదని భ్రమించి యాదైవముంగూర్చి జపతపాదుల చేయుజాలడు. అన్నపానాదుల విడనాడి యుపవాసాదికములు సలుపుచు శరీరమును కష్టపెట్టజాలడు.

## 100. హ య గ్రీ వః

మూ. అథాఽహాభగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం యయాఽచిరా
త్సర్వపాపం వ్యపోహ బ్రహ్మవిద్యాం లబ్ధ్వైశ్వర్యవాన్
భవతి. తత్స్వరూపజ్ఞానాం వైదేహీంముక్తిశ్చ భవతి.

తా. ఓభగవంతుడా! శ్రేష్ఠమైనదియు, సదా సత్పురుషులచే సేవింపబడునదియు, జ్ఞానులుదేనిచే శీఘ్రముగ సర్వపాపముల బోగొట్టుకొని పరాత్పరుడగు పురుషుని (పరబ్రహ్మమును) పొందగలుగుచున్నారో అట్టిదియునగు బ్రహ్మవిద్యను నాకుపదేశింపుమని హాయగ్రీవుడు భగవంతు నడిగెను.

శరీరత్రయమంతయు వివేకజ్ఞానముచే పరిశోధించిచూచి, ఏహ్యాభావముచే దానినివిడిచి, తన నిజస్వరూపము తెలిసికొని శరీరత్రయములో నున్నను దానికివిలక్షణమై యుండుటయే బ్రహ్మవిద్య యనియును, త ద్బ్రహ్మవిద్య నెఱింగినవారలే విదేహముక్తు లగుదురనియు భగవంతుడు చెప్పెను.

## 101. ద త్తా త్రే య

మూ. ఓంనమోభగవతే దత్తాత్రేయాయ, స్మరణమాత్ర
సంతుష్టాయ, మహాభయనివారణాయ,
మహాజ్ఞానప్రదాయ, చిదానన్దాత్మనే, బాలోన్మత్త
పిశాచవేషాయేతి మహాయోగినే అవధూతాయేతి.

తా. ఓంకారమునకు విలక్షణముగనున్న యోభగవంతుడా ! సర్వ త్రయమునకు విలక్షణుడగు భగవంతుని స్మరించినమాత్రమున నెవడు సంతుష్టహృదయుడై. ఏవిధములైన భవభయములు లేనివాడై, మహా జ్ఞానసంపన్నుడై, చిదానందస్వరూపుడై, ఏ సంసారదుఃఖములు లేని వాడై, బాలోన్మత్త పిశాచాదులవలె సంచారము చేయునో అట్టి మహాయోగియే అవధూతయని చెప్పబడును.

## 102. గారుడ

మూ. విషం బ్రహ్మాతిరిక్తంస్యా దమృతం బ్రహ్మమాత్రకమ్.

తా. ఇయ్యుపనిష ద్వాక్యములోని సారమేమనగా :— బ్రహ్మ స్వరూప మొక్కటియే అమృతము వంటిది. మిగిలిన చరాచరాత్మక జగత్తంతయు విషమువంటిది. (బ్రహ్మసత్యం — జగన్మిథ్య) యనునట్లు తెలియవలెను.

గరుడపక్షి పామునుచంపునట్లాత్మచేత నహమనుపామును చంప వలెను. గారుడమంత్ర మాత్మమంత్రముగను, పాము నహంకారముగను దెలిసికొని యాత్మమంత్రముచే నహంకారమును చంపవలెను. ఈ గారుడ మంత్రమువలన సకల చరాచరములలోగల సర్వజంతువులవలన గలుగు భయ మేమాత్రమును లేదని చెప్పబడెను.

ఈగారుడమంత్రము నఖండపరిపూర్ణముగా దెలియుము. "సర్వ మన్త్ర సంపన్న" మ్మని చెప్పియుండుటచే సర్వమతసారమే అఖండ పరిపూర్ణమనియు, అదియే తాననియు తెలిసినపుణ్యాత్ముల కీసర్వజగత్తు తోను, జగత్తులోనున్న భయంకరములగు సకలజంతువులతోను ఏవిధ మైన సంబంధమునూలేదు.

సదా ఆత్మధ్యానమునం దున్నవాని కితరభూతములవలన నెప్పుడును యేవిధమైనభయము నుండదని దృఢముగ నమ్మవలెను.

మూ. దుష్ట కీట కపి శ్వాన మార్జాల జంబుక వ్యాఘ్ర
వరాహాణాం, జరాయు జాణ్డ జోద్భిజ స్వేదజానాం,
శస్త్ర బాణ క్షత స్ఫోట వ్రణ మహావ్రణ కృతానాం,
కృత్రిమాణా మన్యేషాం, భూతభేతాళ కీశ్మాండ
పిశాచ ప్రేత రాక్షస యక్ష భయప్రదానాం, విషతుండ
దంష్ట్రిణాం, విషాంగానాం, విషపుచ్ఛానాం, విషాణాం,
విషరూపిణీ, విషశోషిణీ, విషనాశినీ, విషహారిణీ, హతం
విషం నష్టం విష మస్తఃప్రలీనం, విషం ప్రనష్టం, విషంహత
స్తేన బ్రహ్మణా, విషమిన్ద్రస్య వజ్రేణస్వాహా॥

తా. పైన చెప్పబడినప్రకారముగ నాత్మమంత్రమును సర్వకాల సర్వావస్థలయందును స్మరణలో నుంచుటవలన సకలచరాచర రూపమగు జగత్తులోని జీవరాసు లన్నిటివలన నేవిధమైన బాధలు వ్యాధులు నుండవని నమ్మవలెను. సమస్తమగు జగత్తు జ్ఞానాగ్నిలో నాహుతి (స్వాహాకారము) అగును. (ఆత్మజ్ఞానముచే సర్వమును భస్మ మగును.) కావున ఏభూతమువల్లను ఏవ్యాధివల్లను నెట్టిభయము లేదని నమ్మి సదా ఆత్మజ్ఞానములో నుండవలెను.

## 103. కలిసంతార

మూ. సర్వశ్రుతిరహస్యం గోప్యం తచ్ఛృణు యేన కలిసంసారం
తరిష్యసి భగవత ఆదిపురుషస్య నారాయణస్య
నామోచ్చారణమాత్రేణ నిర్ధూతకలిర్భవతి నారదః॥

తా. ఓనారదా! సర్వశ్రుతులలో రహస్యముగనున్న సారవ నీకు చెప్పుచున్నాను.

సృష్టికి పూర్వమందున్న యేకవస్తువే ఆదిపురుషుడు. ఆభగవంతుడే యీపంచకోశ పురమునం దుండుటచే పురుషశబ్దము వచ్చెను. అట్టి ఆది పురుషుని నామము స్మరించుటచేతనే - (మరచిపోయినవస్తువును జ్ఞాపకము చేసికొనునట్లు తా నెవరో స్మరించినమాత్రమున) తన సర్వపాపములు పోయి బయటపడును. తన దురితము లన్నియుహరించును. ఆనామమును గురుముఖతా తెలియవలెను.

మూ. నాతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతఇతి—
జీవస్యావరణ వినాశనం తతఃప్రకాశతే పరంబ్రహ్మ
మేఘాపాయే రవిరశ్మిమండలీ॥

తా. వేదములన్నియు వెతకిచూచినను నీవు తరించుటకు వేరుపాయములేదు. తానెవరో తెలిసికొని తన్నిజనామస్మరణము కాక మరియొక మార్గములేదు. తానెవ రను వివేకజ్ఞానము లేకపోయినచో సంసారసముద్రమును దాటలేదు. అట్లు తెలిసినయెడల జీవుని ఆవరణయగు నేను, నాదియను నభిమానము అహంకారము విడువవు.

కావున వివేకజ్ఞానము అహంకారము విడువవు. తరువాత వివేకజ్ఞానము సంపాదించితివేని ప్రకాశించు పరబ్రహ్మము గోచరమగును. మబ్బువిడిచిన సూర్యునిరీతిగ అఖండమగును.

## 104. జాబాల్యు

మూ. భగవ న్తే బ్రూహి పరతత్వ రహస్యమ్
భగవ న్కృపయా మేరహస్యం సర్వం నివేదయ॥

తా. ఓభగవంతుడా! నేను ఆపరతత్వము నెట్లు తెలియగలను. దాని రహస్య మేమి? ఆపరతత్వ మెట్లుండునని భక్తుడు ప్రశ్నింపగా భగవంతు డిట్లు చెప్పుచున్నాడు.

ఈ సర్వసంసారము మీదనున్న నేను కర్తను. నేను భోక్తను అను రాభాసలు నభిమానములును విడచి సర్వసంగపరిత్యాగము చేయుటయు, ఆత్మనివేదనము "ఏతస్మై నివేద్య"మ్మన్నట్లీసర్వము నాభగవంతునికే ఇడిచినయెడల భగవంతునికి కృపగలుగును. కనుక సమస్తములగు అభిమానాదులువిడచి నీయాత్మను నీవు రక్షించుకొని యుద్ధరించుకొనుము. 'ఆత్మసంరక్షణార్థం దత్త్వా స్వవపుః" అనునట్లు నీ ఆత్మను రక్షించుకొను భారము నీయది యని తెలిసికొనుము.

మూ. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

తా. "సమస్తములగు ధర్మాధర్మములను విడచి నన్నే శరణు పొందినయెడల నిన్ను పాపపుణ్యములనుండి విడిపించెదను. నీదగు సర్వ భారమును నేను వహించెదను. కావున దుఃఖింపకుము"అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పియున్నాడు.

కావున నీవు సర్వవిషయత్యాగము చేసితివేని భగవంతునకు నీయందు కృపగలిగి నిన్ను రక్షించును.

## 105. సౌభాగ్యము

మూ. నిర్వికల్పం పరంతత్త్వం సదాభూత్వా పరంభవేత్
అహంభావం పరిత్యజ్య జగద్భావ మనీదృశమ్
నిర్వికల్పస్థితోవిద్వాన్ భూయో నాప్యనుశోచతి
సలిలే సైంధవం యద్వత్సామ్యం భవతియోగతః
తథాఽఽత్మ మనసోరైక్యం సమాధి రభిధీయతే
యథా సంక్షీయతేప్రాణో మానసంచ ప్రలీయతే
తథా సమరసంయత్సమాధి రభిధీయతే

యత్సమత్వం తయోరత్ర జీవాత్మ పరమాత్మనోః
సమ స్తనష్టసంకల్ప స్సమాధి రభియ తే
ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్
సర్వశూన్యం నిరాభాసం సమాధి రభిధీయ తే
యత్రయత్ర మనోయాతి తత్రతత్ర పరంపదమ్
తత్రతత్ర పరంబ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్.

తా. ఆపరబ్రహ్మ మెల్లప్పుడు తెలియతగినవాడు. ఆతత్త్వ మే సంకల్పములు లేనిదియై ఆ పరమాత్మను పొందును.

అహంకార మమకారములువిడచి జగద్భావము లేనివాడై నిశిరాత్రి వలె సదా అనిశ మయినవాడును (ఇంద్రియవృత్తి లేనివాడును) జగత్తును చూడనివాడై నిర్వికల్పముగా నున్నవాడును నగుసాధకుడు నాస్వరూపమే యని తెలియును. పై రీతి సాధకుడగు యోగి సముద్రములో నుప్పుగడ్డవలె బ్రహ్మములో నైక్యమగును. అట్టివాని మన స్సాత్మ యందు లయమగుటచే నది నిర్వికల్ప సమాధి యనుబడుచున్నది. ఇదే పరిపూర్ణము. ఎప్పుడు ప్రాణేంద్రియములు, మనస్సు, సర్వము విలీన మగునో యప్పుడు సర్వభూతములయందు సమభావము కలుగును. అట్టి సమత్వ మెప్పు డెచ్చట నుండునో యప్పుడే, అచ్చటనే జీవుడగు నతడే పరమాత్మయగును. సర్వసంకల్పములు విడిచిన స్థితియే నిర్వికల్ప సమాధి నాబడును.

స్థూల సూక్ష్మ కారణములవల్ల కలిగిన సమస్తమగు ఇంద్రియజాలము ఇంద్రజాలమువలె మిథ్య కాని నిజము కాదనియు, నట్టి స్థితిలో నిరామయ మేకాని వస్తుతత్వమేమియు లేదనియు, జగత్తు మిథ్య ఆభాసయేకాని యేమియు లేదనియు నెరిగి నిరాభాసను పొందిన స్థితియే నిర్వికల్పసమాధి యనబడును. ఎప్పు డెచ్చట మనస్సు లీనమగునో యప్పుడచ్చట పరమ

పదము పొందబడును. అప్పుడే పరబ్రహ్మమగును. సర్వమును సమముగా తెలిసి సాధకుడు బ్రహ్మమందు లీనమగును.

కావున "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యని చెప్పబడియున్న జగన్మిథ్యాత్వమును దూఢిగ తెలిసికొనుము.

## 106. స ర స్వ తి

శ్లో. ఆత్మవిద్యా మయాలబ్ధ్వా బ్రహ్మణైవ సనాతనీ
బ్రహ్మత్వంమే సదానిత్యం సచ్చిదానన్దరూపతః
ప్రకృతిత్వం తతస్సృష్టం సత్వాదిగుణసామ్యతః
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోఽద్వయమ్
ఉపేక్ష్యనామరూపేద్వే సచ్చిదానన్దతత్పరః
సమాధిం సర్వదాకుర్యా ద్ధృదయేవాథవాబహిః॥

తా. ఆత్మస్వరూపమును తెలియుటకు సనాతనమునుండియు నున్న ఆత్మవిద్యచేతనే తెలియవలెను. ఆత్మవిద్యను తెలిసి నిత్యము మరువక యున్నయెడల సచ్చిదానన్దరూపమైన బ్రహ్మమే యగును. ఆత్మవిద్యయే శుద్ధప్రకృతి యనబడును. ఆ శుద్ధమాయాస్వరూపము సత్వగుణముచే పరిశోధించి చూచినయెడల ఆత్మస్వరూపము స్పష్టమగును. సత్వగుణముతోఁగూడిన శుద్ధప్రకృతితత్వము పరిశోధించి చూచినచో ఆత్మ విశదమగును. దీనినే రెండవమంత్రముగ తెలియవలెను.

ఆదినున్న పరమాత్మ జగత్రయముతోను, జగద్రూపముతోను కప్పబడెను. జగత్తుగా—రెండుగా మారినతత్వమును పరిశోధించిచూచి నామరూపములతోఁగూడిన జగత్తును ఎదురుగ కాన్పించుచున్నను మిథ్యామాతముగను, పొల్లువలె నిస్సారముగను చూడవలెనుగాని నిజమని నమ్మరాదు. అట్లు నామరూపదృష్టి నశించినయెడల రెండవవస్తువు లేక

అఖండ పరబ్రహ్మమే శేషించును. అట్టి సమాధితో సర్వదా నున్న యెడల కామాదియుక్తమగు హృదయాంధకారములో మునిగిన అధము డైనను ముక్తుడయి కేవల శివు డగును.

మూ. నిర్వికల్పసమాధి స్స్యాన్నివాతస్థితదీపవత్
యత్రయత్ర మనోయాతి తత్రతత్ర పరామృతమ్
భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే
మయిజీవత్వ మీశత్వం కల్పితం వస్తుతోనహి
ఇతియస్తు విజానాతి స ముక్తో నాత్రసంశయః.

తా. ఆ నిర్వికల్ప సమాధిలో నున్నవాని సర్వేంద్రియములు వాని చేష్ట లుడుగుటచే గాలిలేనిదీపమువలె నిర్మలముగ నుండును. ఎపు డెక్కడ మనస్సు లయమును పొందునో అప్పు డక్కడే అఖండామృత మును పొందును.

హృదయగ్రంథి యెప్పుడు తెగిపోవుచున్నదో అప్పుడే సర్వసంశయ ములు నశించిపోవును. వెంటనే తాను చేసిన సర్వకర్మలు నశించి తన దృష్టిచే పరమాత్మను తెలియును. అప్పుడు 'నేను జీవుడను. పరమాత్మ వేరుగనుండెను' అనుదృష్టి పోయి, సర్వము కల్పితమని తెలిసి, వస్తుదృష్టి లేనివాడై సర్వమును బ్రహ్మముకాని పూర్ణాత్మకన్న వేరుగ నేమియు లేదని తెలియగలడు. అట్లు తెలిసినవా డన్నిచింతల విడనాడి సద్యో ముక్తిని (బ్రతికియుండగనే ముక్తి) పొంది పూర్ణు డగును.

దీనిని మొదటిమంత్రముగా తెలియుము.

## 107. బ హ్మా ౦ చో

మూ. సైవ పురత్రయం శరీరత్రయం వ్యాప్య బహిరన్త
రవభాసయన్తీ దేశకాల వస్త్వన్తరాసంగా

న్మహాత్రిపురసున్దరీ సచ్చిదానన్దబ్రహ్మేతి
బ్రహ్మానన్దకళేతి.

తా. ఇందు త్రిపురసుందరియే సర్వమునని చెప్పబడినది.

ఈ సర్వజగత్తునను బ్రహ్మవస్తు వొక్కటియే శేషించినది. నిజమైనది యును. ఆబ్రహ్మకళచేతనే సర్వజగత్తు నిలబడియున్నది. (చైతన్య స్వరూ ముగ నున్నది.) ఆకళచేతనే ప్రకాశించుచున్నది. ఆకళయే పూర్ణకళ యని కళాపూర్ణయని చెప్పబడును.

## 108. ముక్తిక

మూ. రామ త్వం పరమాత్మాఽసి సచ్చిదానన్దవిగ్రహః
ఇదానీం త్వాం రఘుశ్రేష్ఠ ప్రణమామి ముహుర్ముహుః
త్వద్రూపం జ్ఞాతుమిచ్ఛామి తత్త్వతో రామ ముక్తయే
అనాయాసేన యేనాహం ముచ్యేయం భవబన్ధనాత్
కృపయా వద మే రామ యేనముక్తో భవామ్యహమ్
సాధుపృష్టం మహాబాహో వదామి శ్రుణు తత్త్వతః
వేదాన్తే సుప్రతిష్ఠోఽహం వేదాన్తం సముపాశ్రయ.

తా. శ్రీరామచంద్రా! నీవు మనుష్యమాత్రునివలె సాధారణముగ గనబడుచున్నావు; కాని నీవు సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మయే అగుచున్నావు. నేను నీకు నమస్కరించుచున్నాను. మోక్షము నభిలషించిన వాడనయి నీ యథార్థస్వరూపమును తెలిసికొన గోరుచున్నాను.

శ్రీరామచంద్రా! ఆయాసకరముగాని యే యుపాయముచే నేను సంసారబంధవిహీనుడనై ముక్తుడ నగుదునో అట్టి యుపాయమును నాకు చెప్పుము.

ఓయాంజనేయా! నీవు మంచిప్రశ్నము నొసర్చితివి. సంసారబంధ విమోచనము నన్ను చక్కగా నెఱింగినగాని కలుగజాలదు. నేనుపనిష ద్వేద్యుడను; ఉపనిషత్సారభూతుడను. కావున నుపనిషత్తులను చక్కగ తెలిసికొనుము.

మూ. కైవల్యముక్తిరేకైవ పారమార్థికరూపిణీ
దురాచారరతో వాఽపి మన్నామభజనా త్కపే!
సాలోక్యముక్తిమాప్నోతి నతులోకా న్తరాదికం
కాశ్యాంతు బ్రహ్మనాలేఽస్మి న్మృతో మత్తారమాప్నుయాత్
పునరావృత్తిరహితాం ముక్తిం ప్రాప్నోతి మానవః
యత్రకుత్రాపివా కాశ్యాం మరణే స మహేశ్వరః
జన్తోర్దక్షిణకర్ణేతు మత్తారం సముపాదిశేత్.

తా. ఉపాసనాసాధ్యములగు ముక్తులలో భేదముగలదు కాని పార మార్థికమగు ముక్తిమాత్ర మొక్కటియేసుమా!

ఓయాంజనేయా! మనుష్యుడు దురాచారమును చేయువాడైనను నా నామమునే సర్వదా స్మరించుచుండునెడల నా సాలోక్యమును పొందును. కర్మనిర్మితములగు స్వర్గాదిలోకాంతరములను పొందడు. కాశీక్షేత్రమున బ్రహ్మనాళమను ప్రదేశమునందు మరణించినవానికి శ్రీవిశ్వేశ్వరుడు నా తారకమంత్రము నుపదేశించును. అట్టి యుపదేశమును పొందినవాడు పునరావృత్తి శూన్యమగు మోక్షమును పొందును.

శ్రీకాశీనగరమునందు ఆపంచక్రోశములలోపల నేప్రాణి మరణించి నను శ్రీకాశీవిశ్వనాథస్వామి తారకమంత్రము నాప్రాణియొక్క కుడిచెవి యం దుపదేశించును.

కాశీ, పంచక్రోశపుర మనగా తనదేహమనియు, బ్రహ్మనాళ మనగా బ్రహ్మరంధ్రమనియు, కాశీవెళ్లుటయనగా మూలాధారములో

నున్న జీవుడు బ్రహ్మనాళము మధ్యకు వెళ్లుటయనియు, బ్రహ్మతారకో పదేశ మనగా అట్టిస్థితికి అట్టిస్థానమునకు వచ్చి సర్వ చిత్తాదిత్యాగము చేసినగాని తెలియతగని పదార్థమనియు, అదియే తారకమనియు, తారక మనగా తనస్వరూపమనియు, జీవబ్రహ్మ లిద్దరూ నొకరకమేయనియు నెఱుంగుము. ఈ తారకమునే విశ్వేశ్వరుడు బోధించును.

(ఈతారకమంత్రవిషయమున ననేకులు తమతమ యనుభవము లను బట్టి యనేకార్థముల జెప్పుచున్నారు. ఎవరిమార్గము వారికిష్టమగును. దీనికిదియే యర్థము, ఇదియే నిజము, మరెద్దియు లేదని నేను నిర్ధారణ చేయలేదు. ఎవరిఇష్టము వారిది. ఎవరిబోధ వారిది. ఎవరిమార్గము వారికి ప్రీతి. కాన సీజీవామృత మీరీతిని నాయోపినకొలది తెలిపితిని.)

"కాశీనగరమునం దాపంచక్రోశములలో మరణించిన యేప్రాణి కైనను కాశీవిశ్వనాథుడు కుడిచెవియందు తారకము నుపదేశించును" అని చెప్పియుంటి మందు విశ్వనాథుడనగా విశ్వమునకు నాథుడు. కుడి చెవి యనగా (కుడిభుజ మనునట్లు) దేహమున కుడిభాగమునకు విలువ యెక్కు డగుటచే కుడిచెవికే ప్రాశస్త్య మీయబడెను. ఆత్మవిద్య తాలువని గ్రహించవలెను. కాబట్టి బ్రహ్మనాళస్థితికి వచ్చినతరువాత గురూపదేశము ననుసరించి చేసినవారు జననమరణములులేని మార్గ మును పొంది ముక్తు లగుదురు.

మూ. తతః కాలవశాదేవ ప్రారబ్ధేతు క్షయంగతే
వైదేహీం మామకీం ముక్తిం యాతి నాస్త్యత్ర సంశయః.

తా. "తదనంతరము కాలవశముచే ప్రారబ్ధము నశింపగా నా సంబంధమగు విదేహముక్తిని పొందును. ఈ విషయమున సందేహము లేదు." అని తాత్పర్యము.

జీవవృత్తి చచ్చుటే మరణమనబడును. మరణించినవానికి మోక్ష

మనగా జీవునకు నృత్తినశించినయెడల మోక్షము సిద్ధించును. కనుక కాశీలో సంసారమునకు కారణభూతమగు కర్మ-సంచితము, ఆగామి, ప్రారబ్ధమునని త్రివిధమయి యున్నది.

అందు 1. సంచితము—ఇదిఫలము నొసంగుటకు కొండవలె పెరిగి యున్నది. ఇట్టిది బ్రహ్మసాక్షాత్కారము కలిగినతోడనే దూదిప్రోవు అగ్నిచే దహింపబడిన విధముగ నెంతమిక్కుట మైయున్నను నశించును.

మూ. అహంబ్రహ్మేతివిజ్ఞానా త్కల్పకోటిశతార్జితమ్
సఞ్చితం విలయంయాతి ప్రబోధా త్స్వప్నకర్మకృత్.

తా. నేను బ్రహ్మము అనెడి అపరోక్ష సాక్షాత్కారమువలన కల్ప కోటిశతములనుండి పుణ్యాపాప కర్మలనాచరించి చేర్చుకొనియున్న సంచిత కర్మయంతయు మెళుకువరాగనే స్వప్నకృతము నశించు రీతిగనే నశించును.

2. ఆగామి - ఇది రాబోవుకాలమునందు తాను చేయుబోవు పుణ్యా పాప రూపకములగు కర్మలవలన సంభవింపగల కర్మ. ఇట్టి కర్మ బ్రహ్మ స్వరూపు డగువాని నంటజాలదు.

మూ. స్వ మసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభోయథా
నక్లిశ్యతే యతిఃకించి త్కదాచి ద్భావికర్మభిః.

తా. తానాకాశమువలెనే అసంగమును, ఉదాసీనమును నగు బ్రహ్మస్వరూపమని తెలిసికొనినచో ఆగామికర్మ ఫలముచే నెప్పటికినీ పీడింపబడడు.

మూ. న నభోఘటయోగేన సురాగన్ధేన లిప్యతే
తథాఽఽత్మోపాధియోగేన న తద్ధర్మై ర్నలిప్యతే.

తా. కల్లువాసనగలకుండయందలి ఆకాశము నాకల్లుయొక్క వాసన యేవిధముగ నంటజాలదో అదేవిధముగ ఆత్మ ఉపాధిధర్మములచే నంటబడదు.

3. ప్రారబ్ధము — ఇది కర్మఫలానుభవము నొసంగుటకై యారంభించిన జన్మముగలది. ఇట్టిప్రారబ్ధము జ్ఞానోత్పత్తి యైనవెంటనే నశింపక భోగ క్షయానంతరము నశించును. ఆగామిసంచితములవలె జ్ఞానోత్పత్త్యనంతరము నందే నశింపజాలదు.

మూ. జ్ఞానోదయా త్పురారబ్ధం కర్మజ్ఞానా న్నపశ్యతి
అదత్వా స్వఫలంలక్ష్య ముద్దిశ్యోత్సృష్ట బాణవత్.

తా. లక్ష్యమునుగూర్చి ప్రయోగింపబడినబాణ మా లక్ష్యమును తగులక నెట్లునిలువదో అదేవిధముగా జ్ఞానోత్పత్తికంటె ముందు ప్రారబ్ధమగు కర్మజ్ఞానోత్పత్త్యనంతరముననైనను నశింపదు. ఎట్టి జ్ఞాని యైనను ప్రారబ్ధమును (తనకిష్టమున్నను లేకున్నను) అనుభవించియే తీర వలయును.

1. సంచితకర్మము—ఇది బ్రహ్మజ్ఞానముచే నశించును.

2. ఆగామికర్మ—ఇది బ్రహ్మజ్ఞాని నంటదు.

3. ప్రారబ్ధకర్మ—ఇది భోగముచేతనే నశించును గాని జ్ఞానముచే నశింపదు.

ప్రారబ్ధక్షయపర్యంతము జీవన్ముక్తుడయి అనంతరము తదవస్థనుదాటి దేహపాతానంతరము బ్రహ్మస్వరూపు డగును. ఇదియే విదేహముక్తి యనబడును.

మూ. సర్వోపనిషదాంమధ్యే సారమష్టోత్తరంశతమ్
సకృచ్ఛ్రవణమాత్రేణ సర్వాఘౌఘనికృంతనమ్.

తా. ఉపనిషత్తులన్నిటిలో నూటయెనిమిది ఉపనిషత్తులు మోక్ష సాధనభూతములు, కావున శ్రేష్ఠము లగుచున్నవి. ఒక్కమారు విని నంతమాత్రముననే సకలపాపములు నశించును.

మూ. మయోపదిష్టం శిష్యాయ తుభ్యం పవననన్దన!
ఇదంశాస్త్రం మయాఽఽదిష్టం గుహ్యమష్టోత్తరంశతమ్
జ్ఞానతోఽజ్ఞానతో వాఽపి పఠతాం బన్ధమోచకమ్
రాజ్యం దేయం ధనం దేయం యాచతః కామపూరణమ్
ఇదమష్టోత్తరశతం న దేయం యస్యకస్యచిత్
నాస్తికాయ కృతఘ్నాయ దురాచారరతాయ వై
మద్భక్తివిముఖాయాపి శాస్త్రగర్తేషు ముహ్యతే
గురుభక్తివిహీనాయ దాతవ్యం న కదాచన
సేవాపరాయ శిష్యాయ హితపుత్రాయ మారుతే!
మద్భక్తాయ సుశీలాయ కులీనాయ సుమేధసే
సమ్యక్పరీక్ష్య దాతవ్య మేవ మష్టోత్తరంశతమ్
యఃపఠేచ్ఛృణుయాద్వాఽపి స మా మేతి నసంశయః.

తా. ఓ యాంజనేయా! శిష్యుడ వగు నీ కతిరహస్యభూతములగు నియ్యష్టోత్తరశతోపనిషత్తుల నుపదేశించితిని. ఇయ్యుపనిషత్తులను తెలిసి గాని తెలియకగాని పఠించినవారికి బంధవిముక్తి కలుగుచున్నది.

నిన్నడిగినవానియందు నీ కనుగ్రహము కలిగినయెడల వానికి సరాం భీష్టముల నొసంగుచు ధన కనక రాజ్యాద్యైశ్వర్యముల నీయవచ్చును; కాని ఇయ్యష్టోత్తర శతోపనిషత్తులు మాత్ర ముపదేశింపవలదు. దురా చారరతుడు, కృతఘ్నుడు, నాస్తికుడు, మున్నగువారల కీయరాదు. అధ్యాత్మచింతన లేక సర్వదా తర్కవ్యాకరణాది శాస్త్రములయందు నిమగ్నులై యుండు సంశయ పిశాచావేశులకును, గురుభక్తివిహీనులకును నుపదేశింపకూడదు.

ఓ మారుతీ! ఇయ్యష్టోత్తరశతోపనిషత్తులు శుశ్రూషా పరాయణు డును, సకలవిధముల హితుడు నగు పుత్రునికొఱకును, సుశీలుడు, సుగుణుడు, కులీనుడు, ఆత్మజ్ఞానమునకై కృషిచేయువాడు, మంచి మేధస్సు కలవాడును నగు మద్భక్తునికొఱకును నుపదేశింపదగినవి.

ఇయ్యష్టోత్తర శతోపనిషత్తుల నెవ్వడు పఠించునో, యెవ్వడు వినునో వాడు నన్ను పొందుచున్నాడు! ఈవిషయమున సంశయములేదు — అని శ్రీరామచంద్రమూర్తి యాంజనేయున కుపదేశించెను.

మూ. తదేతత్ ఋచాఽభ్యుక్తం విద్యాహ వై బ్రాహ్మణ
మాజగామ, గోపాయ మా శేవధిష్టేఽహమస్మి
అసూయకా యాన్నృజవే శఠాయ, నమాంబ్రూయా
వీర్యవతీ తథాస్యాం, యమేవ విద్యాశ్రిత
మప్రమత్తం, మేధావినం, బ్రహ్మచర్యోపపన్నం,
అస్మాఇమా ముపపన్నాయ సమ్య క్పరీక్ష్య
దద్యాద్వైష్ణవీ మాత్మనిష్ఠా — మితి॥

తా. బ్రహ్మవిద్య బ్రాహ్మణునిదగ్గరకువచ్చి 'నన్నుకాపాడినయెడల నీకు నేను నిధివలెనుందును. అసూయగలవానికిని, కుటిలబుద్ధిగలవానికిని వంచకునకును నన్నుపదేశింపకుము. అట్లుపదేశింపక యుంటివేని నేను వీర్యవంతమై నీకు సకలాభీష్టముల నొసగుదు' నని తెలియచెప్పెను.

ఎవ్వడు వేదశాస్త్రములందు చక్కనిపాండిత్యముకలిగి యేప్రమా దము లేనివాడై కర్తృత్వ భోక్తృత్వాది గర్వములేనివాడై గ్రహిం చినదానిని మరువక జాగ్రత్తులో జాగ్రతగ జ్ఞప్తియందుంచుకొన సమ ర్థుడో; బ్రహ్మచర్యనియమము కలవాడో అట్టివాడు విద్య నభిలషించి తనసమీపమునకువచ్చి వినీతుడయి ప్రార్థించు నెడల వానిని పరీక్షించి ఇయాత్మవిద్య నుపదేశింపవలెను.

మూ. ముముక్షవః పురుషాస్సాధనచతుష్టయసంపన్నా శ్శ్రద్ధా
వన్తం సత్కులభవం శ్రోత్రియం శాస్త్రవాత్సల్యం గుణ
వన్త మకుటిలం, సర్వభూతహితేరతం, దయాసముద్రం.
సద్గురుం విధివ దుపసంగమ్యోపహార పాణయోఽష్టోత్తర
శతోపనిషదం విధివ దధీత్య శ్రవణ
మనన నిధి ధ్యాసనాని నైరంతర్యేణకృత్వా
ప్రారబ్ధక్షయాద్దేహత్రయభంగం ప్రాప్యో
పాధివినిర్ముక్త ఘటాకాశవ త్పరిపూర్ణ తా
మేతి విదేహముక్తి స్సైవ కైవల్యముక్తిరితి—
అతఏవ బ్రహ్మలోకస్థా అపి బ్రహ్మముఖా ద్వేదాంత
శ్రవణాది భుక్త్వా తేనసహ కైవల్యంలభన్తే,
అత స్సర్వేషాం కైవల్యముక్తి ర్జ్ఞానమాత్రే
ణోక్తా నకర్మ సాంఖ్యయోగోపాసనాదిభి—రిత్యుపనిషత్ ॥

తా. మోక్షేచ్ఛగలవారలు తాము సాధనచతుష్టయ సంపత్తిగల వారై, శిష్యులకు సదుపదేశమునొసంగి వారిని తరింపజేయుతలంపు గలిగినట్టివాడును, సద్వంశజుడును, శాస్త్రవిశ్వాసము గలవాడును, మైత్రి ముదిత మున్నగుగుణసంపత్తి గలవాడును, సకలభూతములయందు హితవుగలవాడును, దయాసముద్రుడును, సదాచార రతుడును నగు సద్గురువుయొక్కసమీపమునకు పుష్పఫలాదిరూపమగు కానుకను గైకొని సమీపించి యతనికి సాష్టాంగనమస్కార మొనర్చి అతని యనుగ్రహము వలన అష్టోత్తరశతోపనిషత్తులను ఉపదేశమునొంది తదుపదేశ శ్రవణానంతరము సంశయాదికములు కలుగకుండుటకై మనన మొనర్ప వలెను. అట్లు శ్రవణ మననములచే దృఢమైన బ్రహ్మతత్వమును మనస్సునందు నిశ్చలముగ నిలుపుకొన్న వారై, ప్రారబ్ధరూపమగు నీదేహ

ముతో సూక్ష్మకారణశరీరముల ద్వారా నశించువారై ఘటము పగిలి పోయిన పిదప ఘటాకాశము మహాకాశమునందు లీనమగురీతి తామే పరిపూర్ణత్వమును పొందుచున్నారు. అట్లగుటయే విదేహముక్తి యనియు, కైవల్యముక్తి యనియు చెప్పబడుచున్నది.

అనగా:— అజ్ఞానము, తత్కార్యమగు నుపాధియు జ్ఞానముచే నశింపగా ఆత్మ తన పరిపూర్ణ బ్రహ్మస్వరూపత్వమును పొందును. జ్ఞానముచేతనే యిట్టి కైవల్యముక్తి లభించుచున్నది.

సగుణోపాసనాదికమువలన బ్రహ్మలోకమును పొందినవారునైతము బ్రహ్మదేవునివలన నుపనిషదర్థమును విన్నవారయి, అట్లుపదేశింపబడిన తత్త్వమును మనన నిధి ధ్యాసనముల నొనర్చుచు బ్రహ్మప్రళయకాలమునందా పరబ్రహ్మతో కైవల్యముక్తిని పొందుచున్నారు. కావున జ్ఞానముచేతనే ముక్తి లభించుననుటయే స్పష్టమగుచున్నది గదా! కాగా ఉపనిషత్సిద్ధాంతముకానట్టి కర్మలచేగాని, సాంఖ్యముచేగాని, యోగముచేగాని, ఉపాసనలచేగాని ముక్తి లభింపజాలదు.

శ్రౌతస్మార్తకర్మలు, యోగములు, ఉపాసనలు ననునివి చిత్తశుద్ధిని గలిగించి జ్ఞానోత్పత్తికి సహాయభూతములగును. కావున నియ్యవి అవశ్యానుష్ఠేయములైనను ఇవియే ముక్తినొసంగునని యుపేక్షించి యుండరాదనియు, జ్ఞానమే మోక్షదాయకమనియు తెలిసికొనవలయును.

సాధనచతుష్టయమునుగూర్చి విపులముగ చెప్పబడుచున్నది.

1. నిత్యానిత్యవస్తువివేకము. 2. ఇహాముత్రఫలభోగ విరాగము. 3. శమాది షట్కసంపత్తి. 4. ముముక్షుత్వము అను నీ నాలుగు సాధనచతుష్టయమని చెప్పబడును.

అందు 1. నిత్యానిత్య వస్తువివేకము:— బ్రహ్మము నిత్యమనియు, ప్రపంచ మనిత్యమనియు తెలిసికొనుట.

2. ఇహాముత్రఫలభోగ విరాగము:- ఇహలోకమునందుగల నానా

విధ భోగములను, పరలోకమునందు గల స్వర్గాది ఫలభోగముల నభిలషింపక వానియందు విరక్తికలిగి యుండుట.

3. శమాదిషట్క-సంపత్తి:— శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము నను నీ యారును శమాదిషట్క-ము నాబడును. ఇందు శమము:— అంతరేంద్రియ విషయములగు కామాదులను జయించుట; దమము:— బాహ్యేంద్రియములను వానివాని విషయములందు పరుగిడనివ్వక మరలించుట; ఉపరతి:— పరమాత్మయందే క్రీడించుట; (విషయానందము విడచి బ్రహ్మానందమునందే మునుగుట) తితిక్ష:— సుఖదుఃఖములను లాభాలాభములను, జయాపజయములను, మానావమానములను సమముగచూచుట నిగ్రహించుట యను గొప్పఓర్పు కలిగియుండుటయు, బ్రహ్మమునందే చిత్తమునిలుపుటయును; శ్రద్ధ:— గురు వేదాంతాది వాక్యములయందు విశ్వాసము కలిగియుండుట; సమాధానము:— చిత్తము పరమాత్మయందే నిలిపియుండుట యను నీ యారుగుణములు కలిగియుండుట శమాదిషట్క-సంపత్తి నాబడును.

4. ముముక్షుత్వము: — మోక్షమునం దిచ్ఛకలిగియుండుట.

ఈ సాధనచతుష్టయ మొకదానితో నొకటి కలిసియే యుండును గాని విడిచియుండజాలవు. కావున సద్గురుకటాక్షముచే నొక్క-గుణమైనను లభించిన యెడల క్రమముగ నన్నియు పూర్తియగును.

1. శ్రవణము:— సదాచారసంపన్నుడగు సద్గురునివలన సమస్త వేదాంతములు అద్వితీయ పరమాత్మతత్త్వమునే బోధింపుచున్నవని తెలిసికొనుట.

2. మననము:— ఆచార్యు డుపదేశించినయర్థమును సందేహానివారణార్థమయి తాను యుక్తులచే మరల మననము చేసికొనుట.

3. నిధిధ్యాస:— శ్రవణమననములచే నిశ్చితమగు ఆత్మతత్త్వము నెల్లప్పుడు చిత్తమునందు చలింపకయుండునట్లునిలుపుట.

మూ. ప్రాక్తన స్తదసాయత్నా జ్జేతవ్యో భవతా కపే!
శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తి వాసనాసరిత్.

తా. ఓయాంజనేయా! పూర్వజన్మకృత పుణ్యాపాప సంస్కారరూప వాసనలను దృఢమయిన పురుషప్రయత్నముచే జయించి కృతార్థుడవు కమ్ము. పూర్వజన్మకృత కర్మవాసనాత్మకమగు నది శుభాశుభములను మార్గముచే ప్రవహించుచున్నది.

వేగముగ నేగు నదీప్రవాహమున బడినవాడు ముఖ్యమైన గాన్పింపని రీతి నాప్రవాహవేగముచే కెరటములయొక్క నిమ్నోన్నతముల ననుసరించి మునుగుచు తేలుచు తుద కాప్రవాహమున మునిగిపోయి నట్లు లజ్ఞానులు శుభాశుభము లను పుణ్యాపాప కర్మరూపమగు వాసనా నదియందు మునిగిపోవుచున్నారు. కావున నీవు జ్ఞానివై త ద్వాసనా నదీప్రవాహమునబడక మర్కటకిశోర న్యాయమున కొంత పురుషప్రయత్నము చేసితివేని తదుపరి మార్జాలకిశోర న్యాయమున సద్గురుకటాక్షముసంధి, దాని యాధారముచే నీవు దుస్తరము వాసనావాసితము నగు మహాప్రవాహమున గొట్టుకొనిపోజాలవు.

అట్టి మహాప్రవాహమునుండి బయటపడుటయే బయలు అని తెలియుము.

మూ. మనోనిర్వాసనీభావ మాచరాశు మహాకపే!
సమ్యగాలోకనా త్యత్యా ద్వాసనా ప్రవిలీయతే
వాసనావిలయే చేత శ్శమమాయాతి దీపవత్
వాసనాం సుపరిత్యజ్య మయి చిన్మాత్రవిగ్రహే
య స్తిష్ఠతి గతవ్యగ్ర స్సోఽహం సచ్చిత్సుఖాత్రయః.

తా. ఓయాంజనేయా! నీవు శీఘ్రముగ మలినవాసనలు లేకుండు నటుల నీమనస్సును చక్కగ సంస్కరించుకొనుము. దానివలన సత్యాహ

జీవబ్రహ్మైక్య విజ్ఞానము కలుగును. అట్టి దృఢతరవిజ్ఞానముచే వాసన నిశ్శేషముగ నశించును.

దుర్వాసనలు సమూలముగా నశించినచో చిత్తము తనంతట ల దీపమువలె శాంతినిపొందును. ఎప్పుడు సచ్చిదానందాత్మకుడ నాయందు మనస్సునుంచి వాసనలన్నటిని వృత్తులతోగూడ నశింప గలుగుచున్నాడో యప్పు డాతడు బ్రహ్మవేత్తకాడు. మరి! — య బ్రహ్మమగుచున్నాడు.

మూ. సమాధిమథకర్మాణి మాకరోతు కరోతువా
హృదయే నాత్తసర్వేహో ముక్త ఏవోత్తమాశయః
నైష్కర్మ్యేణ నతస్యార్థ స్తస్యార్థోఽస్తి నకర్మభిః
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనంమనః
సంత్యక్తవాసనా న్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్
వాసనాహీన మప్యేత చ్చక్షురాదీంద్రియంస్వతః
ప్రవర్తతే బహిస్స్వార్థే వాసనామాత్రకారణమ్
అయత్నోపనతేష్వక్షి దృగ్ద్రవ్యేషుయథా పునః
నీరాగమేవ పతతి తద్వత్కార్యేషు ధీరధీః॥

తా. బ్రహ్మవేత్త యగువాడు త్రిపుటీనాశన పురస్సరముగ జీ బ్రహ్మైక్యదశయగు సమాధినిగాని శ్రౌతస్మార్తకర్మలనుగాని చేసినచేయ నిమ్ము లేదా చేయకపోయినను సరియే. అతడు మనస్సుచే దారేషణ, ధనేషణ, పుత్రేషణ లను ఈషణత్రయమును విడచి, బ్రహ్మానందస్వ పుడై శ్రేష్ఠమైన బ్రహ్మస్వరూపావస్థను పొందిన మనస్సుగలవాడగును. కావున నతడే జీవన్ముక్తుడు, విదేహముక్తుడు నని తెలియుంగునది.

ఉపాధివిశిష్టుడై యున్నప్పుడు జీవన్ముక్తుడును, ఉపాధిరహితుడై యున్నప్పుడు విదేహముక్తుడు నగును. అట్టి బ్రహ్మవేత్తల ప్రాణములు

త్యుత్క్రాంతులు లేవు. (అట్టి బ్రహ్మవేత్తకు వెళ్లవలసినది, పొందవలసి
నది ఏదియును లేదు.) జ్ఞానసమయకాలమునందే వారు ముక్తులగుదురు.
బ్రహ్మోపదేశకాలమునందు కలిగిన జ్ఞానమే మోక్షమనబడును. అదే
పొందవలసినమార్గము, స్థానమునని తెలియుము.) అట్టి పుణ్యాత్మునకు,
స్థిరచిత్తునకు "నీవు ఇదికాదు. అదే నీవు. నీదేశ మిదికాదు. ఆ దేశమే
నది." అని సద్గురువు చెప్పినమాట సరిపడును. ఎవ డాగురూపదేశమును
దృఢముగ నమ్మినో వాడే పరదేశి యనబడును. అట్టివానికి పొందవల
సిన మార్గముగాని, లోకముగాని పదవిగాని లేదని యెఱుంగుము.

ఎవనిమనస్సు సర్వవిధ వాసనాశూన్యమై బ్రహ్మస్వరూపమే యగు
చున్నదో, అట్టివానికి కర్మసంబంధములేని జ్ఞానముతోగాని, శ్రౌత
స్మార్తాది కర్మలతోగాని, చిత్తైకాగ్రతతోకాని, మంత్రానుష్ఠానములతో
గాని ప్రయోజనములేదు. అతడే బ్రహ్మస్వరూపుడు, కావున జ్ఞానాదు
లతో నతనికి పనిలేకపోవుటయే యుక్తముగదా!

జ్ఞాని యెప్పుడును సర్వవాసనాశూన్యమైన మౌనావస్థయందుండును.
అతని కంతకంటె శ్రేష్ఠమైన పదవి లేదని భావము. మౌన మనగా:—
ప్రపంచ ధర్మసంబంధములను పరిత్యజించి బ్రహ్మస్వరూపుడై యున్న
వానికి లభించెడి ఆనందసముద్రము.

స్వయముగ వాసనలులేని నేత్రము మున్నగు నింద్రియములు పూర్వ
సంస్కారముచే ప్రేరితములై తమ తమ విషయములయందు ప్రవర్తించు
చున్నవి. నేత్రములు రూపమును గ్రహించుట, శ్రవణము శబ్దమును
గ్రహించుటమున్నగు ఇంద్రియప్రవృత్తికి మనోవాసనలే ముఖ్యకారణము
లని తెలిసికొని ఆ మలినవాసనలను జ్ఞానాగ్నిచే దగ్ధమొనర్పవలెను.

చక్షురాది సర్వేంద్రియములు రూపగ్రహణాదికములగు తమతమ
విషయములయం దప్రయత్నముగ ప్రవర్తించినట్లు బ్రహ్మవేత్తయు
ప్రారబ్ధవేగముచే వచ్చునట్టి కార్యములయందు తన ఇచ్ఛ లేకయే ప్రవ

ర్తించుచుండును. కులాలుడు చక్రమునుత్రిప్పి తనపని నెఱవేర్చుకొని తానేగును. తదుపరిగూడ చక్రము తిరుగుచునేయుండును. అట్టియెడ నాచక్రమున పదార్థములేనందున తిరుగుటవలని లాభనష్టములు లేనట్లుగను, తల చితుకగొట్టబడిన పాము చచ్చినను కొంతవఱకు ప్రాణము తోక నంటి యుండుటచే ఆతోక గదలుచున్నట్లుగాను సూక్ష్మకారణములు నశించి నప్పటికిని ప్రారబ్ధముతోగూడిన స్థూలము ప్రారబ్ధము ననుసరించి నప్పటికిని తత్కర్మఫలము అంటదనియే తెలిసికొనుము.

మూ. తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా,
శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యో వాసనౌఘో నిరాధినా.

తా. ఓయాంజనేయా! గురుశాస్త్రబోధిత సిద్ధాంతానుష్ఠానానంతరము క్రమముగ పరిపక్వమయిన చిత్తము కలిగి బ్రహ్మపదార్థ మిట్టిదని యెఱుంగుటచే మనస్సంతాపములేని నీవు శమదమాది రూప శుభ సంస్కారమునుకూడ మెల్లమెల్లగ విడువవలెను. "సర్వవిద్యాపాణ్డిత్య ప్రపఞ్చం భస్మీకృత్య" యనునట్లు సర్వవాసనలు పూర్తిగ జ్ఞానాగ్నిచే భస్మము చేయవలెను.

మూ. సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః
అస్యసంసారవృక్షస్య మనోమూల మిదంస్థితం
సఙ్కల్పమేవ తన్మన్యే సంకల్పోపశమేన తత్
శోషయాశు యథాశోష మేతి సంసారపాదపః.

తా. ఈసంసార మను మహావృక్షమునకు మూలము మనస్సు, రాగద్వేషాదు లంకురములు, స్వర్గనరకాదులు శాఖలు, సుఖదుఃఖములు ఫలములు, ఈషణత్రయము నాబడునవి పల్లవములుగను నుండెను. ఈవృక్ష మనాదియై యనంతమై వెలయుచున్నది. అపరోక్ష సాక్షా

త్కార మగునంతదనుక దేనివలనను ఈ వృక్షమునకు నాశనములేదు. "అసంగశస్త్రేణ దృఢేనఛిత్వా" యను గీతావాక్యమునుబట్టి దృఢమైన అసంగమను శస్త్రముచేతనే ఛేదింపతగినదని యెఱుంగుము.

సంకల్పమే స్వరూపముగాగలది మనస్సు. అట్టి సంకల్పాత్మకమగు మనస్సు సంకల్పమునశించినచో నుండజాలదు. పూర్వోక్తమగు సంసార వృక్ష మెండిపోవునటుల సంకల్పవికల్పాత్మకమగు మనస్సును శీఘ్రముగ నశింపచేయవలయును. నిత్యానిత్య వస్తువివేకముచే పరిశోధించి నిత్య వస్తువునుపొంది, అనిత్యవస్తువును మిథ్యగ నెఱుంగుము. "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యను గూఢార్థము నెఱింగితివేని మనస్సు అను పదార్థము, సంకల్పవికల్పము లనెడు దానివృత్తియు లేదని తెలియగలిగి నిశ్చింతగ నీ దేశములో నీ వుండగలవు.

మూ. అధ్యాత్మవిద్యాధిగమ స్సాధుసంగతి రేవచ
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనం
ఏతాస్తా యుక్తయఃపుష్టా స్సన్తి చిత్తజయేకిల
సతీషుయుక్తిష్వేతా సహఠాన్నియమయన్తి యే
చేతసో దీపముత్సృజ్య విచిన్వన్తి తమోఽఞ్జనైః
విమూఢాఃకర్తుముద్యుక్తా యేహఠాచ్చేతసోజయమ్
తేనిబధ్నన్తి నాగేన్ద్రి మున్మత్తం బిసతన్తుభిః.

తా. మనోజయమునునిమిత్తము వేదాంతశాస్త్రాభ్యాసము, సజ్జన సహ వాసము, మలినవాసనాపరిత్యాగము, ప్రాణచాంచల్యనిరోధనము, సనెడి యుపాయచతుష్టయ మధికార తారతమ్యమునుబట్టి నిర్ణయింప బడియున్నది. శాస్త్రములందు చెప్పబడిన నీ యుపాయములను పరిత్యజించి యెవ్వరు బలాత్కారముగ లేక హఠయోగాదికముచేత మనస్సును జయించుటకు ప్రయత్నించుచున్నారో, వారు చీకటియందున్న వస్తు

వును వెదకుటకు దీపమునువిడిచి కాటుకచే వస్తువులను వెదకుటకయి ప్రయత్నించు మూఢులవలె పైనచెప్పబడిన యుపాయచతుష్టయమునం దొకటియగు ప్రాణస్పందనిరోధమును చేయుచున్నారు.

మనోజయమునకు ముఖ్యసాధనభూతమగు అధ్యాత్మవిద్యాధిగమాద్యుపాయ చతుష్టయమును విడచి హఠయోగాదికముచే నెవ్వరు మనోజయార్థము ప్రయత్నించుచున్నారో, వారు మదించిన గజశ్రేష్ఠమును తామరతూడుచే కట్టివేయ ప్రయత్నించువారితో సమానులు.

అట్టిగజరాజము బిసతంతువులచే గట్టివేయుట కెటులసాధ్యముకాదో అదేవిధముగ హఠయోగాదికముచే మనోజయమును శక్యము కాదు. కావున మనోజయసాధకమని శాస్త్రములందు బోధింపబడిన ఉపాయ చతుష్టయముచేతనే మనస్సును జయింప ప్రయత్నింపవలెను.

మూ. భావితం తీవ్రసంవేగా దాత్మనా యత్తదేవ సః
భవత్యాశు కపిశ్రేష్ఠ! విగతేతరవాసనః॥

తా. ఎవ్వడు తీవ్రమైన సంస్కారవేగముచే నితరవాసనలు లేనివాడయి దేనిని ధ్యానించునో ఆ ధ్యానించువాడు ధ్యానించునదియే తానగుచున్నాడు. (దేనినితాను ధ్యానించునో అదియే తానగునని శ్రుతిస్మృతిపురాణాదులయందు ప్రసిద్ధమైయున్న విషయము!) అదియే జన్మసాఫల్యము. అనగా నామరూపజగత్తు మిథ్యయని తలచి తన్నామరూపములలో పరిపూర్ణమును భావించుటచే పరిపూర్ణమే యగుచున్నాడు. నామరూపజగత్తు జీవబ్రహ్మలు మిథ్యయే యని తెలియవలెను.

మూ. పునర్జన్మాన్తరం త్యక్త్వా స్థితిస్సంభ్రష్టబీజవత్
బహుశాస్త్రవృథాకంథా రోమంథేన వృథైవకిమ్
అన్వేష్టవ్యం ప్రయత్నేన మారుతే జ్యోతిరాన్తరమ్.

తా. వేయించినగింజవలన అంకుర మే విధముగ గలుగదో అదే విధముగ మరల జన్మాంతరమును కలుగజేయుటకు సమర్థమయియుండు స్థితి శుభవాసన యనంబడును. అట్టి శుభవాసనగలవాడూరక యనేకము లగు శాస్త్రకథలనెడి బొంతలను తొడిగికొనుటవలన వానికేమియు ప్రయోజనములేదు. మఱియు నాశాస్త్రకథలను సర్వదా నెమరు వేయుట వలనగూడ నేమియు ప్రయోజనములేదు. అట్టిశ్రమ యంత యును వ్యర్థమే.

మారుతీ! సర్వాంతరమయి స్వయంప్రకాశమై వెలయు తేజ మేది గలదో యా తేజస్సుమాత్రమే తెలియదగినదిసుమా!

మూ. అధీత్య చతురోవేదాన్ సర్వశాస్త్రాణ్యనేకశః
బ్రహ్మతత్త్వం నజానాతి దర్వీపహతచేతసః
స్వదేహాశుచిగంధేన న విరజ్యేత యఃపుమాన్
విరాగకారణంతస్య కిమన్య దుపదిశ్యతే.

తా. "వేదశాస్త్రములను చక్కగాపఠించి తదర్థము నెఱింగియు, విద్యామదముచే వివేకశూన్యులయినవారు బ్రహ్మతత్త్వము నెఱుంగ జాలరు." అని శ్రీరామచంద్రమూర్తి యాంజనేయున కుపదేశించెను.

తనదేహమున కొకపూట స్నానాదిసంస్కారము లాచరింపనియెడల నది దుర్గంధభూయిష్ఠమైయుండును. తనదేహ మిట్టిదని యెఱింగియు నెవనికి వైరాగ్యము కలుగదో అట్టివాని వైరాగ్యమునిమిత్తము మరే కారణమున్నూ చెప్పబడదు. తనదేహ మిట్టిదని తలంచినతోడనే సాధకుడగు వివేకి దానియందు వైరాగ్యము జనించునట్లు దృష్టి మరలించుకొనును.

దేహేంద్రియము లెంతకడిగినను, ఎన్నినాళ్లు తీర్థస్నానాది శౌచ

కర్మలు చేసినను లాభములేదు. తీర్థస్నానాది శౌచకర్మలు కేవలజ్ఞానికిగాని సుజ్ఞానినిమిత్తము చెప్పబడలేదని యెఱుంగుము.

మూ. బన్ధోహి వాసనాబన్ధో మోక్షస్స్యా ద్వాసనాక్షయః
వాసనాం సంపరిత్యజ్య మోక్షార్థిత్వ మపిత్యజ.

తా. "వాసనలయందు చిక్కుకొనుటయే సంసారము. వాసనలను విడుచుటయే మోక్షము." అని తెలిసి వాసనల నేవిధముగ విడచుచుంటివో అటులే మోక్షము నాకుకావలయు ననెడి యభిలాషనుకూడ వదలుము. సాధకుడ వగునీవు నిశ్చయముగ స్వయముగ బ్రహ్మస్వరూపుడవు. కావున నీకు బంధముగాని, తత్సాపేక్షమగు ముక్తిగాని దనియు, నీ యుభయము మాయికము — మిథ్య యనియు నమ్ముము. సర్వమును మాయికమే యగుట సర్వవాసనలను, సర్వమును విడువుము.

తన నంటియున్న సర్వవాసనలను అహంకార మమకారము లేకుండ విడువవలెను, గాని శ్రావణభాద్రపదముల వలె సర్వము పరుల పాలు గురువులపాలు చేయుమని యర్థముకాదు. తాను మానధనము యందు వాసనాబలమంతయు గురువునకు ధారపోయవలయు ననిగాని సర్వము వీథిలో పారబోయవలయు ననిగాని యనుకొనరాదు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" యని శ్రీకృష్ణు చెప్పినరీతి సమస్తములగు వాసనాదికములన్ను విడిచి భగవంతు నొక్కనినే శరణుపొందుడనును నభిప్రాయము నెఱింగి వాసనలను సమూలముగ విడిచి గాలిపటమువలె నీవుంటివేని నిన్నా భగవంతుడే రక్షించును. (వాసనా వర్జితుడు గాలిపటమువలె నుండును.)

గాలిపట మనగా నేమియో సాధకులు బాగుగ గ్రహింపవలెను. ఇయ్యది గురుముఖతా తెలియదగిన రహస్యాంశము.

మూ. తామ ప్పృథ పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితాం
శేషస్థిరసమాధానో మయిత్వం భజమారుతే!.

తా. ఓయాంజనేయా! కర్తృ కరణాది మనోబుద్ధిసమన్వితములగు ...భవాసనలను కూడ విడిచినవాడవై, సకలస్మృతులు నిషేధింపగా గిలెడి పరబ్రహ్మము (పరిపూర్ణము) నందే సుస్థిరానుభవము కల ...డవై నాయందే నీవు నిర్జీవ సమాధినిపొందుము.

మూ. దృశస్తు శుద్ధోఽహ మవిక్రియాత్మకో
నమేఽస్తి కిఞ్చిద్విషయ స్స్వభావతః
పుర స్తిరశ్చోర్ధ్వ మధశ్చ సర్వత
స్సుపూర్ణ భూమాహ మితీహ భావయ.

తా. ఓయాంజనేయా! నేను చైతన్య మాత్రస్వరూపుడననియు, ప్రకృతిసంబంధము లేనివాడ ననియు, ఈకల్పితవిషయము లేవియునాకు స్వభావముగనే లేవనియు, ముందువెనుక క్రింద మీదయను సంతటను ...ను అపరిచ్ఛిన్నానంద స్వరూపుడననియు తలంచి నీవునాలో (అఖండ ...రిపూర్ణములో) కలియుము. వాయువు వీచివీచి తుదకు స్తంభించి ...శ్చలమైనవిధముగ సుజ్ఞాని యగుసాధకుడు ప్రారబ్ధము నశింపగా స్తంభించి నిశ్చలమగును — అనియు శ్రీరామచంద్రమూర్తి యాంజనేయున కుపదేశించెను.

అక్షయమై వెలిగెడు సర్వాత్మ! నీకుమంగళము.
సాక్షాన్నిఖిలైకజగద్రక్షక! నీకుమంగళము.
ఆకృతిలేనట్టి సచ్చిదాత్మ! నీకుమంగళము.
ప్రాకృతజనుల కగపడని భవ్యమూర్తి! నీకుమంగళము.

భువనజాలములను జేయుప్రభూ! నీకుమంగళము.
భవవిధాతృహరివందితపాద! నీకుమంగళము.

మఙ్గళమ్‌గురుదేవాయ మహనీయగుణాత్మనే
సర్వలోకశరణ్యాయ సాధురూపాయమఙ్గళమ్.

ఓమ్

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే.
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

శ్రీ

సద్గురు
చరణార్పణమస్తు

శ్రీ చింతలపాటి వెంకటసుబ్బయ్య గారిచే
ఉపహారరించ బడినది.

సంపూర్ణము

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడు గారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపబడినది – 19[illegible]